# చతుర ప్రపంచం

## డర్టీమొగుడు

'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అని వేమన గారు శెలవిస్తే దాన్ని కొంచెం మార్చి "మొగుళ్లందు డర్టీ మొగుళ్లు వేరయా" అని అనుకుందో ఇల్లాలు.

ఆవిడను, ఆవిడ భర్త తీరును చూసిన జనం 'ఎంత సహనశీలివమ్మా!' అని కితాబులిస్తున్నారట. అంటే ఆయనగారి అశుభ్రతకీ, ఈవిడగారి సహనానికీ ఏదో సంబంధం ఉందనే అనిపిస్తుంది కదూ... నిజమే అయితే వివరాల్లోకి వెళ్లాల్సిందే.




అర్జెంటీనాలో ఓ ఇల్లాలు 'నాకు విడాకులు కావాలి' అంటూ కోర్టుకెక్కింది. సరే కోర్టువారు 'ఏమమ్మా! విడాకులెందుకు కావాలి?' అని అడిగితే సదరు ఇల్లాలు తన మొగుడికున్నంత అశుభ్రం, ఎద్ధకం ఎవరికీ ఉండవనీ, వాటిని భరించడం చాలా కష్టంగా ఉందనీ కళ్లనీళ్లు పెట్టుకుందిట. ఒకటా, రెండా పంథొమ్మిదేళ్లు ఓపిక పట్టాను. ఇక నా వల్ల కాదు బాబూ! నాకు విడాకులిప్పించండి అని మొర పెట్టుకుందిట. కోర్టువారు ఆమె చెప్పేదేవీ వినిపించుకోకుండా ఆమె పిటిషన్ డిస్మిస్ చేసేశారుట. లోకంలో భార్యలను కొట్టేవారు, అనుమానంతో వేధించేవారు, అక్రమ సంబంధాలు పెట్టుకునేవారు ఎంతో ఉన్నారు. వారి భార్యలంతా ఇలాగే కోర్టుకెక్కుతున్నారా? భార్యాభర్తలన్నాక గొడవలొస్తుంటాయి, రెండురోజులలో సర్దుకుంటాయి. కాబట్టి ఎలా ఆలోచించినా నీదో పెద్ద సమస్య కాదు కాబట్టి నీకు విడాకులు మంజూరు చేయడం ఎట్టి పరిస్థితుల్లోనూ వీలుకాదంటూ ఆమెను మందలించి పంపారు.

పాపం ఆవిడ సమస్య ఎంత తీవ్రమైనదో వాళ్లకేం తెలుసు? అందుకే ఆ ఇల్లాలు మళ్లీ విడాకులు కావాలంటూ కోర్టుకెక్కింది. తాను ఎంత చెప్పినా వినకపోవడంతో ఈసారి జడ్జిగారికి పాపం ఆమె చెప్పిన్నదంతా నిజమేనేమో అనే సందేహం కలిగి ఆవిడ భర్త గురించి రహస్యంగా ఎంక్వయిరీ చేయించారట. ఇలా ఎంక్వయిరీ పూర్తవడం ఆలశ్యం అలా ఆమెకు విడాకులు మంజూరు చేసేశారుట జడ్జిగారు. దాంతోపాటు 'అంత డర్టీ మొగుడితో ఇన్నాళ్లు ఎలా కాపురం చేశావమ్మా?' అంటూ బోలెడంత సానుభూతి కూడా కురిపించారుట.

ఇంతకీ ఆయన్ని అంతగా కదిలించిన ఎంక్వయిరీ తాలూకు సమాచారమేమంటే ఆ డర్టీ మొగుడు పరమ బద్ధకస్తుడట. అంతేనా అతనికి పరిశుభ్రత గురించి తెలీనేతెలియదట. రోజూ స్నానం చేయకపోయినా కనీసం వారానికోసారైనా బట్టలు



మార్చకపోవడం, గడ్డం, తల పెరిగిపోయినా షేవ్ చేసుకోకపోవడం, రోజూ బ్రష్ చేసుకోకపోవడం ఇవన్నీ మచ్చుకి కొన్ని అన్న మాట. ఇక టాయిలెట్‌కి వెడితే ఫ్లెష్ చేయడట. బాత్‌రూమ్‌లు, సింకులు కుళ్లు వాసన వస్తున్నా ఈ డర్టీ మొగుడికేం పట్టదట.

మరి బతికుండగానే అంతగా నరకం చూపుతున్న డర్టీ మొగుడినుంచి ఆ ఇల్లాలు విడాకులు కోరడం సమంజసమే. దాదాపు పంధొమ్మిదేళ్లు ఆ మొగుడితో కాపురం చేసినందుకు ఆ ఇల్లాలికి 'సహనశీలి' అన్న బిరుదు న్యాయమేకదా! మీరేమంటారూ?

---

## స్టార్ గాడిదలు

సినిమా నటుల మీద ఉన్న అభిమానంతో తమ పిల్లలకు వారి వారి అభిమాన నటీనటుల పేర్లు పెట్టుకోవడం మనకేం కొత్తకాదు. ఒక్కోటైంలో ఒక్కక్క నటుడికి లేదా నటికి బాగా డిమాండ్ ఉంటుంది. ఆవిధంగా చూస్తే ఆ టైంలో పుట్టిన పిల్లల్లో సగం మంది పిల్లలకు ఆ నటీనటుల పేర్లే ఉంటాయి. అలాగే వ్యాపారస్థుల విషయానికి వస్తే వాళ్ల షాపులకి ఆ నటుల పేర్లు పెట్టుకుని మురిసిపోతూ ఉంటారు. అంతా బాగానేఉంది కానీ ఈ మధ్య గాడిదలకు స్టార్స్ పేర్లు పెట్టేసి సంతలో వదిలారు. జైపూర్‌కు దగ్గర్లో ఉన్న గ్రామంలో గార్ధభాల సంత జరుగుతుంటుంది. దాదాపు మూడు రోజులపాటు ప్రతి ఏడూ జరిగే ఈ సంతలో మనకు మేలు జాతి గాడిదలు కనిపిస్తుంటాయి.

దేశవ్యాప్తంగా దాదాపు అన్ని రాష్ట్రాల నుంచీ మేలుజాతి గాడిదలను ఈ సంతకు తీసుకువస్తారు. సంతకు తీసుకురావడానికి ముందు మాత్రం వాటిని చక్కగా మేపి, శుభ్రంగా స్నానమదీ చేయించి తీసుకువస్తారు. అంటే సంత పుణ్యమా అని గాడిదలకు మంచి తిండి దొరుకుతుందన్నమాట.

సరే ఇక ఈ సంతలో ఏం జరుగుతుందంటే గాడిదల వంశ చరిత్ర దగ్గరనుంచి




దాని పళ్లు, కాళ్లు వరకూ నిశితంగా పరిశీలించిన మీదట క్రయ విక్రయాదులు జరుగుతాయి. ఈ నేపథ్యంలో ఎవరికి ఆలోచన వచ్చిందో తెలియదు గానీ స్టార్ గాడిదలు ప్రత్యక్షమవడం మొదలు పెట్టాయి. మారుతున్న ట్రెండ్లు ప్రకారం మనమూ మారాలనుకున్న ఓ గాడిద యజమాని తన గాడిదకి కరిష్మాకపూర్ అనీ మరో గాడిదకి షారూఖాన్ అని పేర్లు పెట్టి మామూలు కనా ఎక్కువ ధరకు అమ్మేయడంతో మిగ గాడిదల యజమానులు కూడా పంథాను అనుసరించడం మొదలెట్ట ఇంకేముంది సంతంతా స్టార్ గాడి ప్రత్యక్షమయ్యాయి. వాటిలో బాలీవుడ్ పేర్లన్నీ గాడిదలకి పెట్టేశారట. బ్రహ్మ డంగా అలంకరించిన స్టాల్స్‌లో తార పేర్లు పెట్టుకుని అమ్మకానికి నిలబడ్డ దలను చూడడానికి జనం బారు

తీరారుట.

పిల్లలకు, దుకాణాలకు మా పేర్లు పెట్టుకుంటే పోనీలెమ్మనుకున్నాం మరీ గాడిదలకి కూడానా అని తారలు బాధపడ్డా అమ్మడం కూడా వ్యాపారమే కాబట్టి మా అభిమానం ఇలా ప్రకటించుకున్నామని గార్దభాల యజమానులు అంటే చేయగలిగిందేమీ లేదు.

---

## తిమింగలంతో అనుభవం

1891 ఫిబ్రవరి లో బ్రిటిష్ నావికులు కొందరు సముద్రయానానికి బయలుదేరారు. వీళ్లెక్కిన ఓడ పేరు 'స్టార్ ఆఫ్ ది ఈస్ట్'. దక్షిణఅమెరికాకు దూరంగా ఫాక్‌లాండ్ దీవులకు 100 మైళ్ల తూర్పున ఈ ఓడ ఉండగా ఒక పెద్ద తిమింగలం దీనిని కొట్టింది. వైర్‌లెస్ ఇన్‌ఫర్మేషన్ అందగానే లాంగ్ బోట్లను సముద్రంలోకి వదిలారు అధికారులు. ఆ ఓడ "స్టార్ ఆఫ్ ది ఈస్ట్" ను తిమింగలం బారినుండి రక్షించడానికీ, అది ఏ ప్రదేశంలో ఉన్నదీ కనిపెట్టడానికీ లాంగ్‌బోట్లు ప్రయత్నిస్తూ ఉండగా వాటిలోని ఓ లైఫ్ బోట్‌ను కూడా తన తోకతో ఎత్తి కుదేసింది ఆ తిమింగలం. అందులోని ఇద్దరు వ్యక్తులు ఆకాశంలోకి ఎగిరి సముద్రంలోకి పడ్డారా తాకిడికి. వెంటనే నీరు ప్రశాంతమయింది. బోట్లన్నీ ఎలాగో ఒడ్డుకు చేరుకున్నాయి. 'స్టార్ ఆఫ్ ది ఈస్ట్' కూడా తీరం చేరింది. ఆ తిమింగలం మాత్రం విచిత్రంగా సాయంత్రానికి శవమై ఒడ్డుకు చేరుకుంది. అది చనిపోయినట్టు నిర్ధారణ జరిగింది గానీ పొట్ట భాగంలో కదలిక కనిపించడంతో షిప్ డాక్టర్‌కు అనుమానం వచ్చి పొట్ట భాగాన్ని మెల్లగా కోసి చూశాడు. అందులో తప్పిపోయిన ఇద్దరిలో ఒకడైన జేమ్స్ బార్ట్‌లీ చుట్టచుట్టుకుని పడుకుని అపస్మారక స్థితిలో ఉన్నాడు. బయటకి తీసి పరీక్షించారు. చర్మం తెల్లగా పాలిపోయినట్టుంది. శరీరంమీద వెంట్రుకలు కూడా లేవు. మొత్తం తిమింగలం కడుపులో అతను 10 గంటలున్నాడు. మెల్లగా కోలుకున్నాక జరిగినదంతా జ్ఞాపకం చేసుకుని చెప్పగలిగాడు. తిమింగలం తోకతో బోటుని ఎత్తివేసినప్పుడు అతడు పైకెగిరి కిందపడేటప్పుడు సరాసరి తెరిచివున్న తిమింగలం నోట్లోకి పడ్డాడు. పళ్లమధ్య ఇరుక్కున్నప్పుడు శూలాలతో పొడిచినట్టు బాధ కలిగిందట. అతడు ఈత వగైరా అన్నీ నేర్చుకున్నాక సముద్రయానానికి బయలుదేరడం అదే ప్రథమం. అదే ఆఖరు కూడా. ఎందుకంటే ఆ అనుభవంతో ఠారెత్తిపోయిన అతడు తమ పూర్వీకుల కాలం నుండీ వస్తున్న చెప్పులు కుట్టే పనిని చేపట్టాడు. అతడు చనిపోయాక అతని సమాధి మీద అతని జీవితంలో జరిగిన ఈ సాహస ఘట్టాన్ని రాసి పెట్టారట.

☆



# చతుర

సంపుటి : 24 సంచిక : 8 సెప్టెంబర్ : 2001
284వ సంచిక

దేవనర్తకీమణులు ఓ చల్లని సాయంకాలంవేళ భూలోకానికి వేంచేసి గగనవిహారం చేస్తుండగా... వారికి భూలోకంలోని సౌందర్యరాసులను రంభతో పోలుస్తున్న మగవారి పొగడ్తలు వినిపించాయి.

దాంతో రంభ "చూశారా! మీ అందరిలోకీ నేనే అందగత్తెని. కనుకనే భూలోకవాసులు అలా చెప్పుకుంటున్నారు" అంటూ గర్వంగా చెప్పుకుంది సఖులతో.

అందుకు తిలోత్తమ నవ్వి రంభకో రహస్యాన్ని వెల్లడించింది. దాంతో రంభ కోపం నషాళానికంటి... విసవిసా భూలోకంలోకి అడుగుపెట్టి... ఊర్వశీ, మేనక, తిలోత్తమాది సఖుల తిక్క కుదురుస్తానంటూ ప్రతిజ్ఞ చేసింది.

అటుపైన జరిగిన కథ ఏమిటి?

రంభకి తిలోత్తమ చెప్పిన రహస్యమేమిటి? అది రంభకెలా కోపకారణమయింది?

ఆమె భూలోకంలోకి వచ్చిన తరువాత ఏం జరిగింది? హాస్యరసభరితం

కొలపల్లి ఈశ్వర్ నవల

# హలో రంభా...!

ఈ నెల చతుర సమగ్ర నవల.

"పి ల్ల ఎలా ఉంది?"

పెళ్ళిచూపుల కెళ్ళొచ్చిన ప్రభాకర్‌నడిగాడు ఫణీంద్ర.

"రంభలా ఉంది" అన్నాడు ప్రభాకర్ ముఖాన్ని చేటంత చేసుకుని.

"అయితే నీకు నచ్చేసిందన్నమాట?"

"రంభలా ఉన్నాక నచ్చకుండా ఎలా ఉంటుంది?" చిరుకోపంగా అన్నాడు ప్రభాకర్.

"అవునవును. రంభలా ఉన్నాక నచ్చకుండా ఎలా ఉంటుంది?" స్వగతంగా అని,

"ఇంతకీ పప్పన్నం ఎప్పుడూ?" అనడిగాడు ఫణీంద్ర.

"పప్పన్నమేం ఖర్మ. ప్యారడైజ్‌లో బిర్యానీ పెట్టిస్తాను పద" అన్నాడు ప్రభాకర్ రంభలాంటి అమ్మాయిని చూసొచ్చిన ఆనందంలో.

"నా ఉద్దేశం ఇప్పటికిప్పుడు పార్టీ ఇవ్వమని కాదు. పప్పన్నమెప్పుడూ అంటే పెళ్ళెప్పుడని అర్థం" మిత్రుడికి లోకజ్ఞానం లేనందుకు లోలోన చింతిస్తూ చెప్పాడు ఫణీంద్ర.

"బహుశా మార్చిలో ఉండొచ్చు"

"ఏం. ఈలోగా ముహూర్తాలు లేవటనా?"

"అనే అనుకుంటున్నారు పెద్దవాళ్ళు"

"అలాగా. అద్సరే... కట్నమెంతిస్తానన్నారు?"

"ఎంతో కాదులే. ఓ యాభై" కించిత్ అసంతృప్తిగా పెదవి విరుస్తూ అన్నాడు ప్రభాకర్. "పిల్ల తండ్రి రిటైర్డు టీచరు. పెద్దగా సంపాదించలేదట. అంతకన్నా ఎక్కువిచ్చుకోలేమన్నారు"

"వాళ్ళంటే మాత్రం మీరెలా ఒప్పుకున్నారు? ఈ రోజుల్లో ఏ అడ్డమైన వెధవా లక్ష రూపాయలకి తక్కువేం తీస్కోవట్లేదు. అలాంటిది బ్యాంకుద్యోగమున్న నువ్వు యాభైవేల కొప్పేసుకోవడం ఛఛ ఏం బాలేదు"





"నువ్వసలు విషయం మర్చిపోతున్నావ్" అన్నాడు ప్రభాకర్.

"ఏంటసలు విషయం?"

"చెప్పానుగా... పిల్ల రంభలా ఉందని. అందుకే కట్నం విషయంలో అట్టే పట్టుబట్టడానికి నాకు నోర్రాలేదు. డబ్బులు ఇవ్వాళ కాకపోతే రేపైనా సంపాదించుకోవచ్చు. అయినా మాకు మాత్రం తక్కువేముంది గనక? మా నాన్న సంపాదించిందే కాదు. మా మేనమామకీ పిల్లల్లేరు. రేప్పొద్దున్న ఆయన పోయాక ఆ ఆస్తి కూడా నాకేగదా!"

"అంటే మీ మేనమామ రేపోమాపో పోయేలా ఉన్నాడా?"

"అదేంలేదు. రాయిలా ఉన్నాడు"

"మర్రేప్పొద్దున్న ఆయన పోతాడని ఎలా అన్నావ్?"

"రేప్పొద్దున్నంటే రేప్పొద్దున్నే అనికాదు. ఆయువు తీరి ఎప్పటికో ఒకప్పటికి పోకుండా ఉండడుకదా? అప్పుడాయన ఆస్తి కూడా నాకే వస్తుంది..." విసుగ్గా సమాధానం చెప్పి,

"అందుకే నేనామె అందానికి వెయిటేజీ మార్కులు వేశాను. డబ్బంటే మళ్ళీ మళ్ళీ సంపాదించుకోవచ్చు. కానీ పెళ్ళి అనేదాన్ని పదేపదే చేస్కోలేంకదా? అందుకే అలా ఒప్పేసుకున్నాను" అన్నాడు ప్రభాకర్.

"అయితే రంభలాంటి ఆమె అందం నీ నోటిని కట్టిపడేసిందన్నమాట. అంతేనా?"

"అంతే" అంటూ ఆనందంగా నవ్వాడు ప్రభాకర్.

రంభలాంటి అమ్మాయి ఇల్లాలిగా రాబోతుంటే ఏ మగాడు మాత్రం సంతోషించకుండా ఉండగలుగుతాడు.

★ ★ ★

"ఏంట్రా ఆలోచిస్తున్నావ్?"

రెండుత్తరాల్ని ముందేసుక్కూర్చుని రెండింటికేసీ మార్చిమార్చి చూస్తూ యమ సీరియస్‌గా ఆలోచిస్తున్న సులోచనరావు నడిగాడు సుధీర్‌బాబు.

"కమల గురించీ, కస్తూరి గురించీ"

"నేనుకూడా మన క్లాసులోని అమ్మాయి లందరి గురించీ ఆలోచిస్తూనే ఉంటానె ప్పుడూ. అసల్సంగతి చెప్పకుండా అలా పొడిగా చెబితే ఏమర్థమవుతుంది. సంగ తేంటో సరిగ్గా చెప్పేడువ్" అన్నాడు సుధీర్ కాస్త కోపంగా.

"ఇది కమల రాసిన ఉత్తరం" అన్నాడు సులోచనరావ్ చేతిలోని పెన్నుని ఓ ఉత్తరా నికి తాటిస్తూ. వెంటనే అదే కలాన్ని ఇంకో ఉత్తరానికి తాటిస్తూ,

"ఇది కస్తూరి రాసిన ఉత్తరం" అన్నాడు.

సుధీర్ ఆ రెండు ఉత్తరాలకేసీ మార్చి మార్చి చూసి "ఏంటీ? వాళ్ళిద్దరూ నీకు ఉత్తరాలు రాశారా? ఎందుకూ? " అన్నాడా శ్చర్యంగా.

"వారి వారి హృదయాల్ని నాకు విప్పి చెప్పటానికే" కించిత్ గర్వంగా అన్నాడు సులోచనరావు.

"హృదయాల్ని విప్పిచెప్పడం అంటే? "

"ప్రేమని వ్యక్తం చేయడం అన్నమాట"

"ఎవరి ప్రేమని? "

"వాళ్ళ ప్రేమనే. వాళ్ళిద్దరూ నన్ను గాఢంగా ప్రేమిస్తున్నారు? "

"నిజంగానా? " నోరు వెళ్ళబెట్టాడు సుధీర్.

"కాదు. ఉత్తుత్తికే. లేకపోతే ఏంటా పిచ్చి ప్రశ్న? నీకంత డౌటుగా ఉంటే ఇదుగో వాళ్ళు రాసిన ఉత్తరాలిక్కడే ఉన్నాయ్‌గా? చదువు..." అన్నాడు సులోచనరావ్ చిరాగ్గా.

అసలే ఇద్దరమ్మాయిలొకేసారి ప్రేమలే ఖలు రాయగా ఆ ఇద్దర్లో ఎవర్నెన్నుకోవాలో తెలీక చస్తుంటే... మధ్యలో మిత్రుడు తల దూర్చి అలాంటి కుశంకలు వ్యక్తంచేస్తే చిరాకు పుట్టకుండా ఎవరికుంటుంది!

"ఏంటీ? ఇవి రెండూ ప్రేమలేఖలా? " ముక్కెగబీలుస్తూ ఆ రెండు ఉత్తరాలకేసీ తన్మయంగా చూశాడు సుధీర్.

"ఎందుకలా ముక్కెగబీలుస్తావ్? ప్రేమ లేఖల్లోంచి ప్రేమవాసనేం బైటికి రాదులే. కావాలంటే చదువుకో" అన్నాడు సులోచన రావింకా చిరాగ్గా!

సుధీర్ ఆ రెండు ఉత్తరాల్నీ అందుకో బోయి అంతలోనే ఆగిపోయాడు.

పరులకొచ్చిన ప్రేమలేఖల్ని చదవకూడ దన్న ఇంగితం అతన్లో మేల్కోవడం అందుకు కారణం.

"నీకొచ్చిన ప్రేమలేఖల్ని నేను చదవడం సభ్యతగా ఉండదులే" అని,

"ఒకే! ఒప్పుకుంటున్నాను, అవి రెండూ ప్రేమలేఖలేనని. అద్భురే. ఇద్దరమ్మాయిలు ఒకేసారి ప్రేమలేఖలు రాస్తే ఎగిరి గంతే యాల్సింది పోయి ఇలా ఆలోచిస్తూ కూర్చు న్నావేం? " అన్నాడు సుధీర్.

అన్నాక... 'నీకేవన్నా పిచ్చా? ' అన్నట్టుగా చూశాడు మిత్రుడికేసి.

"నీముందు రెండు తీపి పదార్థాలు పెట్టా రనుకో. నువ్వందులో దేన్ని తీస్కుం టావ్? " అన్నాడు సులోచనారావు భావగ ర్భితంగా చూస్తూ.

ఆ భావగర్భితమైన చూపులోని భావాన్ని గ్రహించకుండా "దాందేముందీ? రెండూ కొంచెం కొంచెం రుచి చూస్తా" అనేశాడు సుధీర్ నాలుక చప్పరిస్తూ.

ఆ నాలుకని తెగ్గోయాలన్నంత కోపమొ చ్చింది సులోచనరావుకి.

"కొంచెం కొంచెం రుచ్చూసి వదిలేయడా నికి కమల, కస్తూరి జీవంలేని తీపిపదార్థా లేంకాదు. మనసున్న మనుషులు. ఆ మన సుల్నిండా నా రూపాన్ని నింపుకున్న మను షులు. అందుకే నేనిలా మథనపడుతున్నా, ఆ ఇద్దర్లో ఎవరి ప్రేమనంగీకరించాలా అని" అంటూ అసలు విషయాన్ని స్పష్టంగా చెప్పాడు సులోచనరావు.

"అదా నీ సమస్య. మరాసంగతి ముందే చెప్పొచ్చుగా? తీపిపదార్థాలు, గాడిద గుడ్డూ అంటూ బోడి ఉపమానాలెందుకు? " అని విసుక్కుని... "ఇందులో ఆలోచించాల్సింది

ఏముందిరా? కస్తూరి ప్రేమనే అంగీకరించు" అన్నాడు సుధీర్‌బాబు.

"కస్తూరి ప్రేమనే ఎందుకంగీకరించాలి?"

"కళ్ళున్నవాడెవడైనా కస్తూరినే కోరుకుంటాడు కాబట్టి" ముందు కాస్త వెటకారంగా అని...

"ఆ ఇద్దర్లో ఆ పిల్లే బాగుంటుంది కదా" అంటూ వివరణ ఇచ్చాడు సుధీర్‌బాబు.

"బావుండటం అని మెల్లిగా అంటావేం? కస్తూరి రంభలా ఉంటుంది" ఆమె రూపం కళ్ళముందుకు రాగా తన్మయంగా అన్నాడు సులోచనరావు.

"మరందుకే కస్తూరినే ఎన్నుకోమంటున్నా" అంటూ అతని భుజంమీద చరిచాడు సుధీర్‌బాబు.

"అంతేనంటావా?" చరిచిన చోట చేత్తో రుద్దుకుంటూ అడిగాడు సులోచనరావు.

"కాక మరేంట్రా? రంభలాంటి అమ్మాయిని కాదని ఆ చీకిరికళ్ళ కమలనెలా ప్రేమిస్తావు?" అన్నాడు సుధీర్‌బాబు.

"నువ్ చెప్పినట్టే కస్తూరి ప్రేమనే అంగీకరిస్తాలే" అంటూ తనముందున్న రెండు ఉత్తరాల్లోంచి కమల రాసిన ఉత్తరాన్ని తీసుకుని దాన్ని ముక్కలు ముక్కలుగా చింపేశాడు సులోచనరావు.

ఫలితంగా...

రంభలా లేని ఒకమ్మాయి ప్రేమ ఛిన్నాభిన్నమై చెత్తబుట్టలోకి చేరిపోయింది.

★ ★ ★

దేవనర్తకీమణులు నలుగురూ ఏదో ఈవినింగ్ వాక్‌గా గగనవిహారం చేస్తుండగా ఆ దృశ్యం వాళ్ళ కంటపడింది.

"విన్నారుగా వాళ్ళెలా మాట్లాడుకుంటున్నారో?" అంది రంభ గర్వంగా.

"ఎలా మాట్లాడుకుంటున్నారు?" అంది మేనక నుదురు చిట్లిస్తూ.

"మీ చెవులు గాని దిబ్బళ్ళేసిపోయాయా ఏమిటి?" అంటూ మూతితిప్పి,

"మనం నలుగురం ఉండగా వాళ్ళు పదే పదే నా పేరునే ప్రస్తావించడం మీరు గమనించలేదా?" అంది రంభ మళ్ళీ గర్వంగా.

"అయితే ఏంటట?" అంటూ ఈసారి ఊర్వశి నుదురు చిట్లించింది.

"ఏముందీ? వాళ్ళు మిమ్మల్ని తల్చుకోకుండా 'రంభలా ఉంటుంది, రంభలా ఉంటుంది' అంటూ ఒకటికి పదిసార్లు ఆ భూలోక అందగత్తెల్ని నాతోనే పోలుస్తున్నారూ అంటే..." అంటూ మాట పూర్తిచెయ్యకనే ముసిముసిగా నవ్వింది రంభ.

"ఆ చెప్పేదేదో పూర్తిగా చెప్పి చావు" అంది తిలోత్తమ కోపంగా.

"ఇందులో ఇంతకన్నా స్పష్టంగా చెప్పటానికేముంది? భూలోక వాసులకి అందం అనగానే నా పేరే గుర్తొస్తుంటుందంటే వాళ్ళకి నా అందం మీదున్న ఇంప్రెషన్ అలాంటిదన్నమాట. మన నలుగుర్లోకీ నేనే అందగత్తెనన్నమాట" అంది రంభ గర్వంగా భుజాలెగరేస్తూ.

మిగతా ముగ్గురికీ సహజంగానే ఒళ్ళు మండిపోయింది.

నలుగురాడాళ్ళలో ఒకామె అలా అహంకరించి మాట్లాడితే మిగతా ముగ్గురికీ కోపం రాకుండా ఎందుకుంటుంది?

"చాల్చాల్లే తగ్గవమ్మా" అంది మేనక కోపంగా.

"ఊరికే అలా మిడిసిపోకు" అంది ఊర్వశి ఉక్రోషంగా.

తిలోత్తమ కూడా ఏదో అనబోయింది. గానీ... అంతలో రంభే అంది "ఇందులో మిడిసిపాటేముందీ? వాళ్ళు పదేపదే నన్ను గుర్తుచేసుకోవడం మీరూ విన్నారుగా?"

అప్పుడు నవ్వింధి తిలోత్తమ కిసుక్కున.

"ఎందుకా నవ్వు?" రంభ కోపంగా చూసింది తిలోత్తమకేసి.

మిగతా ఇద్దరూ కూడా ఆశ్చర్యంగా చూశారామెకేసి.

"ఎందుకా?" అంటూ మళ్ళీ కిసుక్కున

నవ్వి ఆమీదట అంది తిలోత్తమ, "నీ అమాయకత్వానికి జాలిపుట్టి"

"దేన్నిగురించి నువ్ అంటూంట? "కోపంగా అడిగింది రంభ.

"లేకపోతే ఏంటి? వాళ్ళు 'రంభలా ఉంటుంది, రంభలా ఉంటుంది' అని ఉపమానించిన ఆయా అమ్మాయిల్ని నీతో పోల్చి చూసుకుంటున్నావా? "

"కాక? " అంది రంభ కన్‌ఫ్యూజ్ అయిపోతూ.

"వాళ్ళా అమ్మాయిల అందాన్ని పోల్చింది నీతో ఏం కాదు. భూలోకంలో మరో రంభ ఉంది. ఆమెతో పోల్చి వాళ్ళలా మాట్లాడుకుంటున్నారు"

"భూలోకంలో మరోరంభా? ఎవరా మహాతల్లి? " కోపంతో ఉడికిపోతూ అంది రంభ.

"అభినేత్రి రంభ! అబీబీ అబీబీ అని చిరంజీవితో డ్యూయెట్లు పాడుతుందిగా... ఆ రంభ" అంది అక్కసుగా నవ్వుతూ తిలోత్తమ.

వాళ్ళు నలుగురూ తరచుగా ఇలా షికార్లు కొడుతూనే ఉంటారు కాబట్టి వాళ్ళందరికీ భూలోక విషయాలు బాగానే తెలుసు.

"అదేంకాదు. నువ్ అసూయకొద్దీ అలా అంటున్నావు. వాళ్ళు మాట్లాడింది నా గురించే" అంది రంభ తిలోత్తమ మాటలకి ఒకపక్క తికమకపడిపోతూనే, మరోపక్క ఉక్రోషపడిపోతూ.

"కావాలంటే నువ్వే వెళ్ళి వాళ్ళనడుగు" అంటూ వెక్కిరించింది తిలోత్తమ.

"అంటే? "

"ఆ ప్రభాకర్ దగ్గరికీ, సులోచనరావు దగ్గరికీ వెళ్ళి విషయం అడిగి తెలుసుకోమరి" అంది తిలోత్తమ.

"సరే! అలాగే చేస్తానైతే" అంది రంభ మరింత ఉక్రోషంగా.



"ఏంటే నీకు లీవు కావాలా? ఎందుకూ? " రవంత అయోమయంగా అడిగాడు దేవేంద్రుడు.

"నేను భూలోకానికెళ్ళాలి" అంది రంభ.

"భూలోకానికి వెళ్తావా? దేనికి? "

"సతాయింపులు మాని లీవ్ శాంక్షన్ చేస్తారా లేదా? అది చెప్పండి" అంది రంభ చిరాగ్గా.

"హు... ఆ మనుషుల్ని చూసి స్వర్గలోకవాసులు కూడా ఇలా చెడిపోతున్నారు. ఇదివరకెంత ఒబీడియంట్‌గా ఉండేవాళ్ళు. అలాంటిదిపుడు లీవులూ, హక్కులూ అంటూ ఆ మనుషుల్ని చూసి పూర్తిగా చెడిపోయారు. దానికితోడు నాలుగు ఇంగ్లీష్ ముక్కల్ని ఒంటబట్టించుకుని ఎడాపెడా వాగడం ఒకటి" అని మనసులో బాధగా అనుకుని,

"సరే! ఇటీజ్ యువర్ రైట్! కాదంటానికి నేనెవర్ని? ఎన్నిరోజులు కావాలి నీకు లీవు? " అనడిగాడు దేవేంద్రుడు.

"జస్ట్. ఒన్ డే చాలు. అక్కడికెళ్ళాక అవసరం పడితే ఎక్స్టెండ్ చేస్తా" అంది రంభ

"ఓ.కే. గ్రాంటెడ్" అనేశాడు దేవేంద్రుడు గత్యంతరం లేక.

"ఇపుడు రోజులిదివరకట్లా లేవు. స్వర్గ లోకం స్టాఫ్‌లో ఎవర్నేమన్నా ఊర్కోడం లేదు. బాస్ అన్న గౌరవమైనా లేకుండా లా పాయింట్లు తీసి మాట్లాడుతున్నారు" అని లోలోపలే గొణుక్కున్నాడు.

అందుకే... రిజెక్ట్ చేసే అధికారముండి కూడా రంభకి అంత తేలిగ్గా లీవ్ గ్రాంట్‌చేసేశాడు దేవేంద్రుడు.

దాంతో "ఓకే బాస్! థాంక్యూ వెరీమచ్. ఐ విల్ సీ యూ ఎగైన్" అని చెప్పి అక్కణ్ణుంచి వచ్చేసింది రంభ.

★ ★ ★

"దేవేంద్రులవారు లీవ్ గ్రాంట్ చేశారు. నేను రేపే భూలోకానికెళ్తున్నా" అంది రంభ మిగతా ముగ్గురు దేవనర్తకీమణులతో.

"వెళ్ళి? " అంటూ కిసుక్కున నవ్వింది తిలోత్తమ.

"ఎందుకిలా మాటిమాటికీ కిసుక్కుమని నవ్వుతావ్? నే వెళ్ళి ఆ ప్రభాకర్‌నీ, సులోచనరావునీ మీట్టై వ్యవహారమేంటో అడిగి తెల్సుకుంటాను" అంది రంభ ఉక్రోషంగా.

"ఏమని అడుగుతావ్? " అంది మేనక.

"ఏమనేముంది? నిన్న మనం అనుకున్నదే..."

"సరే వెళ్ళిరా" అనేసింది తిలోత్తమ వెటకారంగా.

"వాళ్ళు మెచ్చుకున్నది నా అందాన్నే అని రుజువైతే నువ్ నాకేమిస్తావ్? " అంటూ ఆమెకేసి క్రోధంగా చూసింది రంభ.

"ఏమీ ఇవ్వను. నిన్న మనం మాట్లాడుకున్నప్పుడు మనమధ్య అలాంటి పందేలేం కుదర్లేదు. అయినా వాళ్లు మాట్లాడుకున్నది అభినేత్రి రంభ గురించేనని నాకు స్పష్టంగా తెలుసు. నువ్విపుడెళ్ళేది నీ సందేహనివృత్తి కోసమే కాబట్టి ఇవ్వడాలు గివ్వడాలు ఏం లేవ్" అనేసింది తిలోత్తమ నువ్ వెళ్తే మాకేంటి? వెళ్లకపోతే మాకేంటి? అన్నట్టు నిర్లక్ష్యంగా తలెగరేస్తూ.

ఆ నిర్లక్ష్యానికి సహజంగానే ఒళ్లు మండింది రంభకి.

"ఓడిపోతానన్న భయంతోనే నువ్ పందేనికి ఒప్పుకోవట్లేదు నాకు తెలుసులే" అని మూతి తిప్పింది రంభ.

"ఓటమి భయం నాకేం లేత్తల్లీ! నీకంత గులానందంగా ఉంటే నేనెందుక్కాదనాలి? సరే వడ్డాణం వడ్డాణం పందెమైతే" అంది తిలోత్తమ.

అంటూనే తన వడ్డాణాన్ని తీసి మేనక్కిచ్చిందామె.

"నువ్ కూడా నీ వడ్డాణం తీసి మేనక్కివ్వు" అంది రంభని చూసి కళ్లెగరేస్తూ.

దాంతో రంభ కూడా తన వడ్డాణాన్ని తీసి మేనకకి ఇచ్చింది.

అది ఓడిపోవటం ఖాయం! ఇకనుంచి నాకు రెండు వడ్డాణాలు" అంటూ గర్వంగా నవ్వింది తిలోత్తమ.

మిగతా ఇద్దరిక్కూడా రంభ మీద మంటగానే ఉన్నందున...

"డెఫినిట్‌గా ఓడిపోతుంది" అంది మేనక.

"దాని గర్వం అణిగిపోవటం ఖాయం" అంది ఊర్వశి.

అంతలో "నారాయణ...నారాయణ" అంటూ అటుగా వచ్చాడు నారదుడు.

"హాయ్ స్మార్ట్‌గాళ్స్! ఏంటేదో గర్వమంటున్నారు? ఎవరి గురించీ? " అన్నాడు దీర్ఘంతీస్తూ.

వాళ్లు ముగ్గురూ ఒకరితో ఒకరు పోటీలు పడుతూ విషయం వివరించగా.

"పూర్‌గాళ్" అన్నాడు నారదుడు రంభనుద్దేశించి జాలిగా.

"ఆ అహంకారి ఓడిపోవడం ఖాయమే గదా నారదా? " నారదుడలా అనేసరికి సంతోషంగా అడిగింది తిలోత్తమ.

"నైన్‌టీ నైన్ పర్సెంట్ ఓడిపోవటానికే

ఛాన్సెక్కువగా ఉంది" అన్నాడు నారదుడు ఎటూ తేల్చిచెప్పకుండా.

★ ★ ★

దేవలోక వాసులు ఒకరిజినల్ గెటప్‌తో భూలోకానికెళ్తే ఎన్నెన్ని పాట్లు పడాల్సొంటుందో ఎన్నెన్ని అవమానాలు భరించాల్సి వస్తుందో గతంలో అనేకానేక సినిమాల్లో చూసి ఉన్నందువల్ల తన నగలూ గట్రా స్వర్గలోక సెక్యూరిటీ విభాగంలో అప్పగించి నార్మల్ దుస్తుల్లో భూలోకంలో కాలుపెట్టింది రంభ.

గెటప్ మారినా దేవతా శక్తులేం పోలేదు కాబట్టి ప్రభాకర్ అనే కుర్రాడి రూమెక్కడండీ? అని ఎవర్నీ అడగనక్కర్లేకుండానే నేరుగా ప్రభాకర్ రూంకి చేరుకుంది రంభ.

ఆమె వెళ్లేసరికి ప్రభాకర్ ఏదో దినపత్రికలోని క్రాస్‌వర్డ్ పజిల్‌ని పూర్తి చేస్తూ ఉన్నాడు.

అతగాడి రూమ్మేటూ కమ్ సహోద్యోగీ అయిన ఫణీంద్ర ఆత్మవిశ్వాసాన్ని పెంచే ఒకానొక బ్లేడుతో షేవ్ చేస్కుంటూ ఉన్నాడు.

గుమ్మం దగ్గర నిలబడిన రంభ తన ఉనికిని తెలియజేయటానికన్నట్టుగా ఓ పొడి దగ్గుదగ్గి "ఎక్స్‌క్యూజ్‌మీ! మే ఐ కమిన్ ప్లీజ్" అంది స్టైల్‌గా.

ఆడ కంఠం విన్పించగానే సహజంగానే చేతిలోని పేపర్ని ఓ పక్కకి గిరాటేసి ఆత్రంగా గుమ్మంకేసి చూశాడు ప్రభాకర్.

ఎదురుగా సాదాసీదా దుస్తుల్లో రంభ.

ఆవిడ దేవనర్తకీమణి అన్న సంగతి ప్రభాకర్‌కేం తెలుసు?

అంచేత పొద్దున్నే ఎవరో సేల్స్‌గాళ్ తయారైనట్టుంది అనుకుని "ఎస్! గెటిన్" అన్నాడు తనూ స్టైయిల్‌గా.

వచ్చిన అమ్మాయి అందంగా ఉండటం వల్ల ఫణీంద్ర కూడా షేవ్ చేస్కోవటం మధ్యలో ఆపేసి ఆమెకేసి కుతూహలంగా చూశాడు.

అతను కూడా ఆమెని సేల్స్‌గాళ్ అనే అనుకున్నాడు.

సిటీలో అలా ఎవరో ఒకరు సేల్స్‌గాళ్స్ వచ్చిపోతుండటం మామూలే.

రంభ లోపలికొచ్చి ఖాళీగా ఉన్న ఓ కుర్చీలో కూర్చుంది.

'అబ్బ! ఎంత అందంగా కూర్చుందో' అనుకున్నాడు ప్రభాకర్ ఆమె కూర్చోవడాన్ని చూసి.

ఫణీంద్ర కూడా అలాగే అనుకున్నాడు.

బ్రహ్మచారుల హృదయాలు ఏ అందమైన అమ్మాయిని చూసినా స్పందించటం మామూలే!

కుర్చీలో కూర్చున్నాక రంభ ఓమారు ఆ గదినంతా కలియజూసింది.

చిన్నాచితకా సామగ్రి మాటెలా ఉన్నా గోడలకున్న ఓ రెండు క్యాలెండర్స్ ఆమె దృష్టిని బాగా ఆకర్షించాయి.

ఒకటి మాధురీ దీక్షిత్‌ది.

రెండోది రంభది. అభినేత్రి రంభది.

"మీరిద్దరూ మాధురీ, రంభల ఫ్యాన్సా?" ప్రభాకర్‌కేసి క్రీగంట చూస్తూ అడిగింది రంభ.

తనని తాను పరిచయం చేస్కోకుండానే ఆమె నేరుగా అలా ఇంటర్వ్యూ ప్రారంభించేసరికి మిత్రులిద్దరూ ఒకింత కన్‌ఫ్యూజ్ అయ్యారు.

"అవునండీ మేమిద్దరమూ వాళ్లిద్దరి ఫ్యాన్సుమే! ఇంతకీ మీరెవరూ?"

"నేనెవరైందీ మీకు తర్వాత చెప్తాలేగానీ ముందు నేనడిగిన ప్రశ్నలకి సమాధాలు చెప్పండి" అంది రంభ.

"మీ ఇద్దరికీ వాళ్లిద్దర్లో ఎవరంటే ఎక్కువ ఇష్టం?"

"ఇద్దరన్నా ఇష్టమేనండీ" అన్నాడు ప్రభాకర్.

"అలాక్కాదు. ఏదో ఒక్క పేరే చెప్పండి" అంది రంభ.

ఆ మరుక్షణం..





"రంభ" అన్నారు మిత్రులిద్దరూ సంయుక్తంగా.

"ఆమె అంటేనే ఎందుకెక్కువిష్టం? " ముఖాన్న గంటు పెట్టుకుంటూ అడిగింది రంభ.

"ఆమె మా తెలుగమ్మాయి కాబట్టి. అదీ గాక డాన్సూ నటనా అదరగొట్టేస్తుంది కాబట్టి"అన్నాడు ప్రభాకర్.

"మీ ఉద్దేశం కూడా అదేనా? " అర్ధషేవ్ చేస్కుని ఉన్న ఫణీంద్రవైపు తిరిగి అడిగింది రంభ.

తెలీనట్టడుగుతారేంటండీ బాబూ?.

■

చూడండి. ఆ నవ్వెంత అందంగా ఉందో? ఆ ముక్కెంత అందంగా ఉందో! ఆ కళ్లెంత అందంగా ఉన్నాయో? "అంటూ గోడమీద రెపరెపలాడుతోన్న రంభ క్యాలెండర్‌కేసి కుడిచేత్తో చూపించి "షి ఈజ్ ఎ పారగాన్ ఆఫ్ బ్యూటీ అండీ! నిజంగా అంత అందమైన అమ్మాయిలు ఏడేడు లోకాల్లో ఎందెందు వెతికినా కన్పించరు మనకి" అన్నాడు ప్రభాకర్ తన్మయంగా. ఆ తన్మయత్వం ఎదురుగా అసలైన రంభ ఉన్నం



దుకు కాదు. గోడమీది అభినేత్రి రంభ క్యాలెండర్ గాలికి అందంగా ఎగురుతున్నందుకు.

రంభకి సహజంగానే చాలా చేదుగా అనిపించాయి ఆ మాటలు.

"అదేంటండీ, అలా అంటారు? స్వర్గంలో ఒరిజనల్ రంభుంటుంది కదా! ఆమెకన్నా బాగుంటుందా ఈ రంభ? "అంది అదోలా చూస్తూ.

"స్వర్గంలో ఒరిజినల్ రంభ ఉంటుందో ఉండదో ఎవరికి తెలుసండీ? మనమెప్పుడైనా చూసి చచ్చామా ఏంటి? ఒకవేళ ఉన్నా ఆవిడగారు మా ఫేవరెట్ యాక్ట్రెస్ రంభకన్నా బాగుంటుందని నేననుకోను" అన్నాడు ప్రభాకర్.

"తమరి అభిప్రాయం? " కంఠంలో వ్యంగ్యాన్ని మేళవించి ఫణీంద్ర నడిగింది రంభోసారి.

"వాడి అభిప్రాయమే నా అభిప్రాయమండీ" అన్నాడు ఫణీంద్ర.

"నోర్ముయ్యరా అర్ధషేవ్ మొహమా? "అని కోపంగా అరవాలనిపించింది రంభకి. అయినా నిగ్రహించుకుందెలాగో.

అంతలో ప్రభాకర్ అడిగాడు "మీరీ ప్రశ్నలన్నీ ఎందుకడుగుతున్నారండీ? అసలింతకూ మీరెవరు? "

'నేనెవరినైతే నీకెందుకుర్రా కూజా మొహమా? ' అనుకుంది రంభ.

"అదంతా తర్వాత చెప్తానన్నాగా? ముందు నేనడిగే మరి కొన్ని ప్రశ్నలకి జవాబులు చెప్పండి" అంది పైకి. మనసులోంచి కోపం ఎగదన్నుకొస్తున్నా ముఖాన్ని మాత్రం ప్రశాంతంగానే ఉంచుకోగలిగిందామె. ఎంతైనా దేవనర్తకీమణి కదా?

"ఇట్సాల్ రైట్. అడగండడగండి" అన్నాడు ప్రభాకర్ ఉత్సాహంగా.

ఆ ఉత్సాహం ఏదో ప్రత్యేకమైన కారణముండి కాదు, ఎదురుగా ఓ అందమైన అమ్మాయుంటే ఏ కుర్రాడికైనా ఉత్సాహంగానే ఉంటుందికదా?

"మీకు పెళ్లైందా? "

"మీకంటే నాకా వాడికా? "

"మీ ఇద్దరికీను"

"మా ఇద్దరికీ పెళ్లెలా అవుతుందండీ? నేనూ మగాణ్ణే, వాడూ మగాడే! మగాడికీ మగాడికీ పెళ్లేంటసహ్యంగా? " అన్నాడు ప్రభాకర్.

కానీ అతనూహించినట్టు లేదా ఆశించినట్టూ రంభేం విరగబడి నవ్వలేదు.

తీక్షణంగా చూసి "మీ ఇద్దరికీ అంటే ఒకరితో ఒకరికి అనికాదు వేర్వేరుగా" అంది కోపంగా.

"వేర్వేరుగా కూడా మా ఇద్దరికీ పెళ్లిళ్లవ్వలేదండీ" అన్నాడు ప్రభాకర్ బుద్ధి తెచ్చుకుంటూ.

"పోనీ పెళ్లి చూపులైనా అయ్యాయా? "

రంభ ప్రశ్నకి ప్రభాకర్ ఒకింత బిడియంగా నవ్వాడు.

"నాకయ్యాయండీ మొన్న" అన్నాడు బిడియంగా.

"తెలుసులేవోయ్" అని మనసులోనే అనుకొని "పిల్ల ఎలా ఉంది? " అనడిగింది రంభ.

"రంభలా ఉందండీ" అన్నాడు ప్రభాకర్.

"ఏ రంభలా? " ఆత్రంగా అడిగింది రంభ.

"అదుగో ఆ రంభలాగేనండీ" అంటూ గోడమీదున్న అభినేత్రి రంభ క్యాలెండర్‌కేసి చూపించాడు ప్రభాకర్.

దాంతో రంభ మొహం పెంకులా మాడిపోయింది.

"అదేంటండీ సడన్‌గా అలాగైపోయారు? " అన్నాడు ప్రభాకర్ కొంచెం ఆందోళనగా.

"ఎబ్బే ఏం లేదు" అంటూ దిగ్గున లేచి నిలబడింది రంభ.

"అదేంటండీ అప్పుడే లేచారు? అసలింతకీ మీరెవరో ఎందుకొచ్చారో అవేమీ చెప్పనేలేదుగా? " అన్నాడు ప్రభాకర్.

"చెప్పాల్సిన అవసరం అంతగా లేదు

లెండి" అనేసి గుమ్మం వేపు అడుగులు వేసింది రంభ.

ఆమె అలా గుమ్మం వైపు అడుగులే స్తుంటే ఫణీంద్రకు నిన్న సాయంత్రం టీవీలో చూసిన ఓ ప్రకటన జ్ఞప్తికొచ్చింది.

మతిస్థిమితం లేని ఓ అందమైన ఇరవ య్యేళ్ల యువతి ఇల్లు విడిచి పారిపోయిన బాపతు ప్రకటన అది.

కొంపదీసి ఆ అమ్మాయే ఈ అమ్మాయి కాదుగదా? అన్న డౌటొచ్చి చటుక్కున ఆమెని సమీపించి 'ఆగక్కడ' అన్నాడామె చేయి పట్టుకుంటూ.

ఒక నరాధముడు తన చేయి పట్టుకుంటే రంభెందుకూర్కుంటుంది?

ఫలితం?

అతని చెంప బూరెలా ఉబ్బిపోయింది.

జరిగిందేమిటో అతను గ్రహించే లోగానే ఆమె విసవిసా బైటికెళ్లిపోయింది.

"అబ్బ! ఎంత గట్టిగా కొట్టిందిరా పిచ్చి రాస్కెల్" అన్నాడు ఫణీంద్ర ఉబ్బిపోయిన చెంపని నిమురుకుంటూ.

"పిచ్చి రాస్కెలా? " ఆశ్చర్యంగా అన్నాడు అప్పుడే మిత్రుణ్ణి సమీపించిన ప్రభాకర్.

"అవున్రా! నిన్న సాయంత్రం టీవీలో ఓ ప్రకటన చూశాను" అంటూ తనకొచ్చిన సందేహాన్ని మిత్రుడికి తెలియజేశాడు ఫణీంద్ర.

"పిచ్చిదా? మరైతే పట్టుకోలేకపో యావా?" అన్నాడు ప్రభాకర్.

"పట్టుకోబోయినందుకేగా గూబ పగి లింది? " అన్నాడు ఫణీంద్ర మరోమారు ఉబ్బిపోయిన చెంపని రుద్దుకుంటూ.

దరిమిలా వాళ్లిద్దరూ వీధిలోకి పరుగు తీశా రుగానీ అప్పటికే కనుమరుగైపోయిందామె.

తీరుబాటుగా నడుచుకుంటూ వెళ్లటానికి ఆవిడేవన్నా మానవకాంత అయితేగా?

ఇలా బైటికి రాగానే అలా అంతర్ధానమై పోయిందామె.

ఆ సంగతి పాపమా నరాధములకేం తెలుసు?

"అబ్బ! ఎంతలోకి మాయమైపోయిందిరా" అన్నాడు ప్రభాకర్ ఆశ్చర్యంగా.

"పిచ్చివాళ్లు చాలా స్పీడుగా వెళ్లిపోతార్రా" అన్నాడు ఫణీంద్ర.

★ ★ ★

చెత్తకుండీలా ఉన్న ఆ గదిలో కాలుపెట్టా లంటేనే ఒళ్లు జలదరించింది రంభకి.

వెధవలకి బద్ధకం ఎక్కువ కాబోలు. మరీ ఇంత దరిద్రంగా పెట్టుకోకపోతే రూంని కాస్త సర్దుకుంటే ఏం పోతుంది? అనుకుం టూనే "మే ఐ కమిన్ ప్లీజ్? " అంటూ ఆ రూంలోకి అడుగిడింది రంభ.

అది సులోచనరావ్, సుధీర్‌ల రూము.

"ఎవరూ? " అంటూ వాళ్లిద్దరూ ఒకేసారి చూశారు గుమ్మంవైపు.

ఆమె అందానికి కాసేపు మైమరిచి పోయి గుడ్లప్పగించి చూస్తుండిపోయారు మిత్రులి ద్దరూ.

ఆ తర్వాత కాస్త తేరుకుని "ఎవరండీ మీరు? " అనడిగారు సంయుక్తంగా.

"నేనెవరైందీ తర్వాత చెప్తాగానీ ముందు నేనడిగే..." అంటూ ఇందాక ఆ మిత్ర ద్వయం దగ్గిర పాడిన పాటే మళ్లీ ఇపుడు వీళ్ల దగ్గిర కూడా పాడింది రంభ.

"ప్రశ్నలడుగుతారా! అడగండి మేడమ్" అన్నాడు సులోచనరావ్ ఆనందంగా.

"ప్రశ్నలడిగించుకోవడం అంటే మాకు చాలా ఇష్టమండీ" అన్నాడు సుధీర్ కూడా ఆనందంగా.

ఆమెలోనికొచ్చి ఓ స్టూల్‌మీద కూర్చుని "ఏం చేస్తున్నారు మీరిద్దరూ? " అనడిగింది.

"బియ్యే ఫైనలియర్ చదువుతున్నామండీ" అన్నాడు సులోచనరావ్.

"నేనడిగింది మీ చదువు గురించి కాదు. ప్రస్తుతం మీరేం చేస్తున్నారని" అంది రంభ వాళ్లిద్దరూ చెరో రాయీ పట్టుకుని దేన్నో దంచుతూండటం చూసి.

ఆమె వచ్చేసరికి వాళ్లిద్దరూ నేలమీద

కూర్చుని ఆ పని చేస్తూ ఉన్నారు.

"ఇదాండీ" అంటూ కాస్త సిగ్గుపడి "పచ్చడి నూరుకుంటున్నామండీ చాలా బావుంటుంది" అన్నాడు సుధీర్.

'మీ మొహాలు తగలెయ్యా! నేలమీద పచ్చడి నూరటం ఏంటి అసహ్యంగా! చూడబోతే శుచీశుభ్రంలేని ఉత్త ఎడ్డిమొహాల్లా ఉన్నారే? ' అని మనసులో అనుకొని...

"మీరిద్దరూ రూమ్మేట్సా? " అనడిగింది రంభ.

"అవునండీ! క్లాస్‌మేట్సుం కూడా" అన్నాడు సుధీర్.

"ప్రతిరోజూ ఇలాగే సొంతంగా చేతులు చిదగ్గొట్టుకుంటూ ఉంటారా? " జాలిగా అడిగింది రంభ.

"అవునండీ! అన్నమైతే ఎలాగోలా వండుకు చస్తాంగానీ కూరలు వొండటం రాదండీ! అందుకనే ప్రతిరోజూ ఇలా ఏదోక పచ్చడి నూరుకు తింటుంటాం" అన్నాడు సులోచనరావ్.

'మీ బొంద' అని మనసులో అనుకొని "ఇలా అవస్థలు పడేబదులు పెళ్లిళ్లు చేస్కోవచ్చుగా? " అంది రంభ.

"మాకప్పుడే పెళ్లిళ్లేంటండీ. ఇంకా చదువులు పూర్తవ్వందే? " అన్నాడు సుధీర్.

"పెళ్లికిముందు ఇంకో స్టెప్పుంటుందిగా. మీరిద్దరూ ఎవర్నైనా ప్రేమించారా? " అనడిగింది రంభ. ఎలాగోలా వాళ్ళని మాటల్లోకి దింపి తనకు కావాల్సిన సమాచారాన్ని రాబట్టుకోవాలి గనుక.

"నా మొహానికింకా అంతదృష్టం పట్టలేదండీ! కాని వీణ్ణి మాత్రం మొన్ననే అదృష్టం తలుపు తట్టింది" అన్నాడు సుధీర్ పచ్చడిచేత్తోనే సులోచనరావ్ వీపుమీద చరుస్తూ.

"అయితే వీరు ప్రేమలో పడ్డారన్నమాట. అవుల్లెండి చాలా హాండ్సమ్‌గా ఉన్నారు కదా. అంచేత ఒకరేమిటి, ఇలాంటి హాండ్సమ్ గైల్ని ఎంతమందైనా ప్రేమిస్తారు" అంది రంభ తెలివిగా.

ఆ కాంప్లిమెంట్‌కి సహజంగానే ఉబ్బితబ్బిబ్బులవుతూ, "మీరు భలే కనిపెట్టేశారండీ! మీ ఊహ నిజమే! ఒకరు కాదు, నన్నిద్దరమ్మాయిలు ప్రేమించారు" అన్నాడు సులోచనరావ్ గర్వంగా.

"మరి మీరు కూడా ఆ ఇద్దర్నీ ప్రేమిస్తున్నారా? " అంది రంభ మరింత తెలివిగా.

"ఛఛ! అలా ఇద్దర్నీ ప్రేమించటం ఎలా కుదుర్తుందండీ? ఉత్తమ మానవుడి హృదయంలో ఒక్క యువతికే చోటుంటుంది. అందుకే నన్ను ప్రేమించే కమల, కస్తూరి అనే అమ్మాయిల్లో నేను కస్తూరి అనే అమ్మాయిని మాత్రం ఎంపిక చేసుకుని ఆమె ఒక్కదాన్ని మాత్రమే ప్రేమిస్తున్నాను" అన్నాడు సులోచనరావ్.

రంభకి కావలసింది అదే!

"ఆ ఇద్దర్లో మీరు కస్తూరిని ఎందుకు ఎంపిక చేసుకున్నారు? " అనడిగింది ఆత్రంగా.

"కమల ఏవంత బావుండదండీ! కస్తూరి మాత్రం అచ్చం రంభలా ఉంటుంది. అందుకే ఆమెని ఎంపిక చేసుకున్నా" అన్నాడు సులోచనరావ్.

"వీడి మొహానికి సరిగ్గా సెలక్షన్ కూడా చేతకాదండీ! నేనే వీడికా సలహా ఇచ్చింది" అన్నాడు సుధీర్. ఎదురుగా ఉన్న అందమైన అమ్మాయి తన ఉనికిని విస్మరించి మిత్రుడొక్కడితోనే మాట్లాడేస్తూండటం సహించలేక.

"సలహా ఇచ్చిందెవరైతే ఏంలెండి! మొత్తానికైతే రంభలా ఉండేది ఆయన ప్రేయసే కదా? " అంది రంభ సులోచనరావ్‌కేసి చేత్తో చూపిస్తూ.

"నా పేరు సులోచనరావ్ అండీ! బైదిబై మీ పేరు? " అన్నాడు సులోచనరావు.

"ఆ పర్టిక్యులర్స్ అన్నీ తర్వాత. ముందు నేనడగాల్సిన ప్రశ్నలింకా కొన్నున్నాయ్" అంది రంభ.




పురుష వీక్నెస్‌కొద్దీ మిత్రద్వయం ఆమెకు ఎదురాడలేకపోయారు.

పైగా "అడగండడగండి" అన్నారు సంయుక్తంగా.

"మీరెంపిక చేసుకున్న అమ్మాయి రంభలా ఉంటుందన్నారుకదా! ఏ రంభలా? " అడిగింది రంభ.

"ఆంధ్ర ప్రేక్షకుల అభిమాన నటి రంభ లాగేనండీ! 'ఆంధ్ర' అనేముందిలెండి. ఈమధ్య రంభ తమిళ్‌లోనూ, హిందీలోనూ కూడా బాగా బిజీ అయిపోయింది. సో... 'అఖిలభారత ప్రేక్షకుల అభిమాన నటి' అని కూడా అనుకోవచ్చు మనం" అన్నాడు సులోచనరావ్.

అతని జవాబుకి రంభకి చిర్రెత్తుకొచ్చింది.

"అదేంటండీ? 'రంభలా' అని ఎవరు పోల్చాల్సివచ్చినా దేవలోకంలోని రంభతో కదా పోలుస్తారు? మీరేంటి ఆ తెరమీద తైతక్కలాడే అమ్మాయితో పోలుస్తున్నారు? !" అంది కోపంగా.

"దేవలోకంలో ఉండే రంభ ఎలా ఉండిచస్తుందో ఎవడికి తెలుసండీ? ఒకవేళ ఉన్నా ఆ ముసలమ్మ ఇప్పటిక్కూడా బావుంటుందన్న గ్యారంటీ ఏంటీ? " అన్నాడు నాలుక చప్పరించేస్తూ.

"ఆవిడ దేవనర్తకీమణి. ఆవిడకు వార్ధక్యం అనేది ఉండదు. వాళ్లేం మీలా నేలమీద నూరుకున్న పచ్చళ్లు తినరు. నిత్యం అమృతం తాగుతుంటారు" అతనికేసి మిర్రి మిర్రి చూస్తూ అంది రంభ.

"అయితే మాత్రం ఏజ్ ఏజే కదండీ? అయినా ఎక్కడో దేవలోకంలో ఉన్న ఆ ఓల్డేజ్డ్ రంభ గురించి మనకి డిస్కషన్స్ దేనికిలెండి. మనం మన రంభ గురించే మాట్లాడుకుందాం. మీరు ఇద్దరు ప్రియులు సిన్మా చూశారా? ఉన్నది ఒక పాటే అయితేనేం, అదరగొట్టేసిందికదా? " అన్నాడు సులోచనరావ్, రంభ వేసిన ఆ స్టెప్పులు గుర్తొచ్చి పులకించిపోతూ.

'అదీ ఒక డ్యాన్సేనా? నేనయితే అంత కన్నా బాగా వెయ్యగలను' అని మనసులో అనుకొని.

"సో... మీ ఫియాన్సీని మీరు పోల్చుకున్నది అభినేత్రి రంభతోనే అన్నమాట. అసలు రంభతో కాదన్నమాట" అంది రంభ.

"ఎప్పుడైనా చూసిచస్తేగా ఆవిడతో పోల్చుకోవడానికి? సపోజ్ మీరు అభినేత్రి రంభంత బాగోలేకపోయినా మా కస్తూరి అంత బాగోలేకపోయినా, ప్రతిరోజూ మాకు కూరగాయలు ఇంటికి తెచ్చి సప్లయ్ చేసే వెంకటలక్ష్మంత బాగోలేకపోయినా మొత్తానికి బాగానే ఉన్నారుకదా! మీతో ఇంకెవర్నైనా పోల్చాలంటే పోల్చొచ్చుగానీ ఎప్పుడూ చూసెరుగని ఆ ఒరిజినల్ రంభతో ఎవర్నైనా పోల్చాలంటే ఎలా పోలుస్తామండీ? " అన్నాడు సులోచనరావ్.

అతనంత నికృష్ట అభిప్రాయాన్ని వ్యక్తం చేశాక 'తనే ఆ ఒరిజినల్ రంభని' అని చెప్పాల్సిన అవసరం ఏమాత్రం కనిపించలేదు రంభకి.

"అలాగా! సరే నేనింక వెళ్లొస్తానయితే" అంటూ చటుక్కున లేచి నిలబడిందామె.

"అదేంటండీ- అసలు మీరెవరో, ఎందుకొచ్చారో? ఎందుకు మమ్మల్నిలా ప్రశ్నల వర్షంతో ఉక్కిరి బిక్కిరి చేశారో? అసలేమీ చెప్పకుండానే వెళ్ళిపోతున్నారే" అన్నారిద్దరూ.

'దేవనర్తకీ మణినైన నా అందాన్ని కనీసం కూరగాయల అమ్మాయి అందంతోనైనా పోల్చలేకపోయిన మీలాంటి దగుల్బాజీ వెధవలకి నిజం చెప్పాల్సిన అవసరమేముందిరా పిల్లకుంకల్లారా? ' అని మనసులో కోపంగా అనుకొని.

"నేనెవరినైతే ఏంలెండి! మీ దృష్టిలో దేవలోక రంభకన్నా తెరమీద తైతక్కలాడే ఆ అభినేత్రి రంభే గొప్పదికదా! వస్తా" అనేసి

విసురుగా లేచి అంతే విసురుగా బైటికెళ్లిపో యిందామె.

"అరెరె ఆగండి మేడం! ఎందుకంత కోపం?" అని వెనకనుంచి వీళ్ళరుస్తున్నా కూడా లెక్క చెయ్యకుండా అలా వెళ్ళిపోయి బైటికెళ్లగానే అంతర్ధానమైపోయిందామె.

మిత్రులిద్దరూ బైటికొచ్చి చూసి "ఏమైపో యిందిరా ఈవిడ? ఇంత త్వరగా ఎటెళ్ళిపో యింది?" అనుకున్నారాశ్చర్యంగా.

"ఎవరయ్యుంటుందా అమ్మాయి?" అన్నాడు సులోచనరావ్- నేలమీద పచ్చడి నూరటాన్ని తిరిగి ప్రారంభిస్తూ.

"నాకు మాత్రం ఏం తెల్సు? చూడబోతే కాస్త స్క్రూలూజల్లే ఉంది. లేకపోతే హఠా త్తుగా వచ్చి హఠాత్తుగా ఎందుకలా వెళ్ళిపో తుంది" అన్నాడు సుధీర్.

"పిచ్చిదో బొచ్చిదో మొత్తానికైతే మనిషి కాస్త బాగానే ఉందికదూ?" అన్నాడు సులో చనరావ్.

"ఆ, ఏం బాగులే. మన కాలేజీ ఎదురుగా ఎస్టీడీ బూతుంటుంది చూడూ. అందులో ఉండే అమ్మాయిలా ఉందీమె కూడా" అన్నాడు సుధీర్.

"ఆవిడెక్కడ ఈవిడెక్కడరా? ఆవిడ కాలి గోటిక్కూడా పోలదీవిడ" అన్నాడు సులోచ నరావ్.

"నిజమే. ఈవిడకన్నా ఆవిడ బాగుం టుంది" అన్నాడు సుధీర్‌బాబు మిత్రుడితో ఏకీభవిస్తూ.

★ ★ ★

అది విని కిసుక్కున నవ్వింది తిలోత్తమ.

ఆ సమయంలో స్వర్గ నర్తకీమణులు ముగ్గురూ భూలోకాకాశంలో విహరిస్తూ కింద జరుగుతున్నదంతా గమనిస్తున్నారు.

తిలోత్తమ అలా నవ్వగానే మిగతా ఇద్దరూ కూడా నవ్వకుండా ఉండలేకపో యారు.

అవునుమరి. తమ వద్ద అంతగ అహం కరించి వెళ్ళిన రంభని ఆ అల్పమానవులి ద్దరూ కనీసం ఓ ఎస్టీడీ బూత్ అమ్మాయి తోనైనా పోల్చలేకపోతుంటే, పైగా ఆవిడ కాలిగోటి క్కూడా రంభ సరిపోలదని అంటుంటే నవ్వు రాకుండా ఎలా ఉంటుంది?

ముగ్గురూ కాసేపలా సంతోషంగా నవ్వు కున్నాక,

"ఏం చేస్తోంది మన దొరసాని?" అను కుంటూ భూలోకంలో ఉన్న రంభకేసి దృష్టి సారించారు.

రంభ పాపం అంత అవమానం జరిగిపో యాక ఇందిరాపార్క్‌లో అదృశ్యరూపంలో ఓ చెట్టుకింద కూర్చుని మనసులో కుమిలి పోతూ ఉంది.

ఇప్పుడేమొహం పెట్టుకుని మళ్లీ తన కో-డాన్సర్స్ వద్దకు వెళ్ళటం? అన్న బాధ ఆమె హృదయాన్ని తొలిచేస్తుంటే,

నిష్కారణంగా మాంచి వడ్డాణాన్ని కూడా కోల్పోతున్నానే? అన్న ఆవేదన ఆమె గుండెని మండిస్తుంటే,

'కనీసం కాయగూరలమ్మే దానిపాటి కూడా చెయ్యకపోయానా నేను? ఈ లెక్కన భూలోకంలో నాకన్నా అందగత్తెలు ఎంత మందున్నట్టు?' అన్న ప్రశ్న ఆమె రక్తాన్ని మరిగిస్తుంటే,

అటుగా వచ్చి ఆమెకు ఒకింత చేరువలో పచ్చికమీద కూర్చుందో జంట!

తన కళ్లల్లోకి ఆరాధనగా చూస్తున్న అత నితో...

"ఎందుకు రాజూ అలా చూస్తున్నావ్?" అందామె బిడియంగా కళ్లు వాల్చుకుంటూ.

"నీ అందాన్ని చూస్తుంటే నాకు మతిపో తోంది రమ్యా" అన్నాడతను, ఆమెకేసి ఇంకా అలాగే ఆరాధనగా చూస్తూ.

'సో... వీళ్ళిద్దరి పేర్లూ రాజూ, రమ్యాలన్న మాట' అనుకుంది రంభ.

ఆమె అదృశ్యరూపంలో ఉంది కనుక వాళ్ళకన్పించటంలేదు.

"నేను మరీ అంత అందంగా

ఉంటానా? " రమ్య పరవశంగా అడిగింది రాజుని.

"ఎంతందంగా ఉంటావో చెప్పనా? " అన్నాడతను కళ్ళల్లోంచి ప్రేమవర్షాన్ని కురిపిస్తూ.

"ఎంత? " ఆమె అర్ధనిమీలిత నేత్రాలతో అతనికేసి పరవశంగా చూసింది.

"నీ అందాన్ని ఎవరందంతో పోల్చాలో అర్థం కావట్లేదు రమ్యా! నీకు నువ్వే సాటి" అన్నాడతను. ఆమె కుడిచేతిని తన రెండు చేతుల్లోకి తీసుకుంటూ.

"అదేంట్రా పిచ్చికుంకా, అందర్లాగే నా అందంతో పోల్చొచ్చుగా" అనుకుంది రంభ.

అంతలోనే 'అదృశ్యరూపంలో ఉన్నాగా! నేనతనికెలా కనిపిస్తాను? ' అని కూడా అనుకుంది.

అంతలో "నీది వర్ణించడానికి వీల్లేనంత గొప్ప అందం రమ్యా" అన్నాడతను.

"అలాగేం? " అంటూ ఆమె అందంగా నవ్వింది.

దాంతో-

రంభ ఆమెనోమారు నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూసింది.

అతనంటున్నంత గొప్ప అందగత్తేం కాకపోయినా మొత్తానికి రమ్య బాగానే ఉన్నట్లనిపించింది రంభకి.

కానీ,

ఆమె స్త్రీ హృదయం మాత్రం సాటి ఆడదాని అందాన్ని మనసారా మెచ్చుకోలేక, 'ఆc ఏం అందం, బోడి అందం. తోలు తెల్లగా ఉండగానే సరా? ' అనుకుందామె.

అంతలో రాజు అన్నాడు, "నీ అందాన్ని పోల్చడానికి సాదా సీదా ఉపమానాలేం సరిపోవు రమ్యా! పోల్చడమంటూ జరిగితే నిన్ను రంభతో తప్ప మరెవ్వరితోనూ పోల్చలేం"

అతని మాటలకి కిలకిలా నవ్వింది రమ్య.

ఆ నవ్వుకి పరవశించిపోతూ; "నిజం రమ్యా! నువ్విలా నవ్వుతుంటే నిజంగానే రంభలా ఉన్నావ్" అన్నాడు రాజు.

"పోదూ బడాయి! నువ్వసలు రంభనెప్పుడు చూశావ్? " అందామె బిడియంగా.

ఆమె చెంపల్లోని కెంపుల్ని చూసి పరవశించిపోతూ, "అదేంటి రమ్యా అలా అంటావ్? నేను రంభని చూడకపోవడం ఏంటి? "ఆ ఒక్కటీ అడక్కు" మొదలుకొని నిన్న మొన్నటి లేటెస్ట్ ఫిల్మ్‌దాకా ఆమె నటించిన ప్రతి సిన్మానీ నేను విడవకుండా చూస్తేనూ? " అన్నాడు రాజు.

రంభకి రగిలిపోయింది అతనలా అంటుంటే.

'ఓరి దరిద్రుడా! నీదీ అదే రూటన్నమాట అయితే? ' అనుకుంది ఆవేశంగా.

'ఛీ... ఇలాంటి వెధవలున్న స్థలంలో నేను కూర్చోవటం చాలా తప్పు' అనుకొని ఆమె అక్కణ్ణుంచి విసవిసా వెళ్ళిపోతుంటే.

అది చూసి మళ్ళీ కిసుక్కున నవ్వింది తిలోత్తమ.

రోగం కట్టేశాక కూడా ఇంకా ఆ భూలోకంలో. ఎందుకు? వచ్చి ఓటమినంగీకరించేయొచ్చుగా? " అంది నవ్వటమయ్యాక.

"మొహం చెల్లటంలేదల్లే ఉంది పాపం" అంటూ నవ్వింది ఊర్వశి.

"ఎనీహౌ... యు ఆర్ లక్కీనే! మాంచి వడ్డాణం కొట్టేశావ్" అంటూ తిలోత్తమని అభినందించింది మేనక.

"రెండు వడ్డాణాలూ నీకిచ్చేయ్యమంటావా? " అంది అభినందించటమయ్యాక.

"వొద్దులే. అదొచ్చి ఓటమి నంగీకరించాకే ఇద్దూగాని, అంతవరకు నీ దగ్గరే ఉంచు" అంది తిలోత్తమ.

దరిమిలా...

"ఏం చేస్తోందీ మహాతల్లి? " అనుకుంటూ వాళ్ళు ముగ్గురూ మళ్ళీ రంభకేసి చూశారు.

★ ★ ★

ఇందిరాపార్క్‌లోనే ఇంకో ఏకాంత ప్రదేశంలో కూర్చుంది రంభ.

ఇప్పుడు కూడా ఆమె అదృశ్యరూపంలోనే ఉంది.

ఇప్పుడు కూడా ఆమె హృదయం రగిలిపోతూనే ఉంది.

ఆమాటకొస్తే ఇందాకటికన్నా ఎక్కువగా రగిలిపోతూ ఉంది.

పోదామరి?

ఆ దరిద్రుడు రాజు కూడా ఆమె హృదయాన్ని గాయపరిచి వదిలాడా. ఫ్రెష్‌గా అయిన గాయం మరీ ఎక్కువగా బాధ పెడుతుందికదా! అందుకే ఇంకా దాన్ని గురించే ఆలోచిస్తూ బాధపడసాగిందామె.

పనికిమాలిన వెధవ ఎంతమాటలన్నాడు?

అభినేత్రి రంభతో తప్ప ఇంకెవరితోనూ పోల్చలేడట తన ప్రేయసి అందాన్ని.

అసలీ పిచ్చిసన్నాసులందరికీ ఆ రంభ ఎందుకంత అందంగా కనిపిస్తోందబ్బా?

అలా అనుకుంటుంటే ఆమెకి సడన్‌గా ఓ విషయం గుర్తొచ్చింది.

ఏదో మాటల సందర్భంలో ఒకరోజు మేనక చెప్పిందా విషయాన్ని, "శ్రీదేవికిమల్లే భూలోక రంభ కూడా ముక్కుకి ఆపరేషన్ చెయ్యించుకుందంట. తెలుసా? " అంటూ.

సో... ముక్కుకి ప్లాస్టిక్ సర్జరీ చెయ్యించుకుంటే అందం పెరుగుతుందన్న మాటేగా.

ఎలాగూ లీవ్ పెట్టి తను భూలోకానికి రానేవచ్చిందాయె. కొండంత అవమానభారాన్ని మోసుకుంటూ స్వర్గలోకానికి తిరిగి వెళ్ళటం ఎలాగూ తప్పదాయె! ఈలోగా, పనిలోపనిగా తను కూడా ఆ ఆపరేషనేదో చెయ్యించేసుకుని వెళ్తేపోలా? "

అదేదో మంచి ఐడియాలాగే అనిపించి ఆమె మనసు కాసేపు అటూ ఇటూ ఊగులాడింది.

కానీ...

భూలోకానికెళ్ళి అలా కాస్మోటిక్ ట్రీట్‌మెంట్స్ తీసుకుని రావటానికి స్వర్గలోకం రూల్స్ ఒప్పుకోవన్న సంగతి గుర్తొచ్చి డీలా పడిపోయిందామె.

అనారోగ్యం అనేది స్వర్గలోకంలో ఉండదు కాబట్టి వైద్యుల వద్దకు వెళ్ళటం అనేది వారికి నిషిద్ధం.

ముఖ్యంగా భూలోకవైద్యుల వద్దకు వెళ్ళటం అనేది మరీ నిషిద్ధం... సో ముక్కాపరేషన్ ఆలోచనకి మనసులోనే స్వస్తి చెప్పేసి ఓ మారు పరిసరాలన్నిట్నీ కలియజూసింది రంభ.

అక్కడక్కడా ముసలీముతకా పిల్లాపీచూ కూడా ఉన్నా, ఎక్కువగా యువజంటలే ఉన్నారక్కడ.

అందరికందరూ ఈ ప్రపంచాన్ని మర్చిపోయి ఏవేవో స్వీట్ నథింగ్స్ చెప్పుకుంటున్నవాళ్లే.

వాళ్లందర్నీ చూస్తుంటే 'ఆనందం అనేది స్వర్గంలోనే కాదు. భూలోకంలో కూడా ఉంటుందన్నమాట' అనిపించింది రంభకి.

'ఆ మాటకొస్తే స్వర్గలోకం కన్నా భూలోకమే బెటరు. ఏముంది ఛస్తుందా స్వర్గంలో. ఎప్పుడు చూసినా అవే ఓల్డ్ సెట్టింగ్సూ, అవే ఓల్డ్ మొహాలూను' అని కూడా అనిపించిందామెకి.

దాంతో... 'మళ్లీ స్వర్గలోకానికెళ్లకుండా అసలీ భూలోకంలోనే సెటిలైపోతేనో? ' అన్న విచిత్రమయిన ఆలోచన కూడా వచ్చిందామెకి.

కానీ అదెలా సాధ్యం?

ఏడేడు లోకాల్లో ఎక్కడ దాక్కున్నా దేవేంద్రులవారు వెతికి తీస్కెళ్లి మళ్లీ స్వర్గలోకంలో తైతక్కలాడిస్తారుకదా?

అలా అనుకుంటుంటే ఆమెకి తన జీవితంకన్నా అభినేత్రి రంభ జీవితమే మేలేమోననిపించింది.

అవును. తానక్కడ తైతక్కలాడుతుంటే ఈవిడిక్కడ తైతక్కలాడుతోంది. బట్... ఈ భూలోక రంభకి తనకు లేని ఫెసిలిటీస్ చాలా ఉన్నాయ్!





తానెప్పుడు చూసినా ఆ ఇంద్రుడి ముందే డ్యాన్స్ చెయ్యాలి.

కానీవిడ అలాక్కాదు! రకరకాల లొకేషన్స్‌లో, రకరకాల మనుషుల మధ్య సిన్మా సిన్మాకీ రెమ్యూనరేషన్ పెంచుకుంటూ... యూనిట్ సభ్యులందరితో హీరోయిన్‌గా గౌరవమర్యాదలందుకుంటూ నిజంగా ఈవిడ జీవితం ఎంత హ్యాపీ?

తనూ ఉంది దేనికీ? పాడిందే పాడరా అన్నట్టు ఎప్పుడు చూసినా అవే సెట్టింగుల్లో అవే మొహాలమధ్య అవే పాటలకు డాన్స్ చేయడమే తప్ప అదిన్నూ నలుగుర్లో ఒకత్తిగా... ఈవిడలా తనకక్కడ రాయల్ ట్రీట్‌మెంట్ ఏముందీ!

మొయ్యలేనన్ని నగలూ, తాగినంత అమృతం తప్ప తన మొహానికసలు ఓ రెమ్యూనరేషన్ అనేది కూడా లేదాయె. తానెప్పుడూ ఓ యంత్రంలా డాన్స్‌చేస్తూ ఉండాల్సిందే!

కానీ ఈవిడలాక్కాదే. మూడ్ బాగోకపోతే షూటింగ్‌కి వెళ్లటం ఎగ్గొట్టేయొచ్చు. నిర్మాతల్నీ, దర్శకుల్నీ తన ఇంటి చుట్టూ తిప్పించుకోవచ్చు.

కానీ తనకా ఛాన్స్ ఎక్కడుంది.

దేవేంద్రులవారు ఆడమన్నట్టల్లా చచ్చినట్టు ఆడితీరాలి.

అదీగాక, తనకైతే పద్ధాక డ్యాన్సే. ఈవిడ తనలాక్కాదే. ఒక్కోసారి నటనా, ఒక్కోసారి డాన్సు, ఒక్కోసారి రెస్టు- అలా ప్రశాంతంగా, నిదానంగా చేసుకుంటూ పోవచ్చన్నీ.

పోతే ఆవిడకున్నంతమంది అభిమానులు తనకెక్కడున్నారు?

లిమిటెడ్ ప్రేక్షకులముందు నర్తించే ఒక సామాన్య దేవనర్తకి తాను. కానీ భూలోక రంభ?

ఒకేసారి అనేక ఊళ్లల్లో అనేక వేలమంది ప్రేక్షకుల ముందు వెండితెరపై దర్శనమిస్తూ వాళ్ళందరి హృదయాల్నీ ఉర్రూతలూగిస్తూ వాళ్లందరి అభిమానాన్ని పొందుతూ... వాహ్! లైఫంటే ఆమెదే!

అలా అనుకుంటుంటే మనసంతా ఆవేదనతో నిండిపోయింది రంభకి.

ఎట్ ది సేమ్ టైమ్ అభినేత్రి రంభమీద అక్కసు పెరిగిపోయిందామె గుండెల్లో.

అసలీ అభినేత్రి రంభ అనేది ఉండబట్టేగా... తిలోత్తమ చేతిలో తానింత ఘోరంగా ఓడిపోవాల్సివచ్చింది.

నిజానికా రంభ లేకపోతే అసలే ప్రాబ్లమూ వచ్చుండేది కాదుగా?

సో... అభినేత్రి రంభని మటాష్ చేసెయ్యాలి.

అలా అనుకుంటుంటే "తప్పు తప్పు" అంటూ గద్దించింది రంభనామె అంతరాత్మ. "మటాష్ చేసేయడం అంటే మట్టుబెట్టేయడం. దేవనర్తకీమణివయ్యుండి, స్వర్గలోకవాసివయ్యుండి నరహత్యకు పూనుకోవడం ఎంత పాపం! ఎంత ఘోరం! ఎంత హేయం? !!"

అంతరాత్మ అలా గద్దించేసరికి 'నిజమే కదా?' అనుకుంది రంభ.

అంతలోనే మటాష్ చేసేయడం అంటే చంపడం అనే కాదుగా అర్థం? సినీఫీల్డ్ లోంచి తప్పుకోమని వార్నింగిచ్చినా సరిపోతుందిగా? అని సరిపెట్టుకుని దాన్ని కార్యరూపంలో పెట్టేందుకై అదృశ్యరూపంలోనే అక్కణ్ణుంచి లేచి ముందుకు సాగిపోయింది రంభ.

అట్లా వెళ్తూ రంభ కళ్లు గట్టిగా మూసుకుని ఫిల్మ్ స్టార్ రంభ ఎక్కడ వుందో దివ్యదృష్టితో చూసేసింది.

అన్నపూర్ణా స్టూడియోస్‌లో మాంచి లేత బ్లూకలర్ నీళ్లతో నిండివున్న స్విమ్మింగ్ పూల్లో నీళ్లమీద వెల్లికిలా పడుకుని ఈతకొడుతోంది ఫిల్మ్‌స్టార్ రంభ.

"ఔరా" అనుకుంటూ బుగ్గలు నొక్కుకుంది.

మానస సరోవరంలో తనెంత సేపైనా అలుపెరక్కుండా ఈత కొట్టేదిగాని ఇట్లా



వెల్లికిలా పడుకుని ఎప్పుడూ ఈదలేదు. తన కసలట్లా ఈదడం రాదు. తనకేంటి ఊర్వశికీ మేనక్కీ తిలోత్తమకీ కూడా రాదుగాక రాదు. మానవులు తెలివి మీరారంటూ దేవతలు చెవులు కొరుక్కోవడం నిజమేసుమా!

అట్లా అనుకుంటూ రంభ అన్నపూర్ణా స్టూడియోస్‌లోకి అడుగుపెట్టింది. అదృశ్య రూపంలో వుండటంవల్ల ఆమెనెవరూ అడ్డుకోలేదు.

రంభకోసం స్విమ్మింగ్‌పూల్ కేసి నడుస్తున్న దేవనర్తకీమణి కళ్లు ఓ చోటపడ్డాయి. అసంకల్పితంగా ఆగిపోయిందామె.

యువ సామ్రాట్ అక్కినేని నాగార్జున కార్లోంచి దిగి ఎవర్నో నవ్వుతూ విష్ చేస్తున్నాడు. యూనిట్ వాళ్లు నమస్తే సార్ అంటూ హడావుడిగా అతని చుట్టూ చేరారు. వెరీ స్మార్ట్ గై అనుకోకుండా వుండలేకపోయింది రంభ.

నాగార్జున ఎడమచెవికి మెరుస్తున్న స్టడ్ కేసి కన్నార్పకుండా చూస్తూ 'ఫెంటాస్టిక్' అనుకుంది.

అట్లా అనుకున్న వెంటనే ఒక్కసారిగా ఆమె కళ్లముందు రెండు చెవులకూ ఇత్తడి చెంబులంత కుండలాలతో, మెడతిప్పలేనన్ని హారాలతో, నెత్తిన కోళ్లగంపంత కిరీటంతో ఆపసోపాలు పడే దేవేంద్రుడు కదిలాడు.

పూర్ ఫెలో... సింప్లిసిటీ ఈజ్ మదరాఫ్ బ్యూటీ అని ఈ జన్మకి తెలీదు. పోనీ ఇంకో జన్మలో తెలుసుకుంటాడా అనుకుంటే దేవతలకు జన్మలే లేవాయె అనుకుంటూ నిట్టూర్చింది.

నాగార్జునెందుకో నవ్వుతున్నాడు.

అబ్బా! ఏం స్మయిలో... అట్లా నవ్వుతుంటే ఆ మీసాలెంత ముద్దుస్తున్నాయో అనుకుంది.

మళ్లీ వెనువెంటనే ఇంద్రుడి పేడి ముఖం ఆమె కళ్లముందు నిలిచింది.

స్వర్గలోకం వెళ్లాక నాగార్జునలా మీసాలు పెంచమని ఇంద్రుడికి సజెషన్ ఇవ్వాలి...

నాగార్జున హుందాగా నడుచుకుంటూ అక్కడ్నుంచి వెళ్లిపోతుంటే 'హౌ మేన్లీ ఈజ్ హిజ్ వాకింగ్! మా ఇంద్రుడూ నడుస్తాడు ఆడంగి నడక ఛ...' అనుకుంటూ తిరిగి పూల్ వైపు బయలుదేరింది.

ఒరిజినల్ రంభ అక్కడికి వెళ్లేసరికి ఫిల్మ్‌స్టార్ రంభ బోర్లా ఈదుతూ "రారా... అందుకోరా... అల్లుకోరా... జుర్రుకోరా... వెర్రివీరా" అంటూ పాడుతోంది.

"అంతేలే... ఎంతటి వీరుడైనా ఆడదాన్ని చూడగానే వెర్రివాడే అవుతాడు. పధ్నాలుగు లోకాల్లోనూ ఇదేగా జరుగుతోంది. ఇప్పుడీవిడ కొత్తగా చెప్పాల్సిందేంటో" అని నిట్టూర్చి నడుంమీద రెండు చేతులూ ఆన్చి సినిమా రంభనే పరిశీలిస్తూ వుండిపోయింది దేవకాంత.

ఆమె ఒళ్లు చూస్తుంటే దేవేంద్రుడు పవళించే హంసతూలికా తల్పం మీది రబ్బర్ ఫోమ్ గుర్తుకొచ్చింది రంభకి.

వెంటనే తన ఒంటికేసి చూసుకుంది ఇన్ఫీరియర్‌గా ఫీలవుతూ.

"నో నేను ఆమెకేం తీసిపోను" అనుకుంది గట్టిగా. రంభిట్లా అనుకుంటున్న సమయంలో సినిమా రంభ ఒక్కసారిగా పూల్ లోంచి బయటకొచ్చేసి బికినీతో వయ్యారంగా నడుస్తూ

"హత్తుకో... ఒత్తుకో... చిత్తయిపో" అంటూ గట్టునే వున్న ఆ సినిమా హీరోకి గట్టిగా డేష్‌లాంటిది ఇచ్చి మీదకి ఎగబాకటం ఆరంభించింది.

రంభకి సిగ్గేసి అటూఇటూ చూసింది. ఓ పక్క దర్శకుడు ఇంకోపక్క కెమేరామేన్... ఒకరేమిటి దాదాపుగా ముప్ఫయి నలభై మంది దాకా వున్నారక్కడ యూనిట్ సభ్యులు.

అయినా సినిమా రంభ నిస్సంకోచంగా హీరో పెదాల్ని అందుకుంటూ "కొరికేసుకో... నీలో కలిపేసుకో" అంటోంది.

తల తిరిగిపోయింది దేవనర్తకీమణికి.

"యుగాలబట్టీ తాము డాన్స్ చేస్తున్నారు గాని ఒక్కనాడైనా ఇంద్రుడిమీదికి ఇట్లా ఎగబళ్లేదు. ఎంత షూటింగైతే మాత్రం అవ్వ! ఇంత విచ్చలవిడి తనమా! ఔరా అల్పమానవుల్లారా ఎంతకు బరితెగించార్రా" అనుకుంది.

దర్శకుడు కట్ చెప్పడంతో రంభ డ్రెస్ చేంజ్ చేసుకోడానికి గ్రీన్‌రూమ్‌లోకెళ్లిపోయింది.

డ్రెస్‌చేంజ్ చేసుకునే చోట ఎవరూ వుండరుకాబట్టి తన బెదిరింపు కార్యక్రమం మొదలుపెట్టచ్చనుకుని హడావుడిగా తనూ గ్రీన్‌రూమ్‌లోకి వెళ్లిపోయింది ఒరిజినల్ రంభ.

ఆమె అనుకున్నట్టుగా అక్కడ సినిమా రంభ ఒంటరిగా లేదు. ఆమె పర్సనల్ మేకప్‌మేన్, హెయిర్‌డ్రెస్సరూ, డ్రెస్ డిజైనరూ లాంటివాళ్లంతా ఆమె చుట్టూ వున్నారు.

అక్కడ లాభం లేదనుకుని రంభ బయటకొచ్చేసి పూల్‌కి దగ్గరగావున్న ఓ చెట్టు కింద నిలబడింది.

ఇరవై నిముషాలు కూడా గడవకుండానే రంభ డిఫరెంట్ కాస్ట్యూమ్స్‌లో డిఫరెంట్ మేకప్‌లో గ్రీన్‌రూమ్‌లోంచి బయటకొచ్చేసి సరిగ్గా ఒరిజినల్ రంభ నిలబడ్డ దగ్గరే వున్న ఓ రెడ్ కలర్ ఫైబర్ చెయిర్లో సెటిలైంది. ఓ ఇరవయ్యేళ్ల కుర్రాడొకడు ఆమెకు గొడుగు పట్టుకు నిలబడ్డాడు. మరో కుర్రాడు ఆమెకు అద్దం చూపిస్తున్నాడు. అద్దం చూపించే కుర్రాడి చేతిలో మేకప్ కిట్ వుంది. రంభ మాటిమాటికీ అద్దం చూసుకుంటూ పెదాల లిప్‌స్టిక్, చీక్స్‌కున్న బ్లషర్‌ను సరిచేసుకుంటోంది.

గొడుగు పట్టే వాడొకడూ... అద్దం చూపే వాడొకడూ ఔరౌరా అని రంభ అనుకుంటున్నంతలో ఇంకో వ్యక్తి రంభకి స్టీల్ గ్లాసులో పోసిన పెప్సీ అందించాడు. పెదాలకున్న లిప్‌స్టిక్ చెరక్కుండా లాఘవంగా ఆ పెప్సీని తాగుతుండగా ఇంకోడు రంభ దగ్గరకి పరిగెత్తుకొచ్చి హేండ్‌ఫేన్‌తో విసరసాగాడు.

అదంతా చూస్తున్న దేవకాంతకి అబ్బురంగా అన్పించింది. "ఏమి వైభవం! దేవతలమైన మాక్కూడా ఇంతటి ఫాలోయింగ్ లేదు"

రంభకి కాళ్లు లాగుతున్నట్టుగా అన్పించింది. వెళ్లి సినిమా రంభ పక్కనేవున్న మరో చెయిర్లో కూర్చుని నిస్త్రాణగా వెనక్కివాలింది.

మళ్లీ షాట్ రెడీ కావడంతో సినిమా రంభ సెట్స్ మీదకు వెళ్లిపోయింది. షూటింగ్ చూసే ఓపిక్కూడా లేని ఒరిజినల్ రంభ... ఆ ఫైబర్ చెయిర్లో అట్లాగే షూటింగ్ పేకప్ చెప్పేదాకా కూర్చుండిపోయింది.

రంభ కారు బయలుదేరుతుంటే నిశ్శబ్దంగా వెళ్లి ఆమె పక్కనే సెటిలైంది.

అయితే కూతుర్నే అంటిపెట్టుకుని ఆమె పక్కనే కూర్చునివున్న ఆ సినిమా నటి తల్లిని చూస్తూ అక్కడ నోరు మెదపడం సాధ్యంకాదని వూరుకుంది రంభ.

కారు పోర్టికోలో ఆపాడు డ్రైవర్.

సినిమా రంభ తల్లితో పాటూ కారుదిగి ఇంట్లోకి వెళ్లిపోయింది.

వాళ్లతోపాటు ఇంట్లోకి వెళ్లబోయిన ఒరిజినల్ రంభ ఒక్క క్షణం ఆగి ఆలోచించింది.

తను రంభతో మాట్లాడాలంటే అదృశ్య రూపంలో వుండి మాట్లాడ్డం కుదరదు. ఆమెముందు ప్రత్యక్షం కావాల్సిందే. అట్లా వున్నట్టుండి ప్రత్యక్షం అయితే ఖచ్చితంగా తనను ఆ సినిమా నటి ఏ మాయల మరాఠీగానో భావిస్తుంది. అప్పుడు తనకామెను బెదిరించటం కుదరదు. కారణం మాయలకూ మంత్రాలకూ మానవులు భయపడే కాలం పోయిందనీ ఇప్పుడు భూలోకం భూలోకమే కంప్యూటరైజ్డ్ అయిపోయిందనీ మొన్నామధ్య నారదుల వారు అంటుంటే విన్నది తను.

సో తనిక్కడే ఆగిపోయి ఓ మామూలు మనిషిగా ఆమెను కలుసుకోవటానికి వచ్చిన వ్యక్తిగా లోపలికి ప్రవేశించాలి. అట్లా ప్రవేశించడమే కరెక్ట్.

అట్లా అనుకున్న ఒరిజనల్ 'రంభ అక్కడే ఆగిపోయింది. గేటు బయటికి చేరుకుని గేటుక్కాస్త దూరంగా వెళ్లి అదృశ్యరూపాన్ని చాలించి సినిమా రంభ ఇంటి గేటువైపు నడవడం ఆరంభించింది.



"అభినేత్రి రంభగారిల్లిదేనా? " తెలిసే అడిగింది రంభ గేటు దగ్గర కాపలాగా ఉన్న వ్యక్తిని.

"అవునిదే. నువ్వెవరూ? ఫాన్‌వా? !!" నిర్లక్ష్యంగా తలెగరేశాడా వ్యక్తి.

"కాదు. ఆమెని కలుసుకోడానికొచ్చాను" ఆ నిర్లక్ష్యానికి లోలోన ఒళ్లుమండినా శాంతంగానే జవాబిచ్చింది రంభ.

"ఫాన్‌వి కాకపోతే మరామెని చూడ్డండేనికి? నువ్ ఎవరైనా ప్రొడ్యూసర్‌కి సంబంధించిన మనిషివా? "

ఆ నిర్లక్ష్యానికీ, ఆ ఏకవచన సంబోధనకీ మళ్ళీ మండిపోయింది రంభకి.

అయినా తమాయించుకుందెలాగో.

రంభ ఏదో చెప్పబోయేంత లోపులో, "అడిగేది నిన్నేనమ్మా తల్లీ! మాట్లాడవేం? " అన్నాడా వ్యక్తి కసురుకుంటూ.

తన దేవతాశక్తితో అతన్నొక గాడిదగా మార్చేయాలన్నంత కోపమొచ్చింది రంభకి. కానీ నిగ్రహించుకుంది.

కోపతాపాలకన్నా పనిజరగటం ముఖ్యం కదా!

"వచ్చినపని నీతో చెప్పేది కాదులే. అమ్మగార్నిలా పిలువ్. లేదా నన్నైనా లోపలకెళ్లనీ" అంది రంభ.

"అడ్డమైన వాళ్ళనీ లోపలికి పంపిస్తే అమ్మగారూర్కోరు. మీ కార్డివ్వండి. పియ్యే గారికి చూపించి ఆరు రమ్మంటే పంపిస్తా"

అతనలా అని చెయ్యి చాచేసరికి ఆ చేతిలో ఏం పెట్టాలో అర్థంకాలేదు రంభకి.

అసలు కార్డంటే ఏమిటో కూడా అర్థంకాలేదామెకి.

"కార్డా? !" అంది. 'అంటే' అన్నట్టుగా చూస్తూ.

"కార్డంటే విజిటింగ్ కార్డమ్మా. అది కూడా తెలీదా? " అన్నాడా వ్యక్తి వేళాకోళంగా మొహంపెట్టి.

"అలాంటిదేం నా దగ్గర లేదు" అంది పెదవి విరుస్తూ.

విజిటింగ్ కార్డ్ కూడా లేనిదానివి మేడమ్‌గార్ని చూడనొచ్చావా? అన్నట్టు మరింత నిర్లక్ష్యంగా చూసి, "పోనీ పేరైనా చెప్పు" అన్నాడా వ్యక్తి.

"రంభ" అంది రంభ తన నిజనామధేయాన్నే చెబుతూ.

అతనామెదిక్కు గుడ్లురిమి చూశాడు.

"ఏం వేళాకోళంగా ఉందా? నేనడిగింది మేడమ్‌గారి పేరు కాదు. మేడమ్‌గారి పేరేంటో ఆంధ్రదేశంలో అందరికీ తెలుసు. నీ పేరేంటో అచ్చెప్పు" అన్నాడు కోపంగా.

"రంభ... నా పేరు కూడా రంభేనయ్యా" అంది రంభ భయం భయంగా.

దానికతను ఘొల్లున నవ్వాడు.

"ఎందుకలా నవ్వుతావ్? "

"నవ్వక ఏడవమంటావా? మా మేడమ్ గారంటే ఆ పేరు సూటవ్వుద్ది కాబట్టి పెట్టు కున్నారు. నువ్వంత మంచి పేరు పెట్టుకో వడం ఏంటి? !"

"నీ మొహాన్నెప్పుడైనా అద్దంలో చూసుకు న్నావా? " అని అతనైతే అడగలేదుగానీ అతని చూపు మాత్రం అలా అడిగినట్టే వుండటంతో హర్టయ్యింది రంభ.

"ఏం మీ మేడమ్‌గారే తప్ప ఆ పేరు పెట్టుకోవడానికి ఇంకెవ్వరూ తగరా? " అంది రోషంగా.

అతను కిసుక్కున నవ్వి, "పెట్టుకోవచ్చు కానీ నప్పాలిగా? " అన్నాడు.

ఏంటీ నప్పేదీ నప్పకపోయేదీనూ? ద్వారపాలకుడైనట్టి ఈతడితో ఇంక వ్యర్థ ప్ర సంగం అనవసరం, అనిపించి- "నా పేరు జోలి నీకెందుకయ్యా? నన్ను లోపలికి పంపిస్తావా, లేదా? " అంది కోపంగా.

"ఏంటమ్మో ఏదో పేద్ద దేవలోకంలోంచి ఊడిపడ్డట్టు ఫోజు కొడ్తావున్నావు? " అని ఒక్క గసురు గసిరి "రేయ్ కోటీ..." అంటూ క్రోటన్ మొక్కల్ని కత్తిరిస్తోన్న ఓ అబ్బాయిని పిలిచాడు ద్వారపాలకుడు.

కోటి అనబడే ఆ కుర్రాడొచ్చి "ఏటి? " అనడిగాడు మట్టిచేతుల్ని చొక్కాకి తుడుచు కుంటూ.

"నేనిక్కణ్ణించి కదిల్తే ఈ తల్లి లోపలికి చొరబడిపోయేలా ఉందిగానీ... మేడమ్‌గారి కోసం ఎవరో ఒకమ్మాయొచ్చిందని చెప్పు రాంబాబు సారుతో" అన్నాడు ద్వారపాల కుడు.

"పేరు? "

"రంభంట" అంటూ మళ్ళీ కిసుక్కున నవ్వాడు ద్వారపాలకుడు.

"అదేంటి? అది మన మేడమ్‌గారి పేరు కదా? " అడిగాడు కోటి మట్టి చేతుల్తో అయోమయంగా బుర్రగోక్కుంటూ.

"ఈయమ్మ పేరు కూడా అదేనంటలే, నువ్వెళ్లు" అన్నాడు ద్వారపాలకుడు.

ఓ పావుగంట రంభ అక్కడ అసహ నంగా నిల్చున్నాక లోపల్నుండి ఆమెకి కబు రొచ్చింది "రాంబాబు సారు లోపలికి పంపిం చమన్నార"ంటూ

"మీ పేరు? " అడిగేడు అభినేత్రి రంభ పి.ఏ రాంబాబు.

"రంభ"

"వాట్? !!" అన్నాడతడు ఆశ్చర్యంగా. "జోక్ చేస్తున్నారా? "

విద్యాధికుడు కావటాన్న అతను రంభని కాస్త గౌరవించే మాట్లాడాడు.

అది కాస్త ఊరటగా అనిపించింది. రంభకి.

"అబ్బే జోక్కాదండీ! నాపేరు రంభే" అంది అతని సైగనర్థంచేసుకుని అక్కడున్న ఖాళీ సోఫాలో కూర్చుంటూ.

లక్ష్మి, పార్వతి, సరస్వతి, సీత, సావిత్రి ఇలాంటి పేర్లకిమల్లే రంభ అనే పేరుని అందరూ పెట్టుకోరుకదా! అనుకున్నాడ తడు. అరకులోయ ప్రాంతంలోని కొందరు గిరిజనులకి రంభ అనే పేరు ఉండటం గుర్తుకొచ్చింది. రెండు మూడుసార్లు అవుట్ డోర్ షూటింగ్ కోసం వెళ్లినప్పుడు నోటీస్ చేశాడు తనావిషయం. అందుకని "మీరు గిరిజనులా? " అనడిగాడు రాంబాబు.

"అబ్బే కాదండీ" అంది రంభ.

"గిరిజనేతరులకి రంభ అనే పేరు ఉండటం చాలా అరుదులెండి. అందుకే అడిగానలా..." సంజాయిషీ ఇస్తున్నట్టుగా చెప్పి...

"ఊఁ చెప్పండి. ఇంతకీ మీరేం పనిమీద వచ్చారు? " అనడిగేడు రాంబాబు.

"అది మీతో కూడా చెప్పే విషయం కాదు. మీ మేడమ్‌తోనే స్వయంగా మాట్లా డాలి" అంది రంభ.

"నేను మేడమ్‌గారి పియ్యేని. నాతో చెబితే ఆవిడతో చెప్పినట్టే. పర్లేదు చెప్పండి" అన్నాడు రాంబాబు.



"అలా కుదరదు. నేనామెతోనే స్వయంగా మాట్లాడాలి" అంది రంభ మొండిగా.

"అదస్సలు కుదరదు. మేడమ్ ఇప్పుడే షూటింగ్‌నుండొచ్చి రిలాక్సవుతున్నారు. ఎవ రొచ్చినా సరే డిస్టర్బ్ చేయొద్దన్నారు..." కాస్త కోపంగా అన్నాడు రాంబాబు, 'మీరింక దయచేయొచ్చు' అన్నట్టు చూస్తూ.

మేడమ్‌గారి పియ్యే అంటే మేడమ్‌గారితో సమానం!

అందుకే అలా చూసిందే కాకుండా "మీరింక వెళ్లొచ్చు" అని మాటల్లో కూడా అన్నాడు రాంబాబు.

"అదేంటండీ! వచ్చిన పని అవ్వకుండా ఎలా వెళ్లమంటారు! మేడమ్‌గారు రిలాక్స య్యేదాకా ఇక్కడ వెయిట్ చేస్తాలే పోనీ" అంది రంభ.

"అయినా సరే ఇవ్వాల్టికింక వారెవ్వర్నీ చూడరు. కావాలంటే రేపు ఫోన్లో ముందుగా అప్పాయింట్‌మెంట్ తీసుకుని మళ్లీ రండి..." అన్నాడు రాంబాబు.

అంతలో రంభ అదృష్టం బాగుండి బయ ట్నుంచి ఆ గదిలోకి ఓ వ్యక్తి వచ్చాడు.

ఆ వ్యక్తిని చూడ్డంతోనే రాంబాబు రంభ సంగతి మర్చిపోయి "మీరా సార్! రండి... కూర్చోండి. అయినా మీర్రావడవేంటీ? ఫోన్‌చేస్తే మేడమ్‌గారే వచ్చుండేవారుగా? " అన్నాడు అతి వినయంగా.

ఆ వచ్చినాయన "ఎవరొస్తే ఏంపోయింది లేవయ్యా? ఏం నేను రాకూడదా? " అంటూ నవ్వేసి, "మీ మేడమ్‌ని పిలువ్" అంటూ ఖాళీగా ఉన్న మరో సోఫాలో ఆసీ నుడయ్యాడు.

తరచూ చేసే భూలోక గగనవిహారంవల్ల రంభకి భూలోక నాలెడ్జ్ ఎక్కువే! అంచేత చూడగానే పోల్చేసుకోగలిగిందామె ఆ వచ్చి నాయనెవ్వరో.

రాంబాబు "అలాగే సార్" అంటూ అక్క ణ్ణుంచి లోనికి పరుగు తీయగా సోఫాలో వెనక్కొరిగి ఏదో ఆలోచిస్తూ కళ్లు మూసుకు న్నాడు ఆయన.

అవును. ఆయన అక్షరాలా ప్రఖ్యాత దర్శ కుడు వెంకన్నగారే!

ఆయన్ని చూస్తుంటే రంభకి చాలా అబ్బు రంగా అనిపించింది.

అబ్బ! ఎంత గొప్ప దర్శకుడు!

ఎన్నెన్ని ఆణిముత్యాల్లాంటి చిత్రాల్ని తీశాడు?

ఎందరెందరు నూతన నటీనటుల్ని వెండి తెరకు పరిచయం చేశాడు?

ఆయన అసిస్టెంట్లుగా పనిచేసి ఎందరెం దరు గొప్ప గొప్ప దర్శకులు పుట్టుకొచ్చారు?

ఎన్నెన్ని ప్రయోగాలు చేశాడాయన?

దర్శకుడిగా ఆయన సాధించిన ఘనవిజ యాలు ఒకటా రెండా? !

గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో స్థానం సంపాదించాల్సిన మహానుభావుడా యన.

తెలుగు చలనచిత్రసీమలో ఒక మణిపూ సలాంటి వాడాయన.

రంభ ఆయన్ని చూసి అలా మురిసిపో తుంటే ఆయన మాత్రం కనీసం ఆమె ఉని కినైనా పట్టించుకోకుండా అలాగే కళ్లు మూసుకుని ఏదో ఆలోచిస్తూ ఉండిపో యాడు.

అంతలో... "నమస్తే సార్" అంటూ రాంబాబుతోసహా అభినేత్రి రంభ వచ్చిందక్కడికి.

దాంతో దర్శక వెంకన్న కళ్లు తెరిచి "నమస్కారమమ్మా" అంటూ ఆమెకు ప్రతి నమస్కారం చేసి చిరునవ్వు నవ్వాడు.

అభినేత్రి రంభ చటుక్కున ఆయన్ని సమీ పించి గౌరవపూర్వకంగా పాదాభివందనం చేసి "మీర్రావడవేంటి సార్! కాకితో కబురం పితే నేనొచ్చుండేదాన్ని కానా? " అంది విన యంగా.

"సమయానికి కాకులేం కన్పించలేదమ్మా. ఏం చెయ్యను మరి? " అంటూ జోక్ చేసి "ఎవరొస్తే ఏంలేగానీ నా నెక్స్ట్ పిక్చర్‌కి నీ

డేట్స్ కావాలమ్మా"

"మీరడిగితే కాదంటానా సార్? " అంది రంభ వినయంగా.

"కాదంటావని కాదుకానీ డేట్స్ అడ్జస్ట్ అవ్వాలిగదా! నాది మొత్తం ఫారెస్ట్ బ్యాక్ డ్రాప్‌లో జరిగే సినిమా. సింగిల్ షెడ్యూల్ లో పూర్తిచెయ్యాలనుకుంటున్నాను. సో... నాకు మార్చిలో నీ డేట్స్ ట్వంటీటూ-ట్వంటీఫైవ్ డేస్ ఒక బంచ్‌గా రావాలి. అలాగైతేనే నా ప్రాజెక్ట్ పూర్తవుతుంది. ఇవ్వగలవా? "

ఆయన మార్చిలో అనగానే అభినేత్రి రంభ ముఖం పాలిపోయింది.

"మార్చిలోనా సార్?!" అంది బేలగా.

"అవును. ఏం? "

"మార్చిలో అయితే వీలుపడదు సార్. నేను సుబ్బన్నగారికి ఆల్రెడీ కమిటైపోయాను. వారి షెడ్యూల్ కూడా ఫిక్స్ అయిపోయి ఉంది. దట్టూ నాటిన్ ఇండియా హాంకాంగ్‌లో"

అభినేత్రి రంభ బాధగా అలా అంటుంటే దర్శక వెంకన్న భృకుటి ముడివడింది.

"నేను కూడా మార్చిలోనే ఈ ప్రాజెక్ట్‌ని పూర్తిచేసి తీరాలమ్మా! ఐ గాట్ మై ఓన్ రీజన్స్! నిజానికది విజయశాంతి మాత్రమే చెయ్యాల్సినంత ఎలివేషన్ ఉన్న క్యారెక్టరు. కానీ తనక్కూడా ఖాళీ లేకపోవడంవల్ల నిన్ను కాంటాక్ట్ చేశాను. ద క్యారెక్టర్ నీడ్ పెర్‌ఫార్మెన్స్ అండ్ యాజ్ వెల్ ఏజ్ గ్లామర్! అందుకే నిన్ననుకున్నాను. కానీ ఏం చేస్తాం? "

అనుకుంటూ దిక్కులు చూస్తూ తల పక్కకి తిప్పేసరికి సోఫాలో ఒద్దికగా కూర్చునున్న ఒరిజినల్ రంభమీద పడిందాయన దృష్టి!

"ఎవరీ అమ్మాయి? ఫేస్ బాగుంది. పర్సనాలిటీ కూడా బాగుంది. పోనీ కారెక్టర్‌కి కొత్త హీరోయిన్‌గా ఈమెను ఇంట్రడ్యూస్ చేస్తేనో?! ఇమేజ్ ప్రాబ్లం ఉండదు కాబట్టి కావాల్సినంత యాక్షన్ చెప్పి చేయించుకోవచ్చు. ఒకరకంగా కొత్తమ్మాయి అయితేనే బెటరు" అనిపించిందే తడవుగా "ఎవరమ్మా ఈ అమ్మాయి? " అని అభినేత్రి రంభనడిగాడు దర్శక వెంకన్న బహుశా వాళ్ళచుట్టాలమ్మాయెవరో అయ్యుంటుందనుకుని.

"ఏమో సార్ నేనూ ఇప్పుడే చూస్తున్నాను" అని,

"ఎవర్రాంబాబూ ఈ అమ్మాయి? " అడిగింది అభినేత్రి రంభ, బహుశా అతని తాలూకు అమ్మాయి కాబోలనుకుంటూ.

"ఎవరో నాకూ తెలీదు మేడం. వివరాలు చెప్పడంలేదు సరిగ్గా. మీతో పర్సనల్‌గా ఏదో మాట్లాడాలంటూ పట్టుబట్టి కూర్చుంది. కుదర్దమ్మా అంటుంటే ఇంతలో సార్ వచ్చారు" అంటూ క్లుప్తంగా విషయం చెప్పాడు రాంబాబు.

"ఎవరమ్మా మీరు? నాతో ఏంటి పని? " రంభ అడిగింది ఒరిజినల్ రంభని.

అంతలో 'నువ్వుండు' అన్నట్టుగా సైగ చేసి,

"నీ పేరేంటమ్మాయ్? " అని ఒరిజినల్ రంభని అడిగాడు వెంకన్న.

"రంభండీ" అంది ఒరిజినల్ రంభ.

సహజంగానే కన్ఫ్యూజైపోతూ "నేనడిగింది నీ పేరమ్మా" అన్నాడు వెంకన్న 'నీ' అనే అక్షరాన్ని ఒత్తిపలుకుతూ.

"నా పేరు కూడా రంభేసార్" అంది ఒరిజినల్ రంభ.

"తమాషాగా ఉందే. రంభ రంభతో మాట్లాడ్డానికొచ్చిందన్నమాట అయితే? " అంటూ నవ్వి,

"మీదే ఊరమ్మా? " అనడిగాడు వెంకన్న.

"స్వర్గం" అని చెప్పబోయి ఆగిపోయింది రంభ. అలా చెప్తే అక్కడున్న ముగ్గురూ నవ్వడం ఖాయమనిపించి,

"ఈ ఊరేనండీ! హైదరాబాదే" అనేసింది ఆ కంగారులో అంతకన్నా ఏం చెప్పాలో తోచక.



"ఉండేది ఎక్కడ? ఐ మీన్ ఏ ఏరియాలో? "

"నల్లకుంటలో సార్" అనేసింది ఏదో ఒకటి చెప్పాలి గనక ప్రభాకర్ వాళ్ళ రూమ్ అక్కడున్న సంగతి గుర్తుకొచ్చి.

"నీ అడ్రస్ కాస్త రాసిస్తావా? "

"అడ్రసా? " అంటూ కాస్త తడబడింది ఒరిజనల్ రంభ.

"దేనికిసార్? " అంది ఆశ్చర్యంగా.

"ఇంతకుముందు మేం మాట్లాడుకున్నది విన్నావ్‌గా. రంభ మార్చిలో డేట్స్ ఇవ్వలేనంటోంది. సో... నా పిక్చర్‌లో రంభ ప్లేస్‌లో నిన్ను హీరోయిన్‌గా తీస్కోవాలనుకుంటున్నాను. అఫ్‌కోర్స్ నీకు అభ్యంతరం లేకపోతేనే? "

అనుకోకుండా అలా సినిమా ఛాన్స్ వచ్చి పడితే రంభేమిటి, ఆ దేవేంద్రుడైనా ఎగిరి గంతేయాల్సిందేకదా.

ఆ ఫీల్డ్‌కున్న గ్లామర్ అలాంటిదాయె.

అందునా తానిపుడొచ్చింది అభినేత్రి రంభమీద ద్వేషంతో కాబట్టి ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని ఫీల్డ్‌లోనే రంభకి తాను గట్టిపోటీ ఇవ్వగలిగితే ఎలా ఉంటుందా అన్న ఆలోచన వచ్చి "భలేవార్సార్! అభ్యంతరం దేనికుంటుంది? " అనేసింది రంభ ఠక్కున.

ఆ ఫాస్ట్ డెసిషన్‌కి ముచ్చటపడిపోతూ "కానీ మీ పెద్దవాళ్ళని కన్సల్ట్ చెయ్యాలికదమ్మా" అన్నాడు దర్శక వెంకన్న.

ఈ అవకాశాన్ని చేజార్చుకుంటే మళ్ళీ రాకపోవచ్చన్న ఉద్దేశంతో "అబ్బే నాకు పెద్దవాళ్ళెవరూ లేరు సార్. నాకు నేనే పెద్దని" అనేసింది రంభ ఠక్కున.

'ఈ పిల్ల స్పీడుగా మాట్లాడేస్తూ భలే చలాకీగా ఉంది. ఫీల్డ్‌లో బాగా పైకొస్తుంది. అఫ్‌కోర్స్ అందం కాస్త తక్కువగా ఉన్నా, ఫర్లేదు మేకప్‌తో మానేజ్ చేసేయొచ్చు' అని మనసులో అనుకొని...

"మరి నువ్ ఇప్పుడెవరి దగ్గరుంటున్నావ్? " అనడిగాడు వెంకన్న.

తాడూబొంగరం లేనిదాన్నని చెబితే చీప్పైపోతానేమోననిపించి "నాకిద్దరు బావలున్నారులెండి. వాళ్ళతోపాటు ఉంటున్నా" నోటికొచ్చిన మాటనేసింది రంభ!

ఇద్దరు బావల నడుమ ఓ మరదలు ఒంటరిగా ఉండడవేంటి?

ఆ ప్రశ్న మనసులో మెదిలినా, పర్సనల్ విషయాలు తనకెందుకు లెమ్మనుకుని, "సరేనమ్మా, ఎంతవరకు చదువుకున్నావ్? "

"బిఏ డిస్కంటిన్యూడ్ సార్" అని మరో కోత కోసేసింది రంభ.

హీరోయిన్‌గా ఉండడానికి అంత క్వాలిఫికేషన్ మాత్రం ఎందుకు?

'ఐసీ...' అన్నట్టు తృప్తిగా తల పంకించి "సరే నీ అడ్రస్ ఇచ్చెళ్ళమ్మా. నేను మళ్ళీ కబురుచేస్తాను" అన్నాడు వెంకన్న.

రంభ తన అడ్రస్‌గా ప్రభాకర్, ఫణీంద్రల రూమ్ అడ్రసివ్వగా రాంబాబు దాన్నో స్లిప్ మీద నోట్‌చేసి వెంకన్నకందించాడు.

"తొందరేం లేదు. నువ్ మరోసారి నిదానంగా ఆలోచించుకోమ్మా. మీ బావలెవరో ఉన్నారన్నావ్‌గా. వాళ్ళని కూడా ఓ మాటడుగు. ఒకసారి అగ్రిమెంట్ చేసుకున్నాక మధ్యలో డ్రాపవ్వడానికుండదు. సో... ముందే బాగా ఆలోచించుకోవడం మంచిది"

ఆ స్లిప్‌ని జేబులో పదిలపరుచుకుంటూ అనుభవంతో దర్శక వెంకన్న చెబుతుంటే,

"నో సార్!" అని గట్టిగా అంది రంభ. "నేనేవన్నా చిన్నపిల్లనా నా బాగోగులు నేను నిర్ణయించుకోలేకపోడానికి. ఇందులో మళ్ళీ ఆలోచించాల్సిందేంలేదు. మా బావల పర్మిషన్ తీస్కోవాల్సిన అవసరం అంతకన్నా లేదు. మీరు 'ఊ' అంటే ఇప్పటికిప్పుడే అగ్రిమెంట్‌మీద సైన్ చేయడానికైనా నేను రెడీనే"

ఆమెలోని ఆ ఉత్సాహమూ అదీ బాగా నచ్చింది వెంకన్నకు.

"నువ్ రెడీనే అయినా, ఎగ్రిమెంట్ నా




దగ్గర రెడీగా ఉండాలికదమ్మా? అదీగాక ముందుగా స్క్రీన్ టెస్టూ అదీ చెయ్యాలి గదా? సో... నువ్ మామూలుగా ఇంటికె ళ్ళిపో. ఒన్ ఆర్ టూ డేస్‌లో నేను మీ ఇంటికి మా మనిషిని పంపిస్తాను" అన్నా డాయన నవ్వుతూ.

"మెనీ మెనీ థాంక్సండీ!" అంది రంభ అనుకోకుండా వచ్చిపడిన ఈ మహదావకా శానికి ఉబ్బితబ్బిబ్బులవుతూ.

వెంకన్న ఆమెనాశీర్వదిస్తూ కుడిచెయ్యి పైకెత్తి చిన్నగా ఊరుకోగా,

తన కళ్ళముందే ఓ సామాన్యురాలు సడ న్‌గా హీరోయిన్ అయిపోవడం చూసి ఆశ్చ ర్యపోయిన అభినేత్రి రంభ "కంగ్రాట్యులే షన్స్" అంటూ తన సోఫాలోంచి లేచి ఒరి జినల్ రంభని సమీపించి ఆమెతో చేయి కలిపింది.

'ఇప్పుడేం చూశావ్‌లే. ముందుంది ముస ళ్ళపండగ. నా గ్లామర్‌తో సినీ ఫీల్డ్ నిన్ను స్మాష్ చేసెయ్యదూ? ' అని మనసులో అను కుని పైకిమాత్రం "చాలా థాంక్స్ రంభ గారూ! మిమ్మల్ని చూడ్డానికి రాబట్టే నాకీ అవకాశం వచ్చింది. మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను" అంది రంభ, ఆర్డినరీ మను షులకు మల్లే తనకి రకరకాల జన్మలుండ వని తెలిసినా కూడా.

అంతలో దర్శక వెంకన్న అడిగాడు.

"అన్నట్టు అసలు సంగతి మర్చిపో యాను. గతంలో నీకేమన్నా నటనానుభవ ముందా? "

"లేదుసార్. కానీ మీరు నేర్పితే నేర్చుకుం టాను" వినయంగా అంది రంభ.

"పోనీ డాన్స్ అయినా వచ్చా? "

"అది మాత్రం చాలా బాగా వచ్చుసార్" అనేసి, 'యుగాలుగా నేను చేస్తున్న పని అదేగా? ' అని మనసులో అనుకుంది రంభ.

"హీరోయిన్ కావడానికి డాన్స్ కూడా వచ్చుండాల్సిన పన్లేదులే" అంటూ నవ్వేసి,

"స్క్రీన్ టెస్ట్‌లో ఓకే అయిపోతే నువ్వింక హీరోయిన్‌వి అయిపోయినట్టే. సో... మన మింక ఆలోచించాల్సింది నీపేరు గురించి" అన్నాడు దర్శకరత్న.

"పేరా? " అంది రంభ ఆశ్చర్యంగా.

"ఉందిగా" అంది అయోమయంగా.

"ఉన్నా నీ పేరిపుడు వెండితెరకి పనికిరా దమ్మా. ఆల్రెడీ రంభుండగా ఇంకో రంభగా నిన్నెలా పరిచయం చేయగలను. అందుకే ఏదన్నా కొత్త పేరాలోచించాలి" అంటూనే ఆలోచించడం ప్రారంభించాడాయన.

ఒరిజినల్ రంభ ముఖంలో ఒకింత అయిష్టత తాండవించింది. యుగయుగా లుగా వస్తున్న తనపేరుని సడన్‌గా మార్చు కోవడం ఆమెకెంత మాత్రం ఆమోదయో గ్యంగా అనిపించలేదు.

అందుకే పేర్లాలోచిస్తున్న వెంకన్నని డిస్టర్బ్ చేస్తూ, "ఐ డోంట్ లైక్ టు ఛేంజ్ మై నేమ్ సార్" అంది.

"అదెలా కుదుర్తుందమ్మా. నీకిష్టమున్నా లేకపోయినా పేరుమాత్రం మార్చితీరాలి"

"పోనీ ఒకపని చెయ్యండి"

"చెప్పు"

"నా పేరుని సీనియర్ రంభగా మార్చండి సరిపోతుంది"

రంభ మాటలకి అభినేత్రి రంభతో సహా అక్కడున్నవారంతా ఘొల్లున నవ్వారు.

ఆ నవ్వుకి కారణం ఏమిటో అర్థంకాక బిత్తరపోయింది రంభ.

"ఎందుకు సార్ అలా నవ్వుతున్నారు? " అడిగింది భయంభయంగా.

"లేకపోతే ఏంటమ్మా. నీకన్నా సీనియర్ నటి రంభుండగా నువ్ సీనియర్‌వి ఎలా అవుతావ్? " అన్నాడు వెంకన్న.

"పోనీ నీకు మరీ అంత పట్టుదలగా ఉంటే జూనియర్ రంభగా మార్చుదాం. ఓ.కే. నా? "

వెంకన్న అలా అంటుంటే ఏడ్వాలనిపిం చింది రంభకి.

ఆఫ్టరాల్ ఈ మానవాంగన కన్నా తను జూనియరా!?

కొన్నికోట్ల సంవత్సరాలు వయసున్న తను పట్టుమని యాభై సంవత్సరాల వయసైనా లేని ఈ రంభకన్నా జూనియరా?

గుండెలో ఎక్కడో మంటపుట్టినట్టే అనిపించింది రంభకి అలా అనుకుంటుంటే.

"అదేంటి సార్. అలా అంటారు? నేను తనకన్నా కొన్నికోట్ల సంవత్సరాలు పెద్దదాన్నైతేనూ?" అనే మాటలు ఆమె నాలుక చివరదాకా వచ్చాయిగానీ సినీతారలు తమ వయసునలా పైకి చెప్పకూడదన్న ఇంగితం ఆమెలో మేల్కోవడంవల్ల నాలుక నదుపులో పెట్టేసుకుంది రంభ.

ఆమె ముఖంలోని అప్రసన్నతని గమనించి "ఏంటమ్మా అలా అయిపోయావ్? పోనీ నా ప్రపోజల్ నీకు నచ్చకపోతే ఇంకో మాంఛి పేరేదైనా ఆలోచిద్దాంలే" అన్నాడు వెంకన్న.

క్షణమాగి ఆయనే అన్నాడు మళ్ళీ,

"దేవనర్తకీమణులైన రంభ, ఊర్వశి, మేనకల పేర్లు ఆల్రెడీ ఇండస్ట్రీలో ఉన్నాయి. తిలోత్తమ అనే పేరు ఇంతవరకూ ఏ నటికీలేదు. కాబట్టి ఇకనుంచి నువ్ తిలోత్తమవి. ఇదెలా ఉంది?"

ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకినట్టయి, "నా మొహంలా ఉంది" అని బిగ్గరగా అరవబోయి, తొలిసారిగా అవకాశమిస్తున్న దర్శకుడి ముందు అలా అనకూడదన్న ఇంగితం మేల్కొనగా మళ్ళీ నాలుకనదుపులో పెట్టుకుంది రంభ.

"తిలోత్తమ! బానే వుంటుంది సార్" అన్నాడు రాంబాబు అతన్నెవరో అడిగినట్లు పుడింగిలా తల దూరుస్తూ.

'ఏంటి బావుండేది నీ మొహం' అనుకుని లోలోన పళ్ళునూరి "నాకంతగా నచ్చలేదు సార్. పోనీ ముందుమీరన్నట్టు జూనియర్ రంభ అనే పేరునే ఖాయం చేసేయండి" అనేసింది రంభ, 'ఆ దొంగ భడవ. తిలోత్తమ పేరుకంటే ఇదే కాస్త బెటరు' అని మనసులో అనుకుంటూ.

"ఓకే అమ్మా" అనేశాడు దర్శక వెంకన్న.

అభినేత్రి రంభకి మాత్రం ఇది బొత్తిగా నచ్చలేదు.

"పెట్టుకోవాలనుకుంటే ఎన్ని మంచి పేర్లు లేవు సార్? నా పేరే పెట్టుకోవడం దేనికి?" అంది నుదురు చిట్లిస్తూ.

ఫీల్డ్ అన్నాక అనేకమంది కొత్తహీరోయిన్లు వస్తుంటారు, పోతుంటారు. అది వేరే సంగతి. కానీ ఇపుడీ కొత్తమ్మాయి జూనియర్ని ముందు చేర్చుకుని తనపేరే పెట్టుకుంటే అందరూ ఆమెని తనకు పోటీగా భావిస్తారుకదా. అంతేకాకుండా ఆటోమేటిగ్గా ఆమెకన్నా తనని పెద్దదానిగా కూడా పరిగణిస్తారుకదా! అదీ అభినేత్రి రంభ బాధ.

కానీ అసలు రంభకి ఇదంతా ఏం తెలుసు.

అందుకే 'నీ పేరు నేను పెట్టుకోవడం ఏంటి? నాపేరే నువు పెట్టుకుని?' అనుకుంది మనసులో కోపంగా.

"మంచిపేర్లున్నా నా సొంతపేరు ఒదులుకోడానికి నేను సిద్ధంగా లేన్సార్. జూనియర్ రంభే ఖాయం చెయ్యండి" అంది పైకి.

దర్శక వెంకన్న అభినేత్రి రంభకేసి చూసి, "ఏమ్మా నీకేమన్నా అభ్యంతరమా?" అనడిగేడు సౌమ్యంగా.

"అభ్యంతరమే. నా పేరు మరొకరు పెట్టుకోవడం నాకిష్టముండదు" అంది అభినేత్రి రంభ.

"రంభ అనేది మీ పెట్టుడుపేరు. కానీ నాకది పుట్టుకతో వచ్చినపేరు. మీ పెట్టుడు పేరుమీద మీకంత అభిమానముంటే నా పుట్టుక పేరుమీద నాకెంత అభిమానముండాలి? సో నా పేరు ఒదుల్కోవడం నాకూ ఇష్టముండదు" అంది అసలు రంభ ఖండితంగా.

'ఫీల్డ్‌లో ఇంకా అడుగుపెట్టకముందే సాటి హీరోయిన్‌తో ఇలా తగవేస్కుంటు




# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందచేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

సెప్టెంబర్ చతుర నవల హలోరంభా!

సమీక్షకుని పేరు : ........................................

చిరునామా : ........................................

........................................

........................................

........................................

న్నదీ అంటే నో డౌట్ ముమ్ముందు ఈమె చాలా పైకొస్తుంది' అని మనసులో అను కొని అభినేత్రి రంభతో అన్నాడు దర్శక వెంకన్న.

"విన్నావుగా అమ్మా! ఆవిడేమో అది తన పుట్టుకపేరంటోంది. పుట్టుక పేరుని కాదన డానికి మనమెవరం? నీ ప్రాబ్లం నాకర్థ మైంది. ఆమెని 'జూనియర్ రంభ' అంటే చెప్పకనే నువ్ ఆమెకన్నా పెద్దదానివని చెప్పినట్టవుతుందనేగా నీ బాధ? "

"అవును" అని నోటితో చెప్పడానికి సిగ్గు పడి 'మరే' అన్నట్టుగా చూసి ఊరుకుంది అభినేత్రి రంభ.

"మధ్యేమార్గంగా దీనికి నేనో పరిష్కారం చెప్పనా? "

"చెప్పండి" అంది అభినేత్రి రంభ.

"చెప్పండి" అంది అసలు రంభ కూడా.

"జూనియర్, సీనియర్ అనే పదాల్ని మర్చిపోయి చివర్లో ఓ శ్రీని చేర్చి ఈమెని రంభశ్రీ అందాం. ఓకే...? "

"ఓకే సార్" అంది అసలు రంభ.

"మీ ఇష్టం సార్" అంది అభినేత్రి రంభ.

అలా తాత్కాలికంగా ఆ సమస్య పరిష్కా రమైపోయినప్పటికీ అభినేత్రి రంభ మన సులో మాత్రం ఈ కొత్తరంభ పట్ల ద్వేషం లాంటిది ఏర్పడిపోయింది.

అసలు రంభలో ఆ ద్వేషం ముందు నుంచీ ఉన్నదేనాయె.

అందుకే వాళ్ళిద్దరూ ఒకరికేసొకరు కొర కొరా చూసుకుంటుంటే "అలా చూస్కోకం డమ్మా. ఇద్దరూ రంభలే కాబట్టి ఫ్రెండ్లీగా ఉండడానికి ప్రయత్నించండి" అంటూ సలహా ఇచ్చాడు వెంకన్న.

"ఏదీ ఇద్దరూ షేక్ హాండ్లిచ్చుకోండి"

ఆయనలా అనేసరికి అగ్రదర్శకుడి మాట తీసెయ్యలేక షేక్ హాండ్ లిచ్చుకున్నారు రంభలిద్దరూ.

ముఖకవళికల్ని బట్టి వాళ్ళ మనసుల్లోని భావాల్ని చదవగలిగి, 'ముమ్ముందు వీళ్ళి ద్దరూ రైవల్స్‌కావడం ఖాయం' అనుకున్నా డాయన మనసులో.

అసలు రంభ చేతిని నొక్కి వదిలేక అభి నేత్రి రంభ అడిగిందామెని. "అధ్సరే నాతో ఏదో పర్సనల్‌గా మాట్లాడాలని వచ్చార టగా! ఇంతకీ ఆ విషయమేంటి? "

వచ్చిందైతే నిజానికి అభినేత్రి రంభని బెదిరించటంకోసం. కానీ ఇంత జరిగాక ఇపుడా విషయాన్ని పైకెలా చెప్పగలదామె?

అందుకే "అబ్బే ఏం లేదు" అంటూ తడ బడిపోయింది.

"ఏమీ లేకుండా ఎందుకొచ్చినట్టో? "

అభినేత్రి రంభ వ్యంగ్యపూరితంగా అలా అనేసరికి "నేను మీ అభిమానినండీ! మిమ్మల్ని చూసి మీతో మాట్లాడిపోదామని వచ్చాను. కానీ అభిమానినంటే లోపలకి పంపించరేమోనని మిమ్మల్ని పర్సనల్‌గా కలవాలని చెప్పాను" అనేసింది అసలు రంభ నోటికెలా తోస్తే అలా.

'అయితే అభిమానిగా వచ్చి నాకే పోటీ కాబోతున్నదన్నమాట! చూస్తా ఈ ఫీల్డ్‌లో నువ్వెలా పైకొస్తావో? ' అని మనసులో కోపంగా అనుకొని పైకి మాత్రం "అలాగా! చాలా సంతోషం" అనేసింది అభినేత్రి రంభ.

అంతలో దర్శక వెంకన్న "సరేనమ్మా! నువ్వింక వెళ్లిరా! నా కార్లో వెళ్తావా? డ్రైవ ర్నిచ్చి పంపనా? " అన్నాడు అసలు రంభతో.

"అబ్బే కారు దేనికి సార్? " అంది రంభ.

ఆమె ఉద్దేశ్యం నేనిక్కడ మాయమై అక్కడ ప్రత్యక్షమవ్వగలను అని.

కానీ ఆ విషయం వాళ్లకేం తెలుసు? నడిచి వెళ్తానంటోంది కాబోలు పాపం పిచ్చి దనుకొని, "ఇందాకటిదాకా నువ్వు సామాన్యు రాలివే కావచ్చమ్మా! కానీ నువ్విపుడు కాబోయే హీరోయిన్‌వి. కాబోయే ఏముం దిలే ఆల్‌మోస్ట్ అయిపోయినట్టే! సో... నువ్విపుడు అందరిలా నడిచి వెళ్లడానికి

వీల్లేదు. అదీకాక మా డ్రైవర్ నీ ఇల్లొకసారి చూసుంటే మంచిది. నేను మళ్లీ కబురుచేసి నప్పుడు రావడానికి వీలుగా వుంటుంది" అన్నారాయన.

దాంతో అసలు రంభకి, ఇంక తిరస్క రించే అవకాశం లేకుండా పోయింది.

"సరే సార్ మీ ఇష్టం" అనేసింది.



"మీరు చాలా లక్కీ మేడమ్" అన్నాడు డ్రైవర్ వెనక సీట్లో కూర్చునివున్న రంభ కేసి... వెనక్కి తిరిగి చూస్తూ.

అంతవరకూ జరిగిన సంఘటనల్ని నెమ రువేసుకుంటూ రైజ్ చేసి వున్న కార్ విండో లోంచి నగరాన్ని చూస్తున్న రంభకు అతని మాటలు వినబడలేదు.

వాడెవడో పెళ్ళిచూపులకెళ్ళడమేంటి! పిల్ల నచ్చి... దాన్ని సినిమా నటి రంభతో పోల్చ డమేంటి? ఇంకోడెవడికో ఎవత్తో ప్రేమలేఖ రాయడమేంటి? వాడు కూడా దాన్ని ఆ రంభతోనే కంపేర్ చెయ్యడమేంటి? అది విని తను భూలోక రంభ సంగతి తేల్చాల నుకోవడమేంటి? భూలోకానికి రావడ మేంటి? వెంకన్న కళ్లలో పడటమేంటి? హఠాత్తుగా సినిమా హీరోయిన్ అయిపోవ డమేంటి? దాంతో తను స్వర్గం వదిలి ఈ భూలోకంలోనే స్థిరపడాలనుకోవడం ఏంటి.

"నిజంగా మీరు లక్కీ మేడమ్" మళ్ళీ అన్నాడు డ్రైవర్. మళ్ళీ వెనక్కి చూస్తూ.

ఈసారి కాస్త గట్టిగా అన్నాడేమో... రంభ అతనికేసి చూసింది.

"మహామహా వాళ్ళే... హీరోయిన్లు కావా లని కలలుకని చివరికి ఎక్స్ట్రాలుగా మిగిలి పోతున్న ఈ ఫీల్డ్‌లో... ఇట్లా... హఠా త్తుగా... ఇంత పెద్ద బేనర్‌లో ఏకంగా హీరోయిన్ పాత్ర కొట్టేశారంటే మీరు సామాన్యులు కారు" జాగ్రత్తగా టర్నింగ్ కోస్తూ అన్నాడు.

"అవును... నేను సామాన్యురాలినికాను" గర్వంగా అంది రంభ... తను దేవనర్తకీమ ణినన్న విషయాన్ని మననం చేసుకుంటూ.

"మీరు చాలా గొప్ప హీరోయిన్ అవటం ఖాయం మేడమ్"

"ఆ విషయం... నాకు ఆల్ రెడీ తెల్సు" మరింత గర్వంగా అంది రంభ.

డ్రైవర్ కార్ని జాగ్రత్తగా పోనిస్తూనే... అన్నాడు. "ప్చ్ నేనూ ఒకప్పుడు... హీరోనవుదామనే ఈ ఫీల్డ్‌లో కొచ్చా మేడమ్. కానీ డ్రైవర్నయ్యాను"

"ఎందుకని?" అడిగింది రంభ ఆసక్తిగా.

"అప్పట్లో ఏ ఒక్క దర్శకనిర్మాత జాత కమూ బాగులేకపోయింది. అందుకే నాతో సినిమా తియ్యలేకపోయారు"

"బాగోలేంది నీ జాతకమా... దర్శకనిర్మా తల జాతకమా" అర్థంకాక అడిగింది.

"నాది మహర్జాతకం మేడమ్. నా చెయ్యి చూసిన ప్రతివాడూ... నిన్ను హీరోగా పెట్టుకుని సినిమా తీసిన నిర్మాత ఎవడైనా సరే... వాడి నెత్తిన కనకవర్షం కురవడం ఖాయం అని చెప్పారు. నేనావిషయాన్ని ఎంతోమంది నిర్మాతలకు, దర్శకులకు నెత్తీ, నోరు బాదుకుని చెప్పాను. ఒక్క వెధవకీ కుబేరుడయ్యే యోగం లేదు. ఏం చేద్దాం! ఎవరి ఖర్మకి ఎవరు బాధ్యులు" గాఢంగా నిట్టూర్చాడు.





రంభ కిలకిల నవ్వేసింది.

"నవ్వకండి మేడమ్... చివరిసారిగా నేను మీకో అవకాశం ఇవ్వదలుచుకున్నా"

"నాకా! ఏంటా అవకాశం?"

"ఏం లేదు మేడమ్. మీరు త్వరలోనే అగ్రశ్రేణి హీరోయిన్ అవ్వడం ఖాయమని నా సిక్స్త్‌సెన్స్ చెబుతోంది. మీరో లెవెల్‌కి వచ్చాక ఖచ్చితంగా సినిమా నిర్మాతగా మారుతారు. నేచురల్. మాజీ హీరోయిన్లం దరూ ఇప్పుడు చేసేపనదే. సో... మీరు తీసే పిక్చర్‌లో నన్ను హీరోగా బుక్ చేసు కున్నారనుకోండి. మీకు మహర్జాతకం పట్టటం ఖాయం"

"అలాగేలే... కానీ అప్పటికి నువ్ ముస లాడివైపోతావేమో! హీరోగా ఎలా పెట్టు కోను" అంది నవ్వుతూనే.

"ఎంత మాటన్నారు మేడమ్! వెధవ వయసుదేముంది. దాంతో సంబంధం లేకుండానే గ్లామర్ని కాపాడుకునే మార్గాలు ఈ భూమ్మీద కోకొల్లలు. తల నెరిస్తే... హెయిర్‌డై వుంది. పళ్లూడితే... పళ్ళసె ట్టుంది. దవడలు జారడం, చర్మం ముడ తలు పడ్డం లాంటివి జరిగితే కాస్మెటిక్ సర్జరీ వుంది. ప్రస్తుతం మానవులు కూడా దేవతల్లా నిత్యయవ్వనమంత్రం పఠిస్తు న్నారు మేడం" అన్నాడు ఆవేశంగా.

"ఛీ... నీచమానవుడా... దేవతలతో పోలికేంటిరా నీకు" చటుక్కున అనేసింది రంభ. అన్నాక నాలిక్కరుచుకుని కోపంగా చూస్తున్న డ్రైవర్‌తో "అట్లా అనుకుంటా రేమో దేవతలు... మన మాటలు వింటే" అని సర్దేసింది.

డ్రైవర్ ప్రసన్నంగా నవ్వాడు "వాళ్ళ మొహం మేడమ్. అసలు ఈనాటి మానవు డిముందు దేవతలెంత! ఈ లోకంలో మనిషి పొందే సౌఖ్యాలూ, సౌకర్యాలూ... ఆ లోకంలో ఎక్కడున్నాయని. ఓ కారా... బస్సా... రైలా, విమానమా ఎక్కడ కెళ్ళా లన్నా కాలినడకన వెళ్ళాల్సిందే"

రంభకు కోపమొచ్చేసింది "పుష్పక విమానం వుందిగా వాళ్ళకు"

"మన హెలికాప్టర్లముందూ... ఎయిర్ బస్‌ల ముందు అదేపాటి మేడమ్. ఇక వినోదం అంటారా... ఒక సినిమానా, నాట కమా! ఎప్పుడు చూసినా రంభ, ఊర్వశుల డ్యాన్సులేనాయె. మన పాప్‌ఆల్బమ్స్ ముందు ఆ పాటలూ, ఆటలూ ఎంతం టారు!"

రంభ గొంతు గంటుపెట్టుకుంటూ అంది "అక్కడ ఆకలి దప్పులుండవ్ తెలుసా! కేవలం అమృతం మాత్రమే తాగుతారు. ఎంత అదృష్టవంతులో" అంది.

విరగబడి నవ్వాడు డ్రైవర్.

"ఎందుకట్లా నవ్వుతావ్" చిరాగ్గా అడి గింది రంభ.

"లేకుంటే ఏంటి మేడమ్. ఆకలి దప్పుల్లే కపోవడం అదృష్టమా! ఆకలి దంచేస్తుంటే, ఓ ఫుల్ ప్లేట్ చికెన్ బిరియానీ లాగి... ఓ మొఘల్ ఐస్‌క్రీమ్ తింటే వచ్చేకిక్కు... దేవతలకి ఎన్ని జన్మలెత్తినా అర్థమౌతుందా! అసలిక్కడ దొరికే 'టీ' రుచి ముందు బెల్లం పానకంలాంటి ఆ అమృతం దేనికి పనికొ స్తుందంటారు!"

"అమృతమేదో... ఇంతక్రితమే తాగినట్టు చెబుతున్నావే" అక్కసుగా అంది రంభ.

"తాక్కపోయినా దాని టేస్ట్ అంతేనని స్టీరింగ్ గుద్ది మరీ చెప్పగలను. ఇక్కడ దొరికే కాఫీ... టీల చరిష్మా దానికి లేదు, రాదు"

అతనట్లా అంటూ కారుకున్న మ్యూజిక్ సిస్టమ్ ఆన్ చేశాడు. ఈమధ్యే ఓ సిని మాలో 'టీ' ఘనతను ఆకాశానికెత్తేస్తూ... చిరంజీవి స్వయంగా పాడిన పాట స్టార్ట యింది.

"కో ఇన్సిడెన్స్ అంటే ఇదే" అన్నాడు డ్రైవర్ పాట వింటూ.

"అంటే... దేవతలు మానవులముందు పనికిరారంటావ్" అడిగింది యుద్ధానికి

సన్నద్ధమౌతున్నదానిలా.

"నిస్సందేహంగా" చెప్పాడు డ్రైవర్.

"సరే నువ్ చెప్పినట్టే అనుకుందాం. మరి దేవతలు ప్రదర్శించే... మాయలు, మంత్రాల మాటేమిటి? ఆ దైవమాయ ముందు మానవులు ఆగుతారంటావా? "

"ఏంటదీ... మాయలూ మంత్రాలా... పి.సి సర్కార్ పేరు విని వున్నారా మీరు! ఆయనా... ఆయన కొడుకు చేసే ఇంద్రజాలంముందు... దేవతల మాయలూ, మంత్రాలూ బలాదూర్. పట్టాభిరామ్ గారు... హిప్నాటిజం అనే వశీకరణ విద్యను ఆయన ప్రదర్శించినట్టు ఏ దేవతనైనా ప్రదర్శించమనండి చూద్దాం"

రంభకి... అప్పటికప్పుడు... ఏదైనా మాయ ప్రదర్శించి... డ్రైవర్ నోరు ఘుయ్యించాలన్పించిందిగాని... అట్లా చెయ్యడానికది సమయం కాదని గ్రహించి కోపాన్ని నిగ్రహించుకుంది. అదీగాక... తనొక మానవ మాత్రురాలిగా వాళ్లతో కలిసిపోయి... సినిమా నటిగా వెలిగిపోవాలని నిర్ణయం తీసుకున్నాక... ఇక మానవుల మీద మండిపడ్డంలో అర్థం లేదన్పించింది. ఆలోచిస్తే... డ్రైవర్ మాటల్లో నిజమున్నట్టుగా కూడా అన్పించిందామెకు.

"ఇంతకీ మేడమ్... నన్ను హీరోగా పెట్టి సినిమా తీస్తారుగా" అన్నాడు మళ్ళీ మొదటికొస్తూ.

"తప్పకుండా" నవ్వింది రంభ.

"అదృష్టవంతులంటే మీరే మేడం. నా మహర్జాతకం మిమ్మల్ని బిలియనీర్‌ని చేసి తీరుతుంది" అన్నాడు ఆనందబాష్పాలు రాలుస్తూ.

"అదిగో అదే... మా యిల్లు. కారాపు" చెప్పింది రంభ. ప్రభాకర్... ఫణీంద్రల రూమ్ దగ్గరపడగానే.

★ ★ ★

ప్రభాకర్ వాళ్ల రూమ్ముందు కారాపించి కిందికి దిగుతూ "ఇదే మా ఇల్లు" అంది రంభ డ్రైవర్‌తో.

"ఎస్ మేడమ్. ఒకసారి చూసేక ఇంక మర్చిపోవడం అంటూ ఉండదు. అయ్యగారు మీకోసం మళ్లీ ఎప్పుడు కబురు పంపించినా క్షణాల్లో మీ ముందు వాలిపోతాను" అన్నాడు డ్రైవర్ వినయంగా.

రంభ నవ్వి ఊరుకుంది.

తృణమో పణమో బక్షీస్‌గా విదులుస్తుందేమోనని ఆశించిన డ్రైవరు మేడమ్‌గారి భుజానికసలు వ్యానిటీ బ్యాగే లేకపోవడం చూసి నిరుత్సాహపడ్డాడు.

ఇంటిముందు కారాగిన అలికిడికి అప్పుడే వరండాలోకొచ్చిన మిత్రులిద్దరూ ఆ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయారు.

ఆమె మళ్లీ రావడమే ఒక వింతైతే తమ రూమ్‌ని పట్టుకుని ఇదే మా ఇల్లని కారు డ్రైవర్‌తో చెబుతూండటం అంతకన్నా వింత కాబట్టి సహజంగానే వాళ్లిద్దరూ ఆశ్చర్యంతో కొయ్యబారిపోయారు కాసేపు.

ఈవిడేం విదిల్చేలా లేదనుకొని "సరే నమ్మా" అంటూ డ్రైవర్ కారు స్టార్ట్ చేసుకుని వెళ్లిపోగా కారు మిగిల్చిపోయిన దుమ్ముకేసి కాసేపు చూసి ఆ మీదట కొయ్యబొమ్మల్లా ఉన్న మిత్రద్వయం వైపు తిరిగింది రంభ.

అప్పటిక్కూడా వాళ్లల్లో ఇంకా చలనం పుట్టలేదు.

తెలిసో తెలీకో తాను వీళ్ల అడ్రస్‌ని తన అడ్రెస్‌గా ఇచ్చేసింది కాబట్టి దర్శకుడి దగ్గర నుండి మళ్లీ కబురొచ్చేదాకా కొన్నాళ్లపాటు తానీ ఇంట్లో ఉండటం అనివార్యం కాబట్టీ వీళ్లిద్దర్నీ మంచి చేస్కోవడం చాలా అవసరమనిపించి "ప్రభూ, ఫణీ ఏంటలా బొమ్మల్లా నిల్చున్నారు? పదండి ఇంట్లోకెళ్లి మాట్లాడుకుందాం" అంటూ ఎంతో చనువుగా వాళ్లిద్దర్నీ పలకరించింది రంభ.

తమ పేర్లని కూడా గుర్తుంచుకుని ఆమె అంత చనువుగా పలకరించేసరికి కొయ్యబొమ్మల్లో నేచురల్‌గానే కదలికేర్పడింది.

"మీరు మీరు? " అన్నాడు ప్రభాకర్.

"అతనెవరికో ఇది మీ ఇల్లని చెబుతున్నా వేంటీ? " అన్నాడు ఫణీంద్ర.

"ఆడపిల్లనిలా వీధిలో నిల్చోపెట్టి మాట్లాడ్డం భావ్యమా? ముందు నన్ను ఇంట్లోకి రానివ్వండి" అంది రంభ కళ్ళెగ రేస్తూ.

అందమైన ఆడపిల్ల ఇంట్లో కొస్తానం టుంటే చేదా?

"సరే రండి" అన్నారు మిత్రులిద్దరూ సంయుక్తంగా.

ఫణీంద్రకిపుడామె మతిస్థిమితం లేని అమ్మాయి కాదని స్పష్టంగా తెలుసు. ఎందు కంటే ఇంతకుముందామె వెళ్ళిపోయాక టీవీలో ఆ ప్రకటన మరోసారి వచ్చింది. ఆ పిల్ల మొహమూ ఈ మొహమూ ఒకటికాదు"

ఇంట్లోకెళ్ళి ఓ కుర్చీలో కూర్చున్నాక గోడ మీదున్న రంభ క్యాలెండర్‌కేసి కాసేపు చూశాక...

"కొన్నాళ్ళపాటు నేను మీ ఇంట్లో మీ మర దలిగా ఉండాలనుకుంటున్నాను. మీకేవన్నా అభ్యంతరమా? అనే షాకింగ్ డైలాగ్‌తో సంభాషణ స్టార్ట్ చేసింది రంభ.

అంతవరకూ ఆమె అందాన్ని కళ్ళతోనే ఆస్వాదిస్తూ మౌనంగా ఉన్న మిత్రద్వయం నేచురల్‌గానే నిర్ఘాంతపోయారామె మాట లకి మళ్ళీ.

"టీవీ ప్రకటనలో చూపించిన పిచ్చిది కాక పోయినా ఈమె వేరే పిచ్చిదేమో? అన్న సందేహం తలెత్తింది వాళ్ళిద్దరి బుర్రల్లో.

లేకపోతే ఏంటి?

ముక్కూమొహం తెలీని ఓ అమ్మాయి ఇద్దరు బ్రహ్మచారులుంటున్న కొంపకొచ్చి ముందేదో సంధివాగుడు లాంటిది వాగి పోయి, అర్ధంపర్థంలేని ఇంటర్వ్యూ లాంటిదేదో చేసిపోయి మళ్ళీ వచ్చి ఇపుడే కంగా మరదలిలా మీ ఇంట్లో సెటి లైపోతానంటుంటే ఆమె మానసిక ఆరో గ్యాన్ని ఎవరు మాత్రం శంకించకుండా ఉండగలుగుతారు?

అందుకే వాళ్ళిద్దరూ పిచ్చిదానికేసి చూసి నట్టే చూశారామెకేసి

ఎంతైనా భూలోకవాసులతో డైరెక్ట్ కాంటాక్ట్ తక్కువ కాబట్టి ఆ చూపుల్ని సరిగ్గా అర్థం చేసుకోలేక "ఏంటలా చూస్తు న్నారు? నేనిక్కడుండటం మీకిష్టం లేదా? " అనడిగింది రంభ.

"అసలు మీరెవరు? ఎందుకు మమ్మ ల్నిలా వేధిస్తున్నారు? " అన్నాడు ప్రభాకర్ ఎలాగో తేరుకుంటూ.

"వేధిస్తున్నానా? " చిరు ఆశ్చర్యంగా అంది రంభ.

"కాక దీన్నేమంటారు? మొదటిసారొచ్చిన ప్పుడు మీ గురించేం చెప్పకుండా మమ్మల్నే వేవో ప్రశ్నలడిగి వెళ్ళిపోయారు. ఇపుడేమో మీ రూంలో మరదలిగా ఉండిపోతానంటూ వచ్చారు. దీన్ని మరేమంటారు"

"వేళాకోళం కూడా అనొచ్చు" ఫణీంద్ర కూడా తేరుకుని తనూ తల దూర్చేడు ఆ సంభాషణలో.

"అబ్బే వేధింపూ కాదు వేళాకోళమూ కాదండీ! నేను నిజంగానే కొన్ని రోజులు మీ మరదలిగా మీ ఇంట్లో ఉండటానికొచ్చాను" అంది రంభ.

"ఊ అంటే మరదలిగా అంటున్నావ్ కొంపదీసి నీది బావలూ సయ్యా కేసా? " పుటుక్కున నోరు జారి అనేశాడు ఫణీంద్ర.

రంభ ముఖం గుండ్రటి పదిపైసలు బిళ్ళంత చిన్నదిగా అయిపోయిందతని మాటలకి.

భూలోక వాసులతో డైరెక్ట్ కాంటాక్ట్స్ అయితే లేకపోవచ్చుగానీ ఆమెకి భూలోక నాలెడ్జ్ అయితే బాగానే ఉందికదా!

అంచేత ఆ మాటల్లోని తప్పుడర్థాన్ని గ్రహించి వ్యధాభరిత హృదయురాలైపో యిందామె.

"ఛ! నేనలాంటి దాన్నికాదు" ఉబికి రాబో యిన కన్నీళ్ళని అదుపు చేసుకుంటూ అంది.

"మరెలాంటి వారు? "

ఈ ప్రశ్నలో కూడా కొంత వ్యంగ్యమున్నా దాన్ని పట్టించుకోకుండా అంది. "నిన్నటి దాకా నేనొక అనాథని. కానీ దర్శక వెంకన్న గారు నన్ను వారి నెక్ట్స్ పిక్చర్‌లో హీరోయి న్‌గా తీస్కోబోతున్నారు. ఇందాక నేనొచ్చిన కారు వారిదే! ఒకానొక కారణంగా నేను వారికి నా అడ్రస్‌గా మీ అడ్రసిచ్చాను. నేను మీ మరదల్నని వారికి చెప్పాను. రెండ్రో జుల్లో వారు మళ్లీ నాకు కబురు చేస్తాన న్నారు. అందుకే కొన్ని రోజులపాటు మీ ఇంట్లో ఆశ్రయం కోరుతున్నాను"

ఇదేదో చాలా కఠినమైన క్రాస్‌వర్డ్ పజిల్‌లా ఉందే అనిపించింది తరచుగా క్రాస్‌వర్డ్ పజిల్స్ పూర్తిచేసే అలవాటున్న ప్రభాకర్‌కి.

ఈవిడ చాలా వీర కోతలరాణిలా ఉందే? అనిపించింది ఫణీంద్రకి.

కారులోంచి దిగినంత మాత్రాన కాబోయే హీరోయిన్ అని నమ్మేయడం ఎలా? దట్టూ దర్శక వెంకన్న గారి నెక్ట్స్ పిక్చర్‌లో?

ఆవిడగారి ఆగమనం, పునరాగమనం, ఇపుడామె చెప్పిన మాటలు అనుమానాస్ప దంగానే ఉండటంవల్ల ఆమె మాటల్ని వాళ్లంత తేలిగ్గా నమ్మలేకపోయారు.

అందుకే కాసేపు మొహమొహాలు చూస్కుని దరిమిలా ఇద్దరూ కలిసి సంయు క్తంగా ఆమెకేసి అనుమానంగా చూశారు.

"మీరేం చెబుతున్నారో సరిగ్గా అర్థం కావ టంలేదు" అన్నాడు ప్రభాకర్ అలా అను మానంగా చూస్తూనే.

"సరే ఇంకాస్త స్పష్టంగా చెప్తా వినండి. నా పేరు రంభ. నేనొక అనాథని..." అంటూ ఏదో చెప్పబోయింది రంభ.

"నిజమేనా జోక్ చేస్తున్నారా? " అన్నాడు ఫణీంద్ర ఆమె మాటల్ని మధ్యలో తుంచేస్తూ.

"జోక్కాదు నిజమే. నా పేరు నిజంగా రంభే! నేనొక అనాథని. ప్రస్తుతం నాకె వరూ లేరు"

ఈసారి ప్రభాకర్ అడ్డుతగిలేదు ఆమె మాటలకి, "మరైతే ఇన్నాళ్లూ ఎక్కడ పెరి గారు? " అంటూ.

"అదొక పెద్ద కథ. మాది గుంటూరు. ఈమధ్యనే తల్లిదండ్రులిద్దరూ చనిపోగా నేను అనాథనయ్యాను. చిన్నప్పట్నుంచీ సిని మాల్లో చేరాలన్న కోరిక ఉండటంవల్ల ఇలా ఇక్కడికొచ్చి వెంకన్నగారిని కలుసుకున్నాను. అదృష్టవశాత్తు వారు నాకు వెంటనే అవ కాశం ఇవ్వడానికి ఒప్పుకున్నారు. నేను అనాథననీ, నాకెవరూ లేరనీ చెబితే నేను చీప్ అయిపోతానని మీ అడ్రస్ చెప్పి మిమ్మల్ని నా బావలుగా చెప్పుకున్నాను. కంగారు కంగారుగా అబద్ధమాడ్డంవల్ల నోటికొచ్చిన వరసేదో కలిపి చెప్పేశాను. మొదటిసారి మీ ఇంటికొచ్చిందేమో ఎవరో రౌడీ వెధవ నన్ను వెంటాడుతున్నట్టుగా అనిపిస్తే గభాల్న మీ రూం కనిపించి అలా ప్రవేశించేశాను. మీరు కూడా మగాళ్లేకదా అందుకే మీతో కూడా అప్పుడు నిజం చెప్ప కుండా ఏదేదో వాగేసి వెళ్లిపోయాను. తీరా దర్శక వెంకన్నగారు నీ ఇల్లెక్కడ నీ పెద్దవా ళ్లెవరు అనడిగితే ఏమీ పాలుపోక మీ పేర్లు చెప్పేసి మీ అడ్రస్ ఇచ్చేశాను" ఎదుటివాళ్లకి మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా చక చకా ఓ కథ అల్లుకు పోతూ చెప్పేసింది రంభ.

మామూలు స్త్రీలే గొప్పగొప్ప కథల్రాసి అగ్రశ్రేణి రచయిత్రులుగా రాణించగలుగుతు న్నప్పుడు దేవలోకవాసి అయిన రంభకి అదోలెక్కా?

ఆమె ఏమాత్రం తడుముకోకుండా అలా చెప్పుకొచ్చేసరికి ఈసారి ఆమె మాటలు ఒకింత నమ్మబుల్‌గానే అనిపించాయి మిత్రులిద్దరికీ.

అయినప్పటికీ అనుమానం చావక "మరి మీ లగేజీ అదీ ఏది? " అనడిగాడు ఫణీంద్ర.





"రైల్లో ఎవరో కాజేశారు. అంచేత ఒట్టి చేతుల్తో స్టేషన్‌లోంచి బైటికొచ్చి ఎటుపోవాలో పాలుపోక అలాఅలా నడుస్తుంటే ఎవరో ఓ రౌడీ లాంటి వ్యక్తి నన్ను ఫాలో అవుతున్నట్టుగా గ్రహించి వారి బారినుండి తప్పించుకోవడానికి మీ రూంలోకొచ్చాను. ఆ తర్వాత దర్శక వెంకన్నగారి దగ్గరికెళ్లగా లక్కీగా అదృష్టం నన్ను వరించింది. ప్రస్తుతానికి వారి కారిచ్చి నన్ను మీ ఇంటికి పంపించారు. మీరు నమ్మినా నమ్మకపోయినా ఇది నిజం? దయచేసి నన్నింకేమీ అడక్కుండా ఓ రెండ్రోజులు ఇక్కడ ఉండనిస్తే హీరోయిన్‌గా అగ్రిమెంట్ మీద సైన్ చేసి అడ్వాన్స్ తీసుకున్నాక నా దారి నేను చూసుకుంటాను" అంటూ ఆడిన అబద్ధానికి మరిన్ని నగిషీలు చెక్కింది రంభ.

"అంత తేలిగ్గా మీకు హీరోయిన్ ఛాన్స్ దొరికేయడం..." అని ప్రభాకర్ ఇంకా ఏదో అనబోతుంటే

"అదంతా నా అదృష్టం అంతే" అనేసింది రంభ.

"మరి మీరు మార్చుకోవడానికి బట్టలూ అవీ" ఆమె తమతోపాటు ఉండటానికి అర్ధాంగీకారాన్ని చెప్పకనే చెబుతూ అన్నాడు ప్రభాకర్.

బట్టలేముందీ ఎన్నికావాలంటే అన్ని నేను సృష్టించుకోగలను అనబోయి నిగ్రహించుకుంది రంభ.

తాను ఒరిజినల్ రంభనన్న సంగతి బయటపడకూడదనే కదా ఇన్ని అబద్ధాలాడ్డం.

అందుకే "ప్రస్తుతానికి వీటితోనే అడ్జస్ట్ అయి నెమ్మదిగా కొనుక్కుంటాలెండి" అనేసింది లోలోన నవ్వుకుంటూ.

తాను నిజమైన రంభననీ, స్వర్గలోకం నుంచి వచ్చాననీ చెప్తే భూలోక వాసులెవ్వరూ నమ్మకపోగా తనకి తాటాకులు కడతారని తెలుసుకాబట్టే ఆ విషయాన్నామె చాలా గోప్యంగా ఉంచదలిచింది.

అందుకే పాపం అలవాటు లేకపోయినా అన్ని అబద్ధాలాడిందామె.

కొంత అనుమానాస్పదంగా అనిపించినప్పటికీ ఒక అందమైన అమ్మాయి అందునా కాబోయే హీరోయిన్ రెండు మూడు రోజులు ఆశ్రయం అడిగితే కాదని ఎవరు మాత్రం అనగలరు?

అందుకే మిత్రులిద్దరూ మొహామొహాలు చూస్కుని ఓకే అంటే ఓకే అనేసుకున్నారు కళ్లతో.

దరిమిలా "మేమిద్దరం బ్రహ్మచారులం. అదాలోచించుకోండి ముందు" అన్నాడు ప్రభాకర్.

"అయితేనేం మీ ఇద్దరి మీదా నాకు నమ్మకం వుంది" అంది రంభ.

దాన్నో కాంప్లిమెంట్‌గా భావించి "మీ ఇష్టం" అనేశారు మిత్రులిద్దరూ.

"ఇంతవరకు మీరేం తిన్నారో ఏమో తింటానికేమైనా తెమ్మంటారా?" అన్నాడు ఫణీంద్ర.

'పిచ్చిమొహాల్లారా నాకాకలెందుకేస్తుంది? అలాంటివన్నీ మీలాంటి అల్పమానవులకే ఉంటాయి' అని మనసులో అనుకొని "ఇప్పుడేం వద్దులెండి. మీరు తిన్నప్పుడే నేనూ తింటాను" అనేసింది రంభ.

"సరే స్నానం చేస్తారేమో చేసి మీరు రెస్ట్ తీస్కుంటూ ఉండండి. మేం అలా బైటికెళ్లి మీకో రెండు చీరలూ, రెడీమేడ్ బ్లౌజ్‌లూ పట్టుకొస్తాం" అన్నాడు ప్రభాకర్.

"ఎందుకండీ! రెండ్రోజులాగి నేను కొనుక్కుంటాగా?" మొహమాటంగా అంది రంభ.

"అదేంటండీ! మీరు మా అతిథులు. మీకు సకల మర్యాదలూ చేయడం మా బాధ్యత" అన్నాడు ప్రభాకర్.

"సరే మీ ఇష్టం" అని నవ్వేసింది రంభ.

ఆ నవ్వున్జూసి "అబ్బ! ఎంత చక్కగా నవ్విందీ?" అని అనుకోకుండా ఉండలేకపోయారు మిత్రులిద్దరూ.



యువ హృదయాలు గదా! ఎంతైనా బ్రహ్మచారులూ!

★ ★ ★

"చూడబోతే మన రంభకి పిచ్చెక్కిందల్లే ఉంది" అంది ఊర్వశి.

"అవునవును లేకపోతే ఏకంగా అక్కడే సెటిలైపోవడం ఏంటి? అది కూడా సినిమా యాక్టరైపోవాలన్న ఉద్దేశ్యంతో" అంది మేనక.

"ఏదో అనుకోకుండా ఛాన్స్ తగిలింది కదాని అది వెండితెర మీద వెలిగిపోవాలనుకుంటోందేమో! కానీ ఈ విషయం దేవేంద్రుల వారికి తెలిస్తే అసలూరుకోరు" అక్కసుగా అంది తిలోత్తమ.

"ఊరుకోక ఏం చేస్తారు?" అంది ఊర్వశి.

అదేం మాట! భూలోకానికెళ్లి సెటిలైపోవడానికి మన దేవలోకం రూల్స్ ఒప్పుకుంటాయా?" అంది మేనక.

"అంతగా అయితే దేవనర్తకీమణి పోస్ట్‌కి రిజైన్ చేసేస్తుంది. లీవ్ అప్లికేషన్‌నే రిజక్ట్ చెయ్యలేకపోయిన దేవేంద్రులవారు రిజిగ్నేషన్ లెటర్‌ని రిజెక్ట్ చెయ్యగలుగుతారా?" తేలిగ్గా నాలుక చప్పరించేసింది ఊర్వశి.

"మరీ అంత ఈజీగా మాట్లాడకు. మన ఫోర్స్‌ని తట్టుకోలేక లీవుల విషయంలో దేవేంద్రులవారు కాస్త లిబరల్‌గా ఉంటున్నంత మాత్రాన రాజీనామాని కూడా అంత తేలిగ్గా అంగీకరించేస్తారా?"

మేనక అలా అనేసరికి అదీ నిజమేననిపించింది ఊర్వశికి.

మంత్రివర్గంనుండి ఒక మంత్రి తప్పుకున్నంత ఈజీనేం కాదుగదా, దేవనర్తకీమణి పోస్టనుండి తప్పుకోవడం?

ఆమె దాన్ని గురించే ఇంకా ఏదో ఆలోచిస్తుండగా "అది భూలోకంలో సినీస్టారై వెలిగిపోవడానికి వీల్లేదు. మనం వెంటనే వెళ్ళి దేవేంద్రులవారికీ విషయం తెలియజేద్దాం పదండి" అంది తిలోత్తమ ద్వేషంతో పళ్లు నూరుతూ.

అంతలో "నారాయణ... నారాయణ..." అంటూ వచ్చాడు నారదుడు.

"ఏంటమ్మళ్లూ సీరియస్‌గా ఏదో డిస్కస్ చేస్తున్నారు?" అడిగాడు వచ్చీరాగానే.

"మన రంభలుంగారు రంభశ్రీగా మారబోతుంటేనూ" అని సాగదీసింది తిలోత్తమ.

"రంభ రంభశ్రీగా మారబోతోందా? అంటే?" అన్నాడు నారదుడు.

"దర్శక వెంకన్నగారి నెక్స్ట్ పిక్చర్‌లో బుక్ అయింది. రేపోమాపో స్క్రీన్‌ప్లే టెస్ట్ చెయ్యించుకోబోతోంది. ప్రస్తుతం భూలోకంలోని ఇద్దరు బ్రహ్మచారుల రూంలో సెటిలైపోయింది" అని ప్రారంభించి విషయం సవిస్తరంగా చెప్పుకొచ్చింది తిలోత్తమ.

"అలాగా! మరీ విషయం దేవేంద్రులవారికి తెలుసా?"

"తెలిస్తే ఆయనెందుకూరుకుంటారు? ఇంకా తెలీదు. మేం వెళ్ళి తెలియజేద్దామనుకుంటుండగా ఇంతలో మీరు వచ్చారు..."

"అలాగా! అయితే మీరు వెళ్ళటం దేనికి లెండిక. నేనెళ్లి అంటించొస్తాగా!" అన్నాడు నారదుడు ఆ బాధ్యతని తాను వహిస్తూ.

"అంటించడంలో మీరు స్పెషలిస్ట్‌గదా! అలాగే కానివ్వండైతే" అంది తిలోత్తమ.

దాంతో నారదుడు మహదానందపడిపోతూ తన వాయిద్యాన్ని మీటుకుంటూ అక్కడినుంచి వెళ్ళిపోగా

నర్తకీమణులు ముగ్గురూ మళ్ళీ మాటల్లో పడ్డారు.

"అది సినిమా యాక్టరౌతుంటే మధ్యలో నువ్వెందుకిదవుతున్నావ్? అందువల్ల దానికే స్వర్గభ్రష్టత్వం ప్రాప్తిస్తుందిగా!" మేనక అడిగింది తిలోత్తమని.

"అంటే నువ్వేమనుకుంటున్నావ్? సినిమా ఫీల్డ్‌లో హీరోయిన్‌గా ఉండటం కన్నా మన ఈ స్వర్గం లైఫ్ బెటరనుకుంటున్నావా?"

"కాదా?"





"ఎంతమాత్రం కాదు. వాళ్ళకక్కడ ఎలాంటి రాయల్ ట్రీట్ మెంట్ ఉంటుందో తెలుసా? అడుగులకు మడుగులొత్తించు కుంటూ, కోరిందల్లా కాళ్ల దగ్గరికి రప్పించు కుంటూ... ఓహ్ లైఫ్ అంటే వాళ్లదే!" తన్మ యంగా కళ్లు మూసుకుంటూ అంది తిలో త్తమ.

"మరైతే రంభని చెడగొట్టే బదులు మనం ముగ్గురం కూడా వెళ్లిపోయి సిని మాల్లో ట్రై చేసుకుంటే పోలా?" ఆశగా అంది మేనక.

"సినిమాల్లో ఛాన్స్ దొరకటం అంత ఈజీ అనుకుంటున్నావా? రంభకంటే అది బయ ల్దేరి వెళ్ళిన వేళా విశేషం బాగుండబట్టి అలా సడన్‌గా ఛాన్స్ దొరికేసిందిగానీ మనకీ అలా దొరుకుతుందని గ్యారంటీ ఏంలేదు..." నిరా శగా పెదవి విరుస్తూ అంది తిలోత్తమ.

"పోనీ మనం కూడా మిస్ వరల్డ్, మిస్ యూనివర్స్ అలాంటి పోటీల్లో పాల్గొని నెగ్గి ఆ తర్వాత హీరోయిన్లం అయిపోవచ్చుగా?" ఊర్వశి అడిగింది.

"ఆయా పోటీల్లో నెగ్గటం మాత్రం అంత ఈజీ అనుకుంటున్నావా? దానికి చాలా తతంగం ఉంటుంది. రకరకాల టెస్టుల్లో నెగ్గితే తప్ప ఫైనల్స్‌కైనా చేరుకోలేం. డాన్స్ తప్ప మరేం చేతగానివాళ్ళం. మనమేం నెగ్గిచస్తాం ఆ పోటీలలో?"

"పోనీ మోడలింగ్ రంగంలో కాలుపె డదాం. మోడల్స్‌లో చాలామంది హీరో యిన్స్ కూడా అవుతుంటారుగా!" అంది మేనక.

"దానికీ బోలెడంత కాంపిటీషనుంది. అదీ గాక మోడల్సందరూ హీరోయిన్స్ అవుతార నుకోవడానిక్కూడా లేదు. అదృష్టమున్న ఏ కొందరో తప్పితే అందరూ అవరు"

"పోనీ బుల్లితెరకి ట్రై చేద్దామా?"

"మనలో ఒకరైన రంభ అక్కడ హీరో యిన్ కాబోతుంటే, వెండితెరమీద వెలగబో తుంటే మనం బుల్లితెరనాశ్రయించడం కన్నా ఇన్‌సల్ట్ ఇంకొకటుంటుందా! దాని కన్నా ఈ స్వర్గంలో తైతక్కలే మేలు" అంది తిలోత్తమ ఆ ప్రపోజల్‌ని నిర్ద్వంద్వంగా తిరస్కరించేస్తూ.

"మరైతే మనం దాని ఎదుగుదలని చూస్తూ ఇలా వాజమ్మల్లా ఉండిపోవాల్సిం దేనా?" మేనక బాధగా అంది.

"నారదులవారు దేవేంద్రులవారి దగ్గరికెళ్లే రుగా. అక్కడేం జరుగుతుందో చూశాక అప్పుడేదైనా ఉపాయమాలోచిద్దాంలే" అంది తిలోత్తమ.

సరే లెమ్మన్నట్టు మౌనంగా ఉండిపో యింది మేనక.

★ ★ ★

"ఏంటి నారదా నువ్వంటోంది?"

నేచురల్‌గానే ఆశ్చర్యపోయాడు దేవేం ద్రుడు.

"నిజం దేవేంద్రా! మన రంభ భూలో కంలో సెటిలైపోయింది. అక్కడున్న అభి నేత్రి రంభతో తలపడబోతోంది. ప్రస్తుతం ఇరువురు బ్రహ్మచారి యువకుల రూంలో ఆశ్రయం పొందుతోంది" అని ప్రారంభించి భూలోకంలో జరిగిదంతా చిలవలు పలవ లుగా వర్ణించి చెప్పాడు నారదుడు.

"అలా ఎలా చేస్తుంది? స్వర్గలోకవాసులు భూలోకంలో శాశ్వత నివాసం ఏర్పరుచుకో వడం నిషిద్ధంకదా!" అన్నాడు దేవేంద్రుడు బుర్ర గోక్కోబోయి కిరీటం అడ్డురాగా దాన్నే గోక్కుంటూ.

"గోళ్లరిగిపోతాయ్ అలా కిరీటాన్ని గోక్కో కండి" అని ముందుగా ఆయన్ని వారించి,

"తెగించినవారికి అడ్డేం ఉంది దేవేంద్రా! మన రంభిపుడు అన్నింటికీ తెగించేసింది. ఆ సినీమోజులో పడి మన దేవలోకం రూల్స్‌ని పట్టించుకునే స్థితిలో లేదిప్పుడు" అంటూ ఎగదోశాడు నారదుడు.

"అంటే తనింక మళ్లీ డ్యూటీ ఎక్కదం టావా?"

"ఇంపాసిబుల్..."



నారదుడి మాటింకా పూర్తికానేలేదు. అంతలో "సార్" అంటూ వచ్చాడు స్వర్గలోకపు ద్వారపాలకుడు.

అతని చేతిలో ఉన్న కవర్ని చూసి "ఏంటది? " అనడిగాడు దేవేంద్రుడు.

"మీకేదో కొరియరొచ్చింది సార్! నేను సంతకం చేసి తీస్కున్నాను" అంటూ దాన్ని దేవేంద్రుడికిచ్చాడు ద్వారపాలకుడు.

దాంతోపాటే కొరియర్ వాడిచ్చిపోయిన స్లిప్పుని కూడా ఇచ్చాడు.

ఎర్త్ టు హెవెన్ కొరియర్స్. హెడ్డాఫీస్ నాగపూర్. ఆ స్లిప్పునోమారు పరిశీలించి నలిపిపడేసి "వీళ్లొకళ్లు. ఏడేడులోకాల్లో ఎక్కడికైనా రెడీనే" అని గొణుక్కుని, దరిమిలా ఆ కవర్ని ఓపెన్ చేశాడు.

**కవర్‌మీద ఫ్రం రంభ,, కేరాఫ్/పి.ప్రభాకర్ అంటూ అడ్రస్ ఉంది.** కాబట్టి విప్పక ముందే తెలిసిపోయిందాయనకి.

'ఏముండుంటుంది లోపల?

కొంపదీసి రెజిగ్నేషన్ లెటర్ కాదు గదా? ' అనుకుంటూనే ఆ కవర్లో ఉన్న కాగితంలోకి చూసిన దేవేంద్రుడికి.

తన ఊహ నిజమే కావడంతో కళ్లు తిరిగినంతపనైంది.

ఆయన ముఖకవళికల్ని చూసి "ఏంటది దేవేంద్రా? రెజిగ్నేషన్ లెటరా? " అనడిగాడు నారదుడు.

"అవును" కసిగా పళ్లనూరి ఆ కాగితాన్ని నారదుడి కందించాడు దేవేంద్రుడు.

దాన్నోమారు పరిశీలించి.

"సరే, ఇప్పుడేం చేద్దామనుకుంటున్నారైతే? " అనడిగాడు నారదుడు.

"నేను దీనికి చచ్చినా ఒప్పుకోను. సింపుల్‌గా ఓ కాగితంమీద నాలుగక్షరాలు రాసి పంపించినంత మాత్రాన తెగిపోయే వ్యవహారమా ఇది? మన రూల్సిందుకొప్పుకుంటాయా? " అన్నాడు కోపంగా దేవేంద్రుడు.

"భూలోకంలోని వివిధదేశాలవాళ్ళు తమ పౌరసత్వాన్ని మార్చుకుంటున్నట్టే రంభ కూడా మన పౌరసత్వాన్నొదిలేస్తేనో? " అన్నాడు నారదుడు.

"రూల్స్ అండ్ రెగ్యులేషన్స్ అన్నాక అవి దేనికి సంబంధించినవైనా, ఏ దేశానికి సంబంధించినవైనా, ఏ లోకానికి సంబంధించినవైనా వెతికిచూస్తే ఏవో కొన్ని లొసుగులుండనే ఉంటైగదా" అని చెప్పాడు నారదుడు.

"అది భూలోకానికి సంబంధించిన విషయం. అక్కడైనా ఒక యువతి మరో దేశ పౌరసత్వం పొందాలంటే అంత తేలికేం కాదుగదా!" అన్నాడు దేవేంద్రుడు.

"ఒకదేశపు యువతి మరో దేశపు యువకుణ్ణి పెళ్లిచేస్కుంటే పౌరసత్వం మార్తుంది గదా! అలాగే రంభ కూడా ఎవరైనా భూలోకవాసిని పెళ్లిచేసుకుంటే? " అన్నాడు నారదుడు.

"అలా జరిగితే ఆటోమాటిగ్గా ఆమెకి స్వర్గభ్రష్టత్వం ప్రాప్తిస్తుందిలే. అది మన రంభ ఎవరైనా భూలోకవాసిని పెళ్లాడినప్పటి మాటకదా!" అన్నాడు దేవేంద్రుడు.

"సపోజ్... ఫర్ సపోజ్.... పెళ్లాడిందే అనుకోండి. అప్పుడు...? "

"చెప్పేనుకదా! దెన్ షి ఈజ్ నోమోర్ ఎ స్వర్గలోకవాసి. ఆమెకున్న స్వర్గలోక పౌరసత్వంతోపాటు దేవతాశక్తులు కూడా ఆటోమాటిగ్గా రద్దైపోతాయి. ఐ మీన్ మన పౌరసత్వం రద్దయిపోయి తత్సంబంధిత శక్తులన్నీ ఉడిగిపోతాయన్నమాట"

"ఐసీ" అన్నట్టు తలాడించి... "సరే! మీరిపుడేం చేయబోతున్నారు? " అనడిగాడు నారదుడు.

"షోకాజ్ నోటీసివ్వకుండా ఎవ్వరిమీదా ఏక్షన్ తీస్కోలేంకదా! అందుకే ముందుగా ఆమెకి వార్నింగ్ ఇవ్వాలి. వేరే మెసెంజర్ దేనికి? ఆ పనేదో నువ్వే చేసిపెట్టు..." అన్నాడు దేవేంద్రుడు.

"అంటే? "

"ఏముందీ? భూలోకానికి వెళ్లి రంభని

మీటై తన రెజిగ్నేషన్‌ని ఏక్సెప్ట్ చెయ్యలేదని చెప్పండి" అన్నాడు దేవేంద్రుడు- నారదుడి చేతిలో ఉన్న కాగితాన్ని లాక్కుని ఉండచుట్టి ఎటో విసిరేస్తూ.

"ఈ అవతారంతో నేను భూలోకానికెళ్తే అందరూ నవ్వుతారు. అందుకే రంభ కూడా ఆర్డినరీ గెటప్‌లో వెళ్లింది. నేను కూడా అలాగే వెళ్లనా?" అన్నాడు నారదుడు.

"పని జరగడం ముఖ్యం. ఎలాగోలా తగలడు" అనేశాడు దేవేంద్రుడు చిరాగ్గా.



"ఆ అమ్మాయికి ఈ చీర బాగుంటుంది..."

"కాదు... ఈ చీర బాగుంటుంది..."

"ఈ రంగు బాగుంటుంది..."

"కాదు. ఈ రంగు బాగుంటుంది..."

"ఈ బ్రాడ్ డిజైన్ ఆ అమ్మాయికి అస్సలు నప్పదురా"

"ఏంకాదు. బ్రాడ్ డిజైన్ ఆ అమ్మాయికి బాగుంటుంది"

"ఈ పింక్ కలర్ శారీ చూడు..."

"ఆ ఆలివ్‌గ్రీన్ కలర్ శారీ చూడు..."

అలా ఓ రెండు మూడు గంటలు కిందా మీదా పడి మొత్తానికి ఓ అరడజను చీరలు, వాటిమీదకు మ్యాచయ్యే రెడీమేడ్ బ్లౌజులూ, అలాగే బ్రాలూ, పెట్టీ కోట్‌లూ కూడా సెలెక్ట్ చేసి వాటిని ప్యాక్ చేయించుకుని చెరో ప్యాకెటూ చంకనిరికించుకుని 'వందనా బ్రదర్స్' అనబడే ఆ బట్టలషాపు నుండి బయటపడ్డారు మిత్రులిద్దరూ అనగా ప్రభాకర్ ఫణీంద్రలన్నమాట.

"బ్లౌజులూ, బ్రాలూ అందాజుగా కొనేశాం. చాల్తాయో లేదో"

"చాలకపోతే వాపసు తీసుకుంటానన్నాడుగా వేరేవి ఎక్స్‌ఛేంజ్ చేసి ఇస్తానన్నాడుగా"

"అసలింతకీ మనం సెలక్ట్ చేసిన ఈ రంగులూ అవీ తనకి నచ్చుతాయో లేదో..."

"నచ్చకపోతే ఓ నాల్రోజులు కట్టి అవతల పారేస్తుందిలే. రేప్పొద్దున్న సినీయాక్టరయ్యాక తానెలాగూ ఇలాంటి సాదాసీదా చీరలు కట్టదుకదా!"

"అవున్లే. అద్సరేగానీ అసలింతకీ ఆ అమ్మాయి చెప్పిందంతా నిజమేనంటావా? వెంకన్నగారు నిజంగానే ఆమెని తన సిన్మాలో బుక్ చేస్కున్నాడంటావా?"

"అతను ఎన్నిసార్లు ఎంతమంది కొత్తవారికి అవకాశమివ్వలేదు. హి ఈజ్ ఎ నైస్ డైరెక్టర్! అదీగాక ఆ అమ్మాయి కూడా నైస్ గాళ్‌లానే ఉంది. అబద్ధాలాడే మొహంలా లేదు..."

"నిజమేలే! అన్నట్టీ బట్టలకి మూడువేలు తగలేశాం. రేప్పొద్దున్న హీరోయిన్ అయ్యాక ఆమె ఇదంతా గుర్తుంచుకుని మన డబ్బులు మనకి తిరిగిస్తుందంటావా?"

"ఇవ్వకపోతే పోయిందిలే! ఫలానా ప్రముఖతారకి ఒకప్పుడు మేం ఆశ్రయం కల్పించాం. బట్టలు కూడా కొనిచ్చాం అని జీవితాంతం మనం గర్వంగా చెప్పుకోవచ్చు"

"అంతేలే అంతేలే..."

అలా ఉల్లాసంగా కబుర్లు చెప్పుకుంటూ వాళ్లిద్దరూ రూమ్‌కి చేరుకునేసరికి.

రంభ స్నానమూ అదీ చేసి, విడిచిన



దుస్తుల్ని మళ్ళీ కట్టుకుని రూంలో ఉన్న పౌడరూ గట్రా పూస్కుని ఉన్నంతలోనే నీట్‌గా ముస్తాబై కూర్చుంది.

మిత్రులిద్దర్నీ చూసి... ముఖ్యంగా వాళ్ళ చంకల్లో ఉన్న ప్యాకెట్లని చూసి... "ఏంట వన్నీ బట్టలే?." అనడిగింది ఆశ్చర్యంగా.

"అవును. మీరు విడిచిన బట్టలే మళ్ళీ వేస్కున్నారుకదా! ముందెళ్ళి డ్రెస్ చేంజ్ చేసుకుని రండి" అంటూ తన చంకలోని ప్యాకెట్ నామె కందించాడు ప్రభాకర్.

"మరే" అంటూ తను కూడా తన చంక



లోని ప్యాకెట్ నామెకందించాడు ఫణీంద్ర.

"చాలా థాంక్సండీ! నా గురించి మీరు చాలా శ్రమ తీసుకుంటున్నారు. అన్నట్టు వీటన్నిటికీ ఎంతయ్యిందీ?" అనడిగింది రంభ స్త్రీ సహజమైన కుతూహలంకొద్దీ రెండు ప్యాకెట్లనీ అక్కడికక్కడే విప్పేస్తూ.

"మూడువేలు" అన్నాడు ప్రభాకర్.

"డైరెక్టర్‌గారు నాకు డబ్బులివ్వగానే అంతకు రెండింతలు మీకిస్తాను సరేనా?" అంది రంభ.

"అవన్నీ తర్వాత చూస్కోవచ్చులెండి.

ముందైతే మీరెళ్ళి డ్రెస్ ఛేంజ్ చేసుకుని రండి" అన్నాడు ఫణీంద్ర.

అయినా రంభ అక్కడినుంచి కదల్లేదు.

"ఈ ఎర్రంచు తెల్లచీర బాగుంది. ఇదెవరి సెలక్షను? " అంది ఓ చీరని భుజంమీదుగా కప్పుకుంటూ.

"అది నా సెలక్షనేనండీ" అన్నాడు ఫణీంద్ర తన సెలక్షన్ ఆమెకి నచ్చినందుకు సంతోషిస్తూ.

"ఇది? " అంది రంభ ఇంకో చీరని చేతు ల్లోకి తీసుకుంటూ.

"అదీ నా సెలక్షనేనండీ" అన్నాడు ఫణీంద్ర మరింత సంబరంగా.

"ఇది కూడా బాగుంది. ఇదెవరి సెల క్షను? " అంది రంభ వేరొక చీరని చేతిలోకి తీసుకుంటూ.

"అది కూడా నా సెలక్షనేనండీ! మిగతా మూడు వాడి సెలక్షన్" అన్నాడు ఫణీంద్ర మరెంతో ఆనందంగా.

"ఇవి మూడూ బావున్నాయ్..."

రంభ అలా అంటుంటే సహజంగానే ప్రభాకర్ ముఖంలో కాస్త డల్‌నెస్ చోటు చేసుకుంది.

రాజుగారి పెద్ద భార్య మంచిదంటే ఆటో మాటిగ్గా చిన్న భార్య మంచిది కాదనేగా అర్థం.

అవి మూడు బాగున్నాయంటే, మిగతా మూడూ బాగోలేదనేగా అర్థం.

అంటే తనకి సెలక్షన్ చేతకాదనేగా అర్థం?

ప్రభాకర్ ముఖం కళ తప్పిపోవడం చూసి "అంటే మిగతా మూడూ బాగోలేదని కాదండీ. అవీ బాగానే ఉన్నాయ్! వాటి కన్నా ఇవి ఇంకా బాగున్నాయ్. అని నా ఉద్దేశం" అంది రంభ అతనికేసి ఊరడిం పుగా చూస్తూ.

పిర్ర గిల్లేక జోలపాట పాడితే ఏం లాభం.

"ఎందుకులెండి మాట మారుస్తారు? నేనొక సెలక్షన్ చేతగాని వెధవనిలెండి" అన్నాడు ప్రభాకర్ స్వీయనింద చేసు కుంటూ.

"మీరలా ఉడుక్కుంటే నేనేం చెయ్య నండీ బాబూ! నా ఉద్దేశం అదికాదని చెప్పానుగా" అంది రంభ మళ్ళీ అతన్ని ఊరడింపజూస్తూ.

అంతలో ఫణీంద్ర ఠక్కున లేచి వాళ్ళిద్దరి మధ్యకూ వచ్చి నిలబడి, "ఆ వెధవని ఊర డించకపోతే ఎంతగానీ ముందు మీరు డ్రెస్ ఛేంజ్ చేసుకుని రండి. ఆ ఎర్రంచు తెల్లచీరే కట్టుకోండి బావుంటుంది" అన్నాడు పెద్ద పోటుగాడిలా.

దాంతో "సరే"నంటూ రంభ ఆ చీరలన్ని టినీ తీసుకుని అక్కడి నుంచి పక్కగదిలోకి వెళ్ళి తలుపేసుకోగా,

అప్పుడు విరుచుకుపడ్డాడు ప్రభాకర్ ఫణీంద్రమీద, "ఏంట్రోయ్ తెగ రెచ్చిపోతు న్నావ్? నీ సెలక్షనే గదా ఆవిడ మెచ్చుకుం దనా? " అంటూ.

"అవును మరి అది వాస్తవమేగదా? " అన్నాడు ఫణీంద్ర కించిత్ గర్వంగా తలెగ రేస్తూ.

"ఏడ్చినట్టుంది. ఆ చీరలకు డబ్బు కట్టింది నేను. క్రెడిట్ కొట్టేసిందేమో నువ్వు"

"ఫిఫ్టీ... ఫిఫ్టీ చేస్కుందాం అన్నాకేకదా నువ్ బిల్ కట్టింది. రేపొద్దున్న నాకు జీత మొచ్చాక పదిహేనొందలు తీస్కోవా ఏంటి? "

"అయితే మాత్రం ఇప్పుడామె పొగడ్తలన్నీ నీకే దక్కిపోయాయిగా? "

"అందుకని ఇలా కుళ్ళుకోవాలా? అయినా నీకామె మీద ఎలాంటి ఆసక్తీ ఉండకూడదుగా. ఎందుకంటే నువ్ పెళ్ళి చూపులు చూసొచ్చినవాడివి, అందునా చూసొచ్చిన పిల్లని నచ్చుకున్నవాడివి"

"అంటే, నీ ఉద్దేశం? "

"సదుద్దేశమే. పెళ్ళిచూపుల్లో నువ్ చూసొచ్చిన మా సిస్టర్‌కి పరోక్షంలో కూడా

నువ్ ద్రోహం చెయ్యకూడదన్నదే నా సంకల్పం"

"ష్... టోను కాస్త తగ్గించు అవతల ఆవిడ పక్కగదిలోనే ఉంది"

"ఉంటే ఏంటి? నేను మాట్లాడుతున్నదీ వాస్తవమేగదా. నేనూ పెళ్ళికాని యువ కుడ్ని. ఆమే పెళ్ళికాని యువతి. మాకూ మాకూ మధ్య పరస్పరాకర్షణ కలిగినా తప్పు లేదు"

"అంటే నేను పెళ్ళయినవాడ్నా? "

"కాకపోవచ్చు. కానీ పిల్లని చూసొచ్చి నచ్చుకున్నావ్ కాబట్టి రంభలా ఉందని మెచ్చుకున్నావ్ కాబట్టి"

"ఊ... కాబట్టి? "

"నీకామెతో పెళ్ళయిపోయినట్టే లెక్క"

"అసలింతకీ నీ ఏడుపేంటి? "

"ఆమెకి నా చీరల సెలక్షన్ నచ్చింది. అంటే ఇంచుమించు మా ఇద్దరి టేస్ట్‌లూ ఒకటేనన్నమాట. సో... ఆమెకి నేను లైనేస్తే నువ్ అడ్డు రాకూడదు"

"నువ్ లైనేస్తే అంత తేలిగ్గా పడిపోవడా నికి ఆవిడేమన్నా అల్లాటప్పా మనిషనుకుం టున్నావా? కాబోయే హీరోయిన్. నీలాంటి చుంచుమొహాన్ని ఆమెందుకు ప్రేమి స్తుంది? "

మిత్రులిద్దరూ టోనులు తగ్గించే మాట్లాడు కుంటున్నప్పటికీ పక్క గదిలోని రంభకా మాటలు చాలా స్పష్టంగానే వినిపించాయి.

'ఓరి అల్పమానవుల్లారా! మీరెంత ఆశ పోతు వెధవల్రా నాకే లైనెయ్యాలని చూస్తు న్నారా? ' అనుకుని నవ్వుకుంది మనసులో.

తాను కట్టుకున్న ఎర్రంచు తెల్లచీరని సరి చేసుకుంటూ ఆమె ఆ గదిలోంచి మిత్రద్వ యమున్న గదిలోకి వస్తుండగా అప్పుడే మెట్లెక్కి వరండామీదకొస్తున్న నారదుడు కనిపించాడామె కంటికి.

దాంతో సహజంగానే ఆమె గతుక్కు మంది.

కొంపదీసి ఈ మహానుభావుడు వాస్త వాలు గాని మాట్లాడేస్తాడా? అన్న భయం ఆమెని లోలోన వణికిపోయేలా చేసింది.

అంతలో...

నారదుడు లోనికి రానేవచ్చాడు.

"ఎవరండీ మీరు? " ప్రభాకర్ ఆ కొత్త వ్యక్తికేసి ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

రంభ నిజం చెప్పొద్దన్నట్టు నారదుడికి సైగచేసింది గానీ దాన్నతను గమనించ లేదు.

"నా పేరు నారదుడండీ. ఇంద్రలోకం నుండొస్తున్నాను" అనేశాడు గభాల్న.

"ఆ...!" అన్నారు మిత్రులిద్దరూ ఆశ్చ ర్యంగా.

'కొంపముంచావ్ గదా నారదా' అనుకున్న రంభ చటుక్కున ఓ ఉపాయం ఆలోచించి,

"నన్నొక రౌడీ ఫాలో అయ్యాడని చెప్పానే అతనే ఇతను" అని ఠక్కున ఓ అబద్ధమాడే సింది.

"రిజర్వేషన్ ఛార్ట్‌లో చూసి నా పేరు రంభని తెలుసుకున్నాడు కాబోలు. నేను ట్రైన్ దిగినప్పటినుంచీ ఇలాగే అవాకులూ చవాకులూ పేలుతున్నాడు" అంది రంభే మళ్ళీ.

"అంతా అబద్ధం" అనరిచాడు నారదుడు.

కానీ ఆ మాటలాయన కంఠంలోంచి బైటికి రాకముందే "యూ స్కౌండ్రల్! ఆడ పిల్లని వెంటబడి వేధిస్తావుట్రా? గెటవుట్" అంటూ హీరోయిక్‌గా అతనిమీదకు దూకాడు ఫణీంద్ర.

ఏదో అక్కడి మాటలిక్కడా ఇక్కడి మాట లక్కడా చెప్పి కాలక్షేపం చేయడమే తప్ప ఏనాడూ ఎవ్వరితోనూ ఫైటింగ్ చేసెరుగని నారదుడికి సహజంగానే దడ పుట్టింది.

దాంతో బతికుంటే అమృతం తాగొచ్చను కుంటూ గభాల్న ఆ గదిలోంచి బైటికి పరు గుతీశాడు.

కార్యసాధన కన్నా స్వీయ సేఫ్టీ ముఖ్యం కదా!

"స్టుపిడ్. వెళ్ళిపోయాడులెండి" నారదుడు



పారిపోయినవైపు నిప్పులు గక్కుతూ చూసి ఆ మీదట రంభవేపు తిరిగాడు ఫణీంద్ర.

"మీ పేరు కూడా మా అభిమాన నటి పేరే కావడం చాలా సంతోషంగా ఉందండీ" అన్నాడు మాటల్ని పొడిగించడానికన్నట్టుగా.

"అన్నట్టు అడగడం మర్చిపోయాం. ఆల్రెడీ ఫీల్డ్‌లో ఓ రంభుంది కదా? మరి మీరు పేరు మార్చుకుంటున్నారా? " ప్రభాకర్ అడిగాడు కుతూహలంగా.

"మార్చుకోవట్లేదు. చివర్న శ్రీని చేర్చుకుంటున్నానంతే" అని ప్రారంభించి తన పేరు గురించి జరిగిన చర్చనంతా వాళ్ళిద్దరికీ వివరించింది రంభ.

అదంతా చాలా కుతూహలంగా విని...

"అయితే త్వరలోనే మీరు రంభశ్రీగా రంభకి పోటీ కాబోతున్నారన్నమాట" అన్నాడు ఫణీంద్ర.

"ఆమె ఒక్కదానికే అనేముందిలెండి? మిగతా అందరిక్కూడా నేను పోటీ కాబోతున్నాను" అంది రంభ గర్వంగా.

'గాడిదగుడ్డులే' అనుకున్నాడు ప్రభాకర్.

'కాస్త బానే ఉన్నా, మరీ అంత గొప్ప అందగత్తేంకాదుగా? అందర్నీ తలదన్నేయ్ గలగడానికి? ' అని కూడా అనుకున్నాడు.

కానీ ఫణీంద్ర మాత్రం అలాగేం అనుకోలేదు. పైగా...

"నిజమేనండీ నిజమేనండీ" అన్నాడు సంబరంగా.

ఆల్రెడీ అతనామె మీద మనసు పడడం ప్రారంభించేశాడు గనుక ఆమె అతని కంటికి ఓ అపురూప సౌందర్యరాశిలా కనిపించింది.

'ఇంతటి అందగత్తెలు స్వర్గలోకంలో కూడా ఉండరు' అని అతనామెకేసి పరవశంగా చూస్తూ అనుకుంటుండగా,

"మీరిద్దరూ మరోలా అనుకోకపోతే నేనొక్కసారి అలా బైటికెళ్ళొస్తాను" అంది రంభ.



"ఎక్కడికీ? " సంయుక్తంగా అడిగారు మిత్రులిద్దరూ.

"చిన్నపనుంది. ఓ ఫిఫ్టీన్ మినిట్స్‌లో మళ్ళీ వచ్చేస్తాను"

"అదేంటో చెప్తే మేం కూడా వచ్చి మీకు సాయం చేస్తాం కదా? "

మనసుని దోచుకున్న మగువని ఒంటరిగా బైటికి పంపడం ఇష్టంలేక అలా అన్నాడు ఫణీంద్ర.

"ఊహూ... అది మీతో చెప్పేదికాదు" అంటూ అడ్డంగా తలాడించింది రంభ.

"బజార్లో ఏదైనా కొనాల్సి ఉందా? ఐ మీన్ షాపింగ్..."

ఫణీంద్ర ప్రశ్నకి అప్రయత్నంగా "ఊ" అనేసింది రంభ.

"రేయ్! నా జీతమొచ్చాక ఇస్తాగానీ రంభగారికో ఐదొందలివ్వు" అన్నాడు ఫణీంద్ర ప్రభాకర్‌నుద్దేశించి.

'నీది కాకపోతే ఎంతవరకైనా దేకచ్చు అయిదొందలేం ఖర్మ వెయ్యైనా ఇవ్వమంటావ్' అని మనసులో బాధపడి, .

పైకిమాత్రం "సంతోషంగా" అంటూ జేబులోంచి తన పర్సు తీసి అందులోంచి ఓ అయిదొందలివతలికి లాగి రంభకందించాడు ప్రభాకర్.

మనీతో అవసరం లేకపోయినా వాటినందుకుంది రంభ.

దరిమిలా ఆమె ఆ గదిలోంచి బైటికి వెళ్ళిపోగా,

ఒకట్రెండు నిమిషాల విరామం తర్వాత "నాకెందుకో ఈవిడగారి వాలకమూ అదీ చాలా డౌట్‌గా ఉందిరా" అన్నాడు ప్రభాకర్.

"ఏ విషయంలో? "

"ఒకటనేముంది? అన్ని విషయాల్లోనూ..."

తన ప్రేయసిని మిత్రుడవమానిస్తుంటే, అనుమానిస్తుంటే కోపం రాకుండా ఎవరికుంటుంది!

నేచురల్‌గానే ఫణీంద్రక్కూడా కోపమొచ్చే

సింది.

"డోంటాక్ నాన్సెన్స్! ఆవిడ ముఖమూ అదీ చూస్తుంటే అనుమానించదగ్గ మని షిలా అనిపిస్తోందా అసలు? నీ మాటలు వింటుంటే కామెర్ల రోగి సామెత గుర్తొ స్తోంది నాకు" అన్నాడావేశంగా.

"అంటే? నీ ఉద్దేశం నేననుమానించదగ్గ మనిషిననా?" అన్నాడు ప్రభాకర్ కూడా ఆవేశంగా.

"అన్ని విషయాల్లోనూ కాదులేగానీ మగ బుద్ధి విషయంలో మాత్రం నువ్ ఖచ్చి తంగా అనుమానించదగ్గవాడివే. లేకపోతే ఏంటి? ఆల్రెడీ ఒకమ్మాయిని పెళ్ళిచూపుల్లో చూసి మెచ్చుకున్న నువ్వు ఇపుడీ అమ్మాయ్ విషయంలో ఇలాంటి అనవసరపు కుతూహ లాన్ని ప్రదర్శించడం ఎంత తప్పు? ఆమెకి లైనెయ్యడానికీ, ఆమె బాగోగులన్నీ చూస్కో వడానికీ నిష్కల్మష బ్రహ్మచారిని నేనొకడ్ను న్నాగా ఇక్కడ"

పిడికిళ్ళు బిగించి ఫణీంద్ర ఊగిపోతుంటే 'వీడికి పైత్యం బాగా తలకెక్కేసింది' అనుకు న్నాడు ప్రభాకర్ మనసులో.

"అయితే రంభని నువ్ ప్రేమిస్తున్నావన్న మాట" అన్నాడు పైకిమాత్రం మామూలుగా నవ్వేస్తూ.

"ఏం... ప్రేమిస్తే తప్పా?"

"ప్రేమించడం తప్పని ఎవరూ అనరు. కానీ ఒక కాబోయే నటిని ప్రేమించడం ఏంటి? ఆమె ఇప్పుడిప్పుడే ఫీల్డ్‌లోకి అడు గుపెడుతూ ఉంది. రేప్పొద్దున్న నాలుగు వేషాలొచ్చి హీరోయిన్‌గా ఇండస్ట్రీలో నిలదొ క్కుకుందనుకో. అప్పుడిక తాను రిటైరయ్యే వరకూ పెళ్ళిమాట ఎత్తదుకదా. సో... ఆమెని ప్రేమించినా నువ్వు బావుకునేదే ముంది?"

"ఎందుకు లేదు? ఆమె హీరోయిన్‌గా రిటైరయ్యేదాకా నేనామెకు సెక్రటరీగా బతికే స్తాను. ఆ తర్వాత మేమిద్దరం పెళ్ళిచేసు కుని, ఆ తర్వాతామె వదిన పాత్రలూ తల్లి పాత్రలూ వేస్తుంటే నేనేమో నిర్మాతగా మారి..."

"హాచ్..."

ప్రభాకర్ పాపం నిజంగానే తుమ్మొచ్చి తుమ్మాడు.

కానీ ఫణీంద్ర మాత్రం దాన్ని తెచ్చుకోలు తుమ్ముగా భావించి నొచ్చుకుని విసురుగా లేచిపోయాడక్కడినుంచి.

'ఈ పిచ్చి వెధవ చాలా అందమైన కలలు కనేస్తున్నాడుపాపం' అనుకుని నవ్వుకు న్నాడు ప్రభాకర్.

ఎలాగూ భూలోకానికి రానేవచ్చాను కదాని, రంభ సమక్షంలో తనకు జరిగిన అవమానాన్ని దిగమింగుకుని సిటీలో సైట్ సీయింగ్ చేస్తున్న నారదుడు టాంక్‌బం డ్‌పై అదృశ్యరూపంలో విహరిస్తుండగా అనుకోకుండా అదృశ్యరూపంలోనే ఆయన ముందు ప్రత్యక్షమై ఆశ్చర్యాన్ని కలిగించింది రంభ.

"నువ్వా! నామీద ఆ వెధవలిద్దరికీ అలాంటి అబద్ధాన్ని కల్పించి చెప్పి మళ్ళీ ఏ మొహం పెట్టుకుని వచ్చావ్ నా ముందుకు" అన్నాడు నారదుడు కోపంగా.

ఇద్దరూ అదృశ్యరూపంలోనే ఉన్నా, ఇద్ద రికీ దైవిక శక్తులున్నందువల్ల వాళ్ళిద్దరూ ఒకరికొకరు బాగానే కనిపిస్తున్నారు.

"ప్లీజ్ నారదా! నేను చెప్పేది వినండి"

"ఏంటి నువ్ చెప్పేది, నేను వినేదీ? మళ్ళీమళ్ళీ నీచే అవమానింపబడడానికి నాకేం బుర్రలేదనుకున్నావా?"

"అదికాదు నారదా! నేను నిజమైన రంభ నన్న విషయం మీరు వాళ్ళకెక్కడ చెప్పేస్తా రోనన్న భయంకొద్దీ నేనలా అబద్ధమాడా ల్సొచ్చింది. ప్లీజ్ ట్రై టు అండర్‌స్టాండ్ ది సిట్యుయేషన్. అప్పటికీ మీరు సగం నోరు జారేశారు. మీ పేరు నారదుడనీ, స్వర్గం నుండొచ్చారనీ చెప్పేశారు. మిగతా సగం కూడా మీరు చెప్పేసుంటే ఎంత అల్లరైపో యుండేది?"

"అల్లరా... అంటే...? "

"అల్లరంటే గొడవ"

"ఆ అల్లరి ఏరకంగా జరిగుండేదో చెప్పు"

"ఏముంది నారదా? స్వర్గలోకవాసులు భూలోకానికి రావడం ఈ రోజుల్లో జరగదు కాబట్టి వాళ్ళు మీ మాటల్ని నమ్మలేకపోయే వారు. మిమ్మల్ని ఏ మెంటల్ హాస్పిటల్ నుండో తప్పించుకొచ్చిన పేషెంట్‌గా భావించి బలవంతంగా మిమ్మల్నక్కడికి తరలించేసుండేవాళ్ళు. అదేగనక జరిగితే అక్కడ మీకు షాకులూ అవీ ఇచ్చి నానా బాధలూ పెట్టుండేవాళ్ళు. అందుకే ఇవన్నీ ఆలోచించబట్టే నేనంత తెలివిగా వ్యవహరించాను"

రంభ అంత సవివరంగా చెప్పడంతో నారదుడి కోపం తగ్గుముఖం పట్టింది.

దాంతో "సర్లే సర్లే" అనేసి తానొచ్చిన పనిని రంభకి వివరించాడాయన.

"అయితే నా రెజిగ్నేషన్‌ని దేవేంద్రుల వారు ఏక్సెప్ట్ చేయలేదన్నమాట" అంది రంభ అదోలా తలపంకిస్తూ.

"అన్నమాట కాదు. ఉన్నమాటే"

"అయితే నేనిపుడు మీతోపాటు దేవలోకానికి రాకతప్పదా? "

"అవును. ఇమీడియెట్‌గా వచ్చి నిన్ను డ్యూటీలో జాయినైపొమ్మని చెప్పారు దేవేంద్రులవారు"

"అలా చెప్పడానికి ఆయనెవరు? అఫ్ కోర్స్, నా రెజిగ్నేషన్ రిజక్ట్ చేసే అధికారమాయనకి ఉండొచ్చు కానీ కొన్నాళ్ళు నేను సిక్‌లీవ్ పెడితే? అప్పుడెలా రిజెక్ట్ చేస్తారు? "

నారదుడు ఫక్కున నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు? " రంభ కోపంగా అడిగింది.

"లేకపోతే ఏంటి? మనం దేవలోకవాసులం. మనకి అనారోగ్యాలే చెయ్యవు కదా. అలాంటప్పుడు మనకి సిక్‌లీవ్‌కి ప్రొవిజన్ ఎక్కడుంటుంది? " నారదుడింకా నవ్వుతూనే అన్నాడు.

'నిజమేనే' అనుకుంటూ బుర్ర గోక్కుంది రంభ.

ఆ గోక్కోవడంలో ఆమెకాటోమేటిగ్గా ఓ అమోఘమైన ఐడియా వచ్చేసింది.

"సిక్‌లీవ్‌కి ప్రొవిజన్ లేకపోవచ్చు బట్ వాటెబవుట్ సియల్స్? వాటెబవుట్ ఎరండ్ లీవ్స్? నాకున్న లీవ్స్ అన్నీ ఒకే సారి వినియోగించుకుంటూ ఓ థర్టీడేస్ లీవ్ ఎక్స్టెండ్ చేస్తున్నానని చెప్పండి మీ దేవేంద్రులవారితో..." అంది ధీమాగా.

"థర్టీ డేస్ ఎక్స్టెండ్ చేస్తావ్ సరే. ఆ తర్వాత? అప్పుడైనా నువ్ మళ్ళీ డ్యూటీ ఎక్కక తప్పదుగదా? " అన్నాడు నారదుడు 'నీ బోడి తెలివి తెల్లారినట్టే ఉంది' అన్నట్టుగా చూస్తూ.

"అక్కడే మీరు పప్పులో కాలేస్తున్నారు. థర్టీడేస్ భూలోకంలో ఉన్నాక నేను మళ్ళీ అక్కడికి రావాల్సిన అవసరమేముంటుంది? "

"అంటే? " రంభ ఆంతర్యమేమిటో అర్థం కాక అయోమయంగా చూశాడు నారదుడు.

"ఈ థర్టీ డేస్‌లో నేను స్వర్గభ్రష్టత్వాని పొందుతాను" అంది రంభ పిడికిళ్ళు బిగిస్తూ.

"యూ మీన్..."

"నాకు స్వర్గలోకం రూల్సన్నీ తెలుసు నారదా! దేవకాంతలు మానవులతో సంపర్కం పెట్టుకుంటే వారు స్వర్గ భ్రష్టత పొందుతారనీ, ఆపైన వారికింక స్వర్గలోక ప్రవేశార్హత ఉండదనీ, ఆటోమాటిగ్గా వాళ్ళ స్వర్గలోక పౌరసత్వం కాన్సిలైపోతుందనీ నాకు బాగా తెలుసు. నేనలా స్వర్గలోక భ్రష్టత్వం పొందాక ఆ దేవేంద్రులవారు నన్నింకేం జేయగలుగుతారు? "

నడుంమీద రెండు చేతులూ ఉంచుకుంటూ రంభ అలా అంటుంటే "ఔరా" అనుకున్నాడు నారదుడు.

"అయితే నువ్వింక దేవలోకానికి రానే





రావా? " అన్నాడాశ్చర్యంగా.

"రాను రాబోను. ప్రస్తుతం నాకు షెల్టరిచ్చిన ఇద్దరు కుర్రాళ్ళలో ఫణీంద్ర అనేవాడు నా మీద బాగా ఇంట్రస్ట్ చూపిస్తున్నాడు. నేనతన్తో సంపర్కం పెట్టుకుని, అతన్ని పెళ్ళికూడా చేస్కుని, సినీనటిగా ఇక్కడే సెటిలైపోతా శాశ్వతంగా..." అంది రంభ తన తిరుగులేని నిర్ణయాన్ని వెల్లడిస్తూ.

ఆమె అంత తెగించి చెబుతుంటే తానింక చేయగలిగిందేం లేదనే అనిపించింది నారదుడికి.

"సరే నీ ఇష్టం" అనేసి వెళ్ళిపోయాడు విసురుగా.

దరిమిలా రంభ హాయిగా నవ్వుకుని,

'పీడ విరగడైంది. అయితే నేనింక ఆ ఫణీంద్రకి లైన్ వెయ్యాలన్నమాట' అనుకుంటూ అక్కడినుంచి ఇంటిదారి పట్టింది.

అదృశ్యరూపంలో అక్కడ మాయమై తిరిగి ప్రభాకర్ వాళ్ల రూమ్ ముందు వెలిసింది.

మూసివున్న తలుపుల్ని తట్టబోయి లోపల్నుంచి వినిపించిన మాటలకి చటుక్కున ఆగిపోయింది రంభ.

"ఆమె తనకెవ్వరూ లేరని చెప్పిందికదా! మరిపుడెక్కడికెళ్లినట్టు? కారణమడిగితే చెప్పకూడదంది. అంత రహస్యమైన విషయం ఏమయ్యుంటుంది? నువ్ వెయ్యి చెప్పు, లక్ష చెప్పు నాకెందుకో ఆమె మీద చాలా అనుమానంగా ఉంది" అంటున్నాడు ప్రభాకర్.

"ఏదో కొనాలని వెళ్లిందిగా! వచ్చాక దాన్ని ఐమీన్ ఆమె కొన్న వస్తువుని చూస్తే మనకే తెలుస్తుందికదా! ఈలోగా ఇలా నోరు పారేసుకోవటం దేనికి. ఆమె వెళ్లినప్పటినుంచి ఇలాగే మాట్లాడుతున్నావ్ నువ్వు. నీ వరస నాకేం నచ్చలేదు" కోపంగా అంటున్నాడు ఫణీంద్ర.

"ఇంతలోకింతలోనే నువ్వామెమీద ప్రేమ పెంచేస్కుని ఫ్రెండునైన నన్నే ధిక్కరిస్తూ ఇలా మాట్లాడ్డం ఇది మాత్రం ఏమైనా బాగుందా? "

"ప్రేమ ఎంతలోకెంతలోకి పుట్టిందన్నది ప్రధానంకాదు. అది ఎంత గాఢమైందన్నదే ముఖ్యం. అయినా నువ్ నిజంగా నా స్నేహితుడివే అయితే నా ప్రేమని ఆశీర్వదించాలి గాని ఇలా ఆమెమీద నాకను మానం పుట్టేలా మాట్లాడ్డం సబబా? "

"సబబో, బేసబబో కొన్నాళ్లు పోయాక నీకే తెలుస్తుందిలే!"

"అంటే? "

"నాకెందుకో ఆమెవన్నీ మాయమాటలుగా అనిపిస్తున్నాయ్. ఆమె మననుండి ఏదో దాస్తోంది"

అంతవరకు వాళ్ల సంభాషణని ఆలకించిన రంభ చటుక్కున మాయమైపోయింది అక్కడినుంచి.

★ ★ ★

ఓ అయిదు నిముషాల తర్వాత...

"హాయ్..." అంటూ రంభ ఆ గదిలోకి ప్రవేశించింది.

ఆమె చేతిలో ఓ క్యారీబ్యాగూ, అందులో ఏదో ప్యాకెట్టూ ఉండటం చూసి "ఏంటిది? " అనడిగాడు ఫణీంద్ర.

"ఎబ్బే ఏం లేదు" అంటూ బిడియంగా నవ్వింది రంభ.

"ఏదో ప్యాకెట్టంత స్పష్టంగా కనిపిస్తుంటే ఏం లేదంటారేం? " అన్నాడు ప్రభాకర్ జిడ్డులా పట్టుకుంటూ.

"ఉందిగాని దీన్ని మీరు చూడకూడదు" అంది రంభ మరింత బిడియంగా.

'నా డబ్బుల్తో ఏదో వస్తువు కొనుక్కొచ్చుకుని పైగా దాన్ని నేనే చూడకూడదంటావా? ' అనుకున్న ప్రభాకర్.

"అలా అంటే కుదరదు. దాన్ని మాకు చూపెట్టి తీరాల్సిందే" అన్నాడు మొండిగా.

"ఈ వెధవకి అన్నీ కుశంకలేనండీ. పోనీ చూపెట్టేయండి అదేంటో" అన్నాడు ఫణీంద్ర. లోలోన అతనికీ కుతూహలంగానే

ఉంది మరి.

"తప్పదా? " ఒకింత ఇబ్బందిగా ముఖం పెడుతూ అడిగింది రంభ.

"తప్పదు" చెప్పాడు ప్రభాకర్.

"సరే మీరే చూస్కోండైతే" అనేసి ఆ క్యారీ బ్యాగ్‌ని టీపాయ్‌మీద పడేసి పక్క గదిలోకి వెళ్లిపోయింది రంభ.

దరిమిలా మిత్రులిద్దరూ ఒకరితో ఒకరు పోటీపడి మరీ ఆ క్యారీ బ్యాగునందుకుని అందులో ఏముందో చూశారు.

చూశాక నాలుకలు కరుచుకుని ఓ ఇదా? అనుకున్నారు.



"ఏంటీ? అలా అందా రంభ? " కిరీటాన్ని గోక్కుంటూ ఆశ్చర్యంగా అన్నాడు దేవేంద్రుడు.

"అవును దేవేంద్రా! హు ఈ వీణొకటి మోత బరువు..." అంటూ వీణని సరిచేస్కుని "ఆవిడగారక్కడ సెటిలైపోవడం ఖాయం. సో... రంభ మీద మనమింక ఆశ లొదిలేస్కోవడం మంచిది" అన్నాడు నారదుడు.

"అంతేనంటావా? మరైతే రంభ ప్లేస్‌లో ఇంకెవర్నయినా తీస్కోవాలిగా? " అన్నాడు దేవేంద్రుడు కిరీటాన్ని మళ్లీ గోక్కుంటూ.

"గోళ్లరుగుతాయ్" అని ఆయన్ని మందలించి "భూలోకం నుండి వచ్చి ప్రస్తుతం స్వర్గంలో ఉన్న నర్తకీమణులు చాలా మందున్నారులెండి. వారిలో ఎవరో ఒకర్ని తీస్కుందాం" అన్నాడు నారదుడు.

"ఎవరైతే బావుంటుంది? "

నారదుడు ఓ నాలుగైదు పేర్లు చెప్పాడు.

"ఇంకా ఎవరెవరున్నారు? "

నారదుడింకో నాలుగైదు పేర్లు చెప్పాడు.

"మొత్తం వీళ్లేనా? "

"గత పాతికేళ్లుగా వచ్చిందైతే వీళ్లే. అంతకు ముందువాళ్లని కూడా అకౌంట్‌లోకి తీసుకుంటే వందల మందుంటారు"

"దెన్ యు డూ వన్ థింగ్! అలాంటి వారందరి పేర్లూ ఒక లిస్ట్ ప్రిపేర్ చేయించు. అందరికీ ఏదైనా టెస్ట్ లాంటిది పెట్టి మెరిట్ ప్రకారం సెలక్ట్ చేద్దాం. ఉద్యోగాల అప్పాయింట్‌మెంట్ విషయంలో ఎవ్వరికీ అన్యాయం జరక్కూడదు గదా!"

నిజమే గదా! అన్నట్టు తలాడించి నారదుడక్కడి నుంచి వెళ్లిపోయాడు.

★ ★ ★

దేవేంద్రుడు చెప్పినప్రకారం భూలోకం నుండి స్వర్గ లోకానికి విచ్చేసిన నర్తకీమణుల్ని లిస్టౌట్ చెయ్యడంలో బిజీ అయిపోయాడు నారదుడు.

ముందస్తుగా ఓ వందమంది పేర్లను నమోదు చేసుకున్నాడు. వాళ్ళని మళ్ళీ ఫిల్టర్‌చేసి యాభైమందిని తేల్చాడు. ఆ లిస్ట్ తీస్కెళ్ళి దేవేంద్రులవారి ముందు పెట్టాడు.

దేవేంద్రుడా లిస్ట్‌ని సావధానంగా పరిశీలించి ఇంకో పాతికపేర్లను తొలగించాడు.

ఆనక నారదుని వంక తిరిగి "మిస్టర్ నారదా! మన రంభ, ఊర్వశీ, మేనకాదుల్ని పిలిచి ఈ పాతికమందికీ ప్రిలిమినరీ టెస్ట్ పెట్టమనండి" అన్నాడు.




నారదుడు... దేవేంద్రుడి మాటల్లో దొర్లిన పొరపాటుని గమనించి ఆయనకేసి బాధగా చూశాడు. "రంభా, ఊర్వశీ మేనకా దులంటున్నారు! ఇంకెక్కడి రంభ! ఆమెకు సబ్‌స్టిట్యూట్‌నేగా మనమిప్పుడు వెతుకుతూంట"

"అక్కటా! స్వర్గసీమనొదిలి చిత్రసీమ నేలబోతోన్న ఆ దౌర్భాగ్యురాల్నా తలుచుకున్నాన్నేను. పాపం శమించుగాక" అని నుదురు రాసుకున్నాక, "కమింగ్ టు ద పాయింట్... ఈ పాతికమందికీ ప్రిలిమినరీ పరీక్ష నిర్వహించి ఓ అయిదుమందిని సెలెక్ట్ చెయ్యమని మన నర్తకీమణులకు పురమాయించండి. చివర్లో మిగిలే అయిదుగురికీ ఇంద్రసభలో మెయిన్స్ కండక్ట్‌చేసి రంభకు సబ్‌స్టిట్యూట్ ఎవరన్నది నిర్ణయిద్దాం"

నారదుడు అట్లాగేనంటూ తలూపి 'సిల్క్‌స్మితా,... సిల్క్‌స్మితా' అంటూ లేచాడు.

"అదేంటి నారదా! నారాయణ అనడానికి బదులుగా సిల్క్‌స్మితా అంటున్నావ్?" అడిగాడు ఇంద్రుడు కొంటెగాచూస్తూ.

"అబ్బే! ఏదో పొరబాటు" సిగ్గుపడ్డాడు నారదుడు.

"అదేం కాదులే. సిల్క్‌స్మితని రంభ ప్లేసులో వెయ్యాలన్న ఆలోచనలో వుండుంటావ్. అనుకోకుండా అది నీ నోటంట వచ్చేసింది. యామై రైట్?" అన్నాడు.

"దేవరవారు మన్నించాలి. స్మిత ఆ పోస్ట్‌కి కరెక్ట్‌గా నప్పుతుంది మరి. ఈ టెస్టులూ అవీ అనవసరం" నారదుడు చల్లకు తెచ్చిన ముంత ఇంద్రుడికి చూపించాడు.

"ష్యూర్... మీమాటే నామాట. కాకపోతే ఒకటి" ఇంద్రుడు ముందుకు వంగాడు.

నారదుడు తన చెవిని ఇంద్రుడి నోటికి అందించాడు.

"పోస్టంటూ వున్నప్పుడు ఫార్మాలిటీస్ వుంటాయి. ఇంటర్వ్యూ నామకార్థమే. మన నర్తకీమణులక్కూడా విషయం చెవిన వెయ్యి. ప్రిలిమనరీస్ టైంలో సిల్క్‌స్మిత మీద కాన్‌సంట్రేట్ చెయ్యమని చెప్పు"

నారదుడు హ్యాపీగా ఓసారి ఈలవేసి... 'నారాయణ...నారాయణ... అనుకుంటూ వెళ్లిపోయాడు.

కానీ సిల్క్‌స్మిత అట్లాంటి రికమెండేషన్‌లేవీ తనకవసరం లేదంటూ... ప్రిలిమనరీస్‌లోనే అందర్నీ అదర గొట్టేసేలా చేసింది.

ఆరోజే మెయిన్స్.

దేవేంద్ర సభ కిక్కిరిసి ఉంది. నరకం నుంచి యముడు, చిత్రగుప్తుడూ కూడా వేంచేసి ఉన్నారు. నిజానికి... ఆ పోటీకి జడ్జెస్‌గా వాళ్లు పిలిపించబడ్డారు.

ప్రిలిమినరీ టెస్ట్‌లో సెలెక్ట్ అయిన వాళ్లలో నలుగురి నృత్యం పూర్తయింది.

వజ్ర వైడూర్యాలతో శరీరాల్ని అలంకరించుకుని... పట్టుపీతాంబరాల్ని ధరించి... వారు నాట్యం చేస్తుంటే... ఊర్వశీ, మేనకాదులకు ముచ్చెమటలు పోశాయ్. సినిమా నర్తకీమణులముందు దేవనర్తకీమణులు ఎందుకూ కొరగారన్న విషయం వారికి ఇట్టే అర్థమైపోయింది. దేవేంద్రుడు తమని మొత్తంగా ఊస్ట్ చేసేసి ఆ డ్యాన్సర్స్‌కి తమ పదవుల్ని కట్టబెడతాడేమోనన్న భయం కూడా పట్టుకుంది వాళ్ళకి.

ఇక చివరిగా సిల్క్‌స్మిత డ్యాన్స్‌ని అనౌన్స్ చేశాడు నారదుడు.

స్టేజ్‌మీద కొచ్చిన సిల్క్‌స్మితను చూసి ఒక్కసారిగా నోరెళ్ళబెట్టారందరూ.

ఆమె ఒంటిమీద వజ్రాలు గానీ వైఢూర్యాలుగానీలేవు. ఆ మాటకొస్తే అసలు నగలే లేవు.

షార్ట్స్ వేసుకుని వుంది. పేంటీలాంటి నిక్కరూ, ఓ స్ట్రాప్‌లెస్ బ్రా... అంతే వున్నాయామె ఒంటిమీద.

"నారదా! మన స్వర్గంలో ఈ టైపు కాస్ట్యూమ్స్ ఎక్కడాలేవే?"




పక్కనే వున్న నారదుడితో గుసగుసలా డాడు దేవేంద్రుడు. "వాటి కథాకమామీషు తర్వాత చెబుతాను. ఇంతకీ అవెట్లా వున్నాయో చెప్పండి లార్డ్" అన్నాడు నారదుడు.

"సింప్లీ సుపర్బ్. ఈ పట్టువస్త్రాలూ, నగలూ, మేలిముసుగులూ చూసి చూసి విసుగెత్తిపోయిన మా కన్నులకు ఈమె పండుగ చేస్తోంది నారదా. ఇకమీదట మన నర్తకీమణులక్కూడా ఇట్లాంటి కాస్ట్యూమ్స్‌నే డిజైన్ చేయించండి" తన్మయంగా అన్నాడు దేవేంద్రుడు.

"అవశ్యం ప్రభూ! అయితే వీటిని భూలో కవాసులు తప్ప ఇంకెవ్వరూ డిజైన్ చెయ్యలేరు"

"మరెలా? " అన్నాడు దేవేంద్రుడు డీలా పడిపోతూ.

"డోంట్ వర్రీ. భూలోకంలోని ఏదైనా ఫేమస్ డార్మెంట్ మేకర్‌కి ఆర్డర్ చేద్దాం. ఇప్పుడు స్మితకోసం వీటిని నేనట్లాగే తెప్పించా సుమా" నారదుడు ముసిముసిగా నవ్వుతూ చెప్పాడు.

దేవేంద్రుడు "వెరీగుడ్, డూ ఇట్" అన్నాడు.

సిల్క్‌స్మిత డ్యాన్స్ ఆరంభించబోతూ యముడికేసీ, చిత్రగుప్తుడికేసీ మత్తుగా చూసింది. ఆనక ఆమె చూపులు దేవేంద్రుడిమీద పడ్డాయి. కాస్తగా నోరు తెరిచి గుబులుపుట్టించేలా నవ్వింది.

సభికులంతా ఊపిరి బిగపట్టి చూస్తున్నారు. మేనకాదులు సర్వం కోల్పోయినవారిలా ఉడుక్కుంటూ, ఉస్సురంటూ చూస్తున్నారు.

సిల్క్‌స్మిత వేసే స్టెప్పులకి అక్కడున్న వారి గుండెలు ఎగిరెగిరి పడుతున్నాయ్. తెలీకుండానే... ఊగిపోతున్నారు. స్మిత డ్యాన్స్ చేస్తూనే ఇంద్రుడి సింహాసనాన్ని చేరుకుని చెయ్యిపట్టి ఆయన్ని స్టేజిమీదకు లాక్కొచ్చింది. అది చూసి యముడూ, చిత్రగుప్తుడూ తమంతట తామే లేచివచ్చి స్మితతో స్టెప్పులెయ్యసాగారు. ఇట్లా రంభాఊర్వశిలతో కలిసి వివపీలు డ్యాన్స్ చెయ్యడం ఎప్పుడూ జరగలేదు. ఈ అనుభవం వారికి వింతగా కొత్తగా మత్తుగా వుంది. మేనకాదులు మూతులు తిప్పుకుంటూ ఉక్రోషంగా అక్కడ్నుంచి వెళ్ళిపోతుంటే నారదుడు గుంభనంగా నవ్వి 'సిల్క్‌స్మిత సిల్క్‌స్మిత' అంటూ నిట్టూర్చాడు.

ఇంద్రసభంతా స్మిత డ్యాన్స్‌తో దద్దరిల్లిపోయింది. సభికులందరూ లేచి స్టెప్స్ వేస్తూ ఊగిపోయాకా తూలిపోయాకా ఎట్టకేలకు స్మిత డ్యాన్స్ ముగించింది.

యముడి జడ్జిమెంట్ ఇచ్చేలోగానే సభికులందరూ ముక్తకంఠంతో స్మితే విన్నరంటూ జేజేలు పలికారు.

సిల్క్‌స్మిత నృత్యహేలలో తడిసి ముద్దయిపోయిన ఇంద్రుడికి తెలియదు మేనకా ఊర్వశీ తిలోత్తమ తనమీద శచీదేవికి చాడీలు చెప్పడానికి వెళ్ళారని.

డ్యాన్స్ పూర్తయ్యాకా స్మితను చూసి ఓ డిక్లరేషన్ ఇచ్చాడాయన. "సిల్క్‌స్మిత ముందు ఎందుకూ కొరగాని ఆ రంభ మనసు మార్చుకుని స్వర్గానికి ఏతెంచినా... ఇక ఆమెకోసం ద్వారాలు తెరిచేదిలేదు"

సభికులంతా మళ్ళీ జయజయధ్వానాలు చేశారు.

★ ★ ★

"స్వర్గలోకానికి ప్రభువు మీరు. కాస్తైనా బుద్ధుందా మీకు? " శచీదేవి కోపంగా చూసింది.

"వాట్... డార్లింగ్... నేనేం చేశాను? " అడిగాడు ఇంద్రుడు అయోమయంగా.

"ఏం చేశారా! ఆఫ్ట్రాల్ ఒక డాన్సర్‌తో కలిసి సభలో తైతక్కలాడ్డానికి మీకు సిగ్గు లేదూ? "

"ఓ... అదా" తేలిగ్గా అన్నాడు దేవేంద్రుడు.



"నువ్ సభకు రాలేదుగా... ఈ విషయం నీకెట్లా తెలుసు?"

"మన ఊర్వశీవాళ్ళు చెప్పారు. అది నిజమేనా?"

దేవేంద్రుడి కళ్ళముందు ఒక్కసారిగా కదిలిపోయింది సిల్క్‌స్మిత. "భయపడతావేం దేవేంద్రా నిజమని చెప్పెయ్. ఏం ఆమాత్రం మగతనం లేదా నీకు?" అని ఎదుర్గుగా నిలబడి స్మిత అడుగుతున్నట్టే అన్పించింది.

ఏదో ట్రాన్స్‌లోకి వెళ్ళిపోయినవాడిలా అన్నాడు "నిజమే శచీ! ఆ స్మిత సమక్షంలో నాకేదో అయింది. నాకే కాదు... మన యముడికీ, చిత్రగుప్తుడికీ, నారదుడికీ కూడా ఏదో అయిపోయింది. అంతేకాదు ఇంద్రసభికులందరికీ కూడా ఏదేదో అయిపో..."

దేవేంద్రుడి మాటలు పూర్తయ్యేలోగానే 'ఠంగు'మనే ఓ శబ్దం విన్పించడం, వెనువెంటనే ఆయన నోట్లోంచి 'అమ్మో' అన్నకేక వెలువడ్డం వెంటనే జరిగిపోయాయి.

కళ్ళు బైర్లు కమ్ముతుండగా భార్యకేసి అయోమయంగా చూశాడు.

శచీదేవి చేతిలో ధగధగలాడిపోతున్న బంగారు అప్పడాల కర్రను చూడగానే దేవేంద్రుడికి జరిగిందేమిటో క్లియర్ కట్‌గా తెలిసిపోయింది.

"శచీ" అన్నాడు బాధగా.

"జ్ఞానోదయమైనట్టేనా. ఇంకోటి ఇవ్వనా?" అడిగిందామె నిప్పులు కురిపిస్తూ.

"అయింది. ఇంకెప్పుడూ సభలో అట్లా స్టెప్పులెయ్యను గాక వెయ్యను"

"అదీ డిగ్నిటీ అంటే" మెచ్చుకుంది శచీదేవి.

తలమీద కట్టిన బొప్పి తడుముకుంటూ మేనకాదుల్ని తలుచుకుని పళ్ళు పటపటా నూరుకున్నాడు.




బంగారు అప్పడాలకర్రని అటకమీదకు గిరాటెయ్యబోతున్న శచీదేవి గిర్రున ఇటుతిరిగి "ఏంటా సౌండూ?" అంది.

"అబ్బే ఏంలేదు. నామీద నీకు కోపం వచ్చేలా చేసిన సిల్క్‌స్మితను తల్చుకొని పళ్ళు కొరుక్కుంటున్నాను" చెప్పాడు.

"ఉత్తినే పళ్ళు కొరకటంకాదు. వూస్ట్‌చేసి పారెయ్యండి ఉద్యోగంలోంచి"

"ఉద్యోగం ఇచ్చి గంటకాలేదు. అప్పుడే ఊస్టింగ్ అంటే... రూల్స్ ఒప్పుకోవు. కనీసం ఆమెను ఓ నెలన్నా పోస్ట్‌లో వుంచాల్సిందే" భయంభయంగా చూశాడు దేవేంద్రుడు.

శచీక్కూడా రూల్స్ తెలుసుకాబట్టి ఇంకేం మాట్లాడలేదు. కిచెన్‌లోకెళ్ళి ఓ కప్పు అమృతం తెచ్చి భర్తకిచ్చి చెప్పింది, "లేచి అట్లా కూర్చోండి. నెత్తిమీద హెవెన్‌బామ్ రాస్తాను"

'హమ్మయ్య' అనుకున్నాడు దేవేంద్రుడు.

శచీ ఎప్పుడూ ఇంతే... నిముషంలో అలుగుతుంది. అంతలోనే ముద్దుచేస్తుంది.

"అదికాదండీ..." అంది శచీదేవి దేవేంద్రుడి తలమీద కట్టిన బొప్పికు బామ్ రాస్తూ.

"చెప్పు డార్లింగ్" అన్నాడు.

"ఓ నెలపోయాక సిల్క్‌స్మితని పోస్ట్‌లోంచి తీసెయ్యండి"

"అట్లాగే" అట్లా అంటుంటే ఇంద్రుడికి గొంతుపట్టేసింది. "కానీ రంభ రావాలిగా భూలోకంనుండి" అన్నాడు, రంభ రాకుంటే బాగుండునన్న కోరిక మనసులో మెదుల్తుండగా.

"రాక ఛస్తుందా! వస్తుంది" శచీ ఖచ్చితంగా అంది.

"రానని... నారదులవారికి తెగేసి చెప్పిందట"

"ఆవిడ చెప్తేసరా! మనం రప్పిద్దాం" అంది ఆవేశంగా బొడిపెను రుద్దుతూ.

"అబ్బా!" అన్నాడు ఇంద్రుడు.

"రంభొస్తే మీకేమిటట బాధ?" శచి

గుడ్లురిమింది.

"ఛ... నేను 'అబ్బా' అన్నది అందుక్కాదు. బొడిపెమీద నువ్ గట్టిగా రుద్దితే"

"అవున్లే మా చేతులంతే కఠినం. అదే ఆ స్మిత చేతులైతే సిల్క్‌లా వుంటాయ్‌కాబోలు" మళ్ళీ ఆవేశంగా రుద్దింది.

ఈసారి ఇంద్రుడు 'అబ్బా' అనలేదు. సైలెంట్‌గా కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

"స్మిత భజన మానేసి రంభని రప్పించే ఉపాయమేదైనా ఆలోచించండి" అందామె.

"నా ప్రయత్నం నేను చేశాను. పోనీ నువ్వేదైనా ఉపాయం చెప్పరాదూ? " అడిగాడు.

శచీదేవి కాసేపు తీవ్రంగా ఆలోచించింది. ఉన్నట్టుండి ఆమె ముఖం తళుక్కుమంది.

"రంభకు భూలోకంలో సినిమా ఛాన్స్ రాబట్టే కదా స్వర్గానికి రానని భీష్మించుక్కూర్చుంది" అనడిగిందామె భర్తని.

"అవును" అన్నాడు ఇంద్రుడు.

"ఆ ఛాన్స్ పోయిందనుకోండి... చచ్చినట్టు వస్తుందిగా"

"రావచ్చు"

"రావచ్చేంటి. వచ్చితీర్తుంది. సో... మనం దర్శక వెంకన్న సినిమాలో రంభకు వచ్చిన హీరోయిన్ ఛాన్స్‌ని పోగొట్టాలి"

ఇంద్రుడు అబ్బురంగా శచీదేవికేసి చూశాడు.

"ఇందుకే కాబోలు... భార్యల్ని కార్యేషు మంత్రీ అంటారు" అన్నాడు మెచ్చుకోలుగా.

భర్తట్లా మెచ్చుకోగానే శచీదేవి పొంగిపోయి... ఆనక కరిగిపోయి "సారీ... అండీ... ఇందాక మీ తలమీద బొడిపె ఫామ్ అయ్యేలా కొట్టినందుకు... ఐ యామ్ ఎక్స్ట్రీమ్లీ సారీ" అంది.

"ఇట్సోకే... ఇట్సోకే..." అన్నాడు ఇంద్రుడు.

"అదికాదండీ... రంభనట్లా తన ఇష్టానికి వదిలేశారనుకోండి. రేపు ఊర్వశీ... ఎల్లుండి మేనకా, ఆవలెల్లుండి తిలోత్తమా, ఇట్లా అందరూ వరసపెట్టి భూలోకానికి చెక్కేస్తారు. ఇక వాళ్లని చూసి మన స్వర్గలోకపు వివిపీలందరూ భూలోకానికి షిఫ్ట్ అవుతారు. చివరికి స్వర్గలోకపు సాధారణ పౌరులుకూడా స్వర్గం ఖాళీ చేసేస్తారు. అప్పుడింక మీరూ మీ పదవీ ఏమౌతారో ఆలోచించండి. సో... రంభ విషయంలో మీరు ఉదాసీనంగా ఉండకండి"

శచీదేవి మాటలకు దేవేంద్రుడి కళ్ళు తెరుచుకున్నాయి. తలమీద కట్టిన బొడిపెకు ఆమే కారణం అన్న విషయం కూడా మర్చిపోయి శచిని విపరీతంగా పొగిడాడు.

"ఇవన్నీ తర్వాతగానీ... ముందా స్వర్గలో కద్వారం దగ్గర సెక్యూరిటీ టైట్ చెయ్యండి. మన డాన్సర్లు ఈ పాటికే ఏదైనా ప్లాన్‌లో వున్నారేమో!" అందామె.

★ ★ ★

"దేవేంద్రుల వారు రంభ విషయాన్ని ఎంత లైట్‌గా తీస్కున్నారో చూశావ్‌గా! సో... మనం కూడా భూలోకానికి వెళ్లిపోదామే! మనం వెళ్లిపోయినా ఆయన మనల్నేం చెయ్యడు" అంది తిలోత్తమ మేనక, ఊర్వశులతో.

"కానీ తీరా వెళ్లేక అక్కడ మనకవకాశాలొస్తాయన్న గ్యారంటీ ఏం లేదుగదా! మొన్న మనం డిస్కస్ చేసుకున్నది అదేగదా? " అంది మేనక.

"నిజమేననుకో. కానీ ప్రయత్నించకుండానే వెనక్కి తగ్గిపోతే ఎలా? వెయ్యి మైళ్ల ప్రయాణమైనా మొదటి అడుగుతోనే ప్రారంభమవుతుంది సో... మనం సాహసం చెయ్యక తప్పదు"

తిలోత్తమ అలా అనేసరికి మిగతా ఇద్దరూ సై అన్నారు ఉత్సాహంగా.

అమృతం తాగి ఇంద్రసభలో తైతక్కలాడ్డం తప్పితే ఏముంది స్వర్గంలో?

అదే భూలోకంలో అయితే ఎన్ని సుఖాలు? ఎంత వెరైటీ జీవితం?

ముగ్గురూ కలిసి అలా ఒక నిర్ణయానికొ



చ్చేసి "రయ్... రయ్"న పరుగుతీశారు స్వర్గ ద్వారంకేసి.

యూజువల్‌గా ఉండే ఒకరిద్దరు ద్వార పాలకులు కాకుండా ఇపుడక్కడ చాలా టైట్ సెక్యూరిటీ ఏర్పాట్లు చేయబడ్డాయి.

ఛీఫ్ సెక్యూరిటీ ఆఫీసర్, అసిస్టెంట్ ఛీఫ్ సెక్యూరిటీ ఆఫీసర్లతోసహా దాదాపు ఓ పాతిక మంది సెక్యూరిటీ స్టాఫ్ సాయుధులై ఉన్నారక్కడ.

సెక్యూరిటీని ఇంత టైట్ చేశారేంటబ్బా? అనుకుంటూనే వాళ్లు ముగ్గురూ ద్వారాన్ని సమీపించగానే

సహజంగానే సెక్యూరిటీ వాళ్లంతా వాళ్లని అటకాయించారు.

"అదేంటి? మేం భూలోక గగన విహారానికి వెళ్తున్నాం. రోజూ వెళ్లొస్తూనే ఉంటాంగా! ఇవ్వాళ కొత్తగా అటకాయిస్తున్నారేంటి? " అంది తిలోత్తమ.

"రోజూ సంగతి వేరు. ఇపుడు సెక్యూరిటీ రూల్స్ మారిపోయాయ్! దేవేంద్రులవారు తన పర్మిషన్ లేకుండా స్వర్గం నుండి చీమని కూడా బయటికి వెళ్లనీయొద్దన్నారు" అన్నాడు సి.యస్.ఓ తన చేతిలోని మెషిన్‌గన్‌ని వాళ్లకి ఎక్కుపెడుతూ.

"ఎందుకని అలా? "

"ఏమో అదంతా నాకు తెలీదు. కావాలంటే మీరెళ్లి దేవేంద్రుల వారి నుండి అనుమతి పత్రాలు తీసుకురండి. అప్పుడొదుల్తాను మిమ్మల్ని బైటికి" అన్నాడు సి.యస్.ఓ కటువుగా.

"అవును మేడమ్. మా డ్యూటీ మేం చెయ్యాలిగదా? " అన్నాడు ఏ.సి.యస్.ఓ.

ఈ చెరనుండి విముక్తులమైపోదామనుకుంటే ఇలా జరిగిందేంటబ్బా? అని మనసులో బాధపడుతూ, "ఒక్క అరగంటలో మళ్లీ వచ్చేస్తాం. ప్లీజ్... మమ్మల్ని ఒక్కసారి బైటికొదిలి పెట్టండి" అని బతిమాలబోయింది తిలోత్తమ.

"అరగంట కూడా అక్కర్లేదు. వియ్ విల్ కంబాక్ ఇన్ ఫిఫ్టీన్ మినిట్స్" అంది మేనక.

"అవునవును" అంది ఊర్వశి.

అయినా సెక్యూరిటీవాళ్లు మెత్తబడలేదు. ఎవరి డ్యూటీ వాళ్లు చెయ్యాలికదా!

"నథింగ్ డూయింగ్ మేడమ్! గో అండ్ గెట్ ది పర్మిషన్ లెటర్స్ అదర్‌వైజ్ వియ్ వోంట్ అలౌ" అనేశాడు సి.యస్.ఓ ఖండితంగా.

ఓరి నీ స్ట్రిక్‌నెస్ తగలడిపోనూ. అని మనసులో తిట్టుకున్నప్పటికీ ఇంక వాళ్ల దగ్గర తమ పప్పులుడకవనిపించి అక్కడి నుంచి వెనుదిరిగారు వాళ్లు ముగ్గురూ.

★ ★ ★

"పర్మిషన్ లెటర్సా? దేనికీ? " ముగ్గురికేసీ మార్చి మార్చి చూస్తూ కొంత కోపంగా అడిగాడు దేవేంద్రుడు.

"అదేంటి దేవేంద్రా? రోజూ భూలోక గగనతలం పైకి అలా వ్యాహ్యాళికెళ్లి రావటం మాకలవాటుకదా? ఇదేదో కొత్తైనట్టు మాట్లాడుతున్నారేంటి? " అంది తిలోత్తమ.

"ఇన్నాళ్లూ అంటే ఏదో జరిగిపోయింది. కానీ ఇకనుంచి మాత్రం మీ ఆటలు సాగవ్! ఫ్రీడమ్ ఇస్తే దుర్వినియోగం చేస్తున్నారందరూ! రంభ 'ఏం చేసిందో మీకు తెలుసు కదా? "

"అదలా చేసిందని మేమూ అలాగే చేస్తామా? " అంది... తిలోత్తమ 'ఒక్కసారి వదిలి చూడండి. అప్పుడు తెలుస్తుంది ఏం చేస్తామో' అని మనసులో అనుకుంటూ.

ఆవులిస్తే కొందరు మనుషులే పేగులు లెక్కపెట్టగలరు.

అలాంటిది దేవేంద్రుడికి వాళ్ల ఆంతర్యాల్ని కనిపెట్టడం ఓ లెక్కా!

"మీరేదురుద్దేశంతో బయల్దేరారో నాకు తెలుసులే" అన్నాడు పళ్లు నూరుతూ.

"ఛఛ! అలాంటిదేం లేదు దేవేంద్రా! మేం కూడా దాన్లా భూలోకంలో సెటిలైపోవాలనేం వెళ్ళటంలేదు. రోజూలాగే వెళ్లొద్దామ

నుకుంటున్నాం అంతే! అయినా దాన్లా మేమేవన్నా స్వర్గం విలువ తెలియని మూర్ఖురాళ్లమా?!" అంది ఊర్వశి హొయ లొలకబోస్తూ.

"అవునవును... మేమలాంటి మూర్ఖురాళ్లం కాము" అంది మేనక తను కూడా హొయలొలకబోస్తూ.

నిత్యం వాళ్ళ డ్యాన్స్‌ని తిలకిస్తూ ఉండే వాడేనాయె! వాళ్లేదో కాస్త హొయలొలికించినంత మాత్రాన ఇదైపోవడానికి దేవేంద్రుడేమైనా ఆర్డినరీ మనిషా!

ఇందాకటి సి. యస్. ఓకి మల్లేనే "నథింగ్ డూయింగ్" అన్నాడాయన కూడా.

"ఇది చాలా అన్యాయం..." అని. తిలోత్తమ ఇంకా ఏదో అనబోతుంటే.

"ఐనో వాటీజ్ వాట్! న్యాయాన్యాయాల గురించి నువ్ నాకు చెబుతున్నావా? అయామ్ యువర్ బాస్. యాజ్ పార్ ఏజ్ స్వర్గలోక ఈజ్ కన్‌సర్న్డ్ ఐయామ్‌ది సుప్రీమ్ అథారిటీ హియర్. ఇక్కడ నేనేం చెబితే అదే రూలు. స్వర్గలోక వాసులెవరూ స్వర్గాన్ని దాటి బైటికెళ్ళకూడదని ఆర్డినెన్స్ పాస్ చేశాను. సో... మీ వాగుడు కట్టిపెట్టి మీ పన్లు చూస్కోండి" అంటూ కసిరేశాడు దేవేంద్రుడు.

అయినా వాళ్లు ముగ్గురూ భయపడలేదు.

"అయితే మేమీ నరకంలోంచి అలా బైటికెళ్ళి స్వచ్ఛమైన గాలి పీల్చుకునే అవకాశం కూడా లేదా? మరీ ఇంత నిరంకుశత్వమా?" అంది మేనక దూకుడుగా.

"మరే" అన్నట్టుగా చూశారు మిగతా ఇద్దరూ.

"ఇది నరకం కాదు స్వర్గం" దేవేంద్రుడు కటువుగా అన్నాడు.

"అని మీరనుకోగానే సరిపోయిందా? అలా బైటికెళ్లొచ్చే స్వేచ్ఛ కూడా లేనప్పుడు ఇది స్వర్గమెలా అవుతుంది. నరకం కాదంటే జైలు" అంది తిలోత్తమ ఆవేశంగా.

"మీరెలాగైనా అనుకోండి. కానీ ఒకసారి రూల్ అంటూ పాస్‌చేయబడ్డాక చిన్నా పెద్దా అందరూ దానికి కట్టుబడే ఉండాలి. అన్నెసెసరీ ఆర్గ్యుమెంట్స్‌తో నా టైమ్ వేస్ట్ చేయకండి. గెట్ లాస్ట్... ఐసే గెట్ లాస్ట్..." నెత్తిమీద కిరీటం కూడా ఎగిరెగిరిపడేలా ఆయనంత గట్టిగా అరిచేసరికి.

నోళ్లు మూసుకుని అక్కడినుంచి వచ్చేశారు ముగ్గురూ.

ఇహ పారిపోవడానికి మార్గమే లేదాయె! ఇప్పుడు చెయ్యగలిగిందేముంది?

అక్కనుంచి ఎడంగా వెళ్ళిపోయాక...

"అయితే ఇంకెప్పటికీ మనమీ స్వర్గకూపంలో మగ్గి చావాల్సిందేనా?" అంది మేనక బాధగా.

"చూద్దాంలే. శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలు. ముందు మన రంభ లుంగార్ని అక్కడ సెటిలవ్వనీండి. దాని పరిస్థితక్కడ బాగుంటే ఈలోగా మనమూ ఏదోక ఉపాయం ఆలోచించి ఎలాగోలా చెక్కేద్దాం" అంది తిలోత్తమ.

"అంతకుమించి ప్రస్తుతం ఇంకేమీ చేయలేమంటావా?" ఊర్వశి అడిగింది తిలోత్తమని.

"ఏం చేస్తాం? నిరాహారదీక్ష చేద్దామా అంటే మనవి ఆకలి దప్పులు లేని బతుకులాయె!?"

"అవును పాడు బతుకులు..."

"పోనీ సమ్మె చేస్తే? ఐ మీన్ ఇక నుంచి డాన్స్ చెయ్యం అని మొరాయిస్తే?" అంది మేనక.

"అప్పుడు మాత్రం ప్రయోజనం ఏముంది? ఆల్రెడీ రంభ ప్లేస్‌లో ఒక సబ్‌స్టిట్యూట్‌ని నియమించబోతున్నారట. మనంగానీ ఈ పరిస్థితుల్లో స్ట్రైక్‌చేస్తే మన బదులు కూడా ఇంకెవరెవర్నో నియమించేస్తారు. అప్పుడదేదో సామెత చెప్పినట్టు అవుతుంది మన పరిస్థితి. దేవనర్తకీ మణులన్న గౌరవాన్ని కూడా పోగొట్టుకుని సాధా

రణ స్వర్గవాసులుగా జీవించేకన్నా ప్రస్తుతానికిలా రాజీపడిపోవటమే మేలు…"

తిలోత్తమ మాటలు దూరదృష్టి గలవిగా, సబబైనవిగా అనిపించడంతో మిగతా ఇద్దరూ ఇంకేం మాట్లాడలేకపోయారు.

★ ★ ★

కాసేపటికి రంభ మళ్ళీ వచ్చి క్యారీ బాగ్‌ని తీసుకుని లోనికెళ్ళిపోయాక.

"ఉత్తపుణ్యానికి ఆవిడ్ని గురించి ఏంటేంటో శంకించేసావ్! ఇప్పటికైనా ఒప్పుకుంటావా ఆమె శంకించాల్సిన మనిషికాదని?" అన్నాడు ఫణీంద్ర ముఖాన్ని గంటుపెట్టుకుంటూ.

"సరేలేవో…" అనేశాడు ప్రభాకర్ పొడిగా.

ఏదో మిత్రుల్ని మభ్యపెట్టడానికి కొన్నదే తప్ప రంభకి ఆ బ్యాగుల పనేంటి?

మానవ కాంతలకున్న ట్రబుల్స్ ఏవీ స్వర్గలోక వాసులకుండవ్ కదా! ఆమె ఇంకా స్వర్గభ్రష్టత్వాన్ని పొందలేదు గదా! అంచేత ఆ ప్యాకెట్‌ని అటకమీద ఓ చోట పదిలపరిచి ఓ ఐదారు నిముషాల తర్వాత మళ్ళీ మిత్రద్వయమున్న గదిలోకి వచ్చింది.

★ ★ ★

అలవాటు లేని పదార్థాలాయె!

రంభ అన్నం తింటూ ముఖాన్ని అదోలా పెట్టడం చూసి గాభరాపడ్డారు మిత్రులిద్దరూ.

"మా వంట మీకు నచ్చలేదల్లే ఉంది. పోనీ ఏదన్నా హోటల్నుంచి పట్రానా?" అన్నాడు ఫణీంద్ర బాధగా.

"అహఁ… అహఁ… అక్కర్లేదు. మీ వంట బానే ఉంది…" రంభ అడ్డంగా తలాడిస్తూ అంది.

"మరైతే కోడి కెలికినట్టు అలా కెలుకుతున్నారేంటి?, ముఖాన్ని కూడా అదోలా పెట్టారేంటి?"

"అదా… అదీ.. అదీ… నాకు అన్నం తినటం అలవాటు లేదులెండి" అనేసింది రంభ పొరపాట్న.

"అన్నం అలవాటు లేదా? మరేం తింటారు?" ఆశ్చర్యంగా చూశాడు ఫణీంద్ర.

పైకేమీ మాట్లాడకపోయినా ప్రభాకర్ కూడా ఆశ్చర్యంగానే చూశాడామె దిక్కు.

'అమృతం మాత్రమే తాగుతాను' అని ఎలా చెప్పగలదు రంభ?

అందుకే… "నన్ను పెంచిన తల్లిదండ్రులు కడుపేదవారు కదా! అంచేత అక్కడ నేను జొన్న రొట్టెలు మాత్రమే తినేదాన్ని" అంటూ నోటికొచ్చిన ఓ అబద్ధమాడేసింది.

"కానీ మీరిపుడు కాబోయే హీరోయిన్. కాబట్టి ఆ పాడలవాటు మానేసి అన్నం తింటం అలవాటు చేస్కోండి" అన్నాడు ప్రభాకర్ కాస్త కోపంగా.

"అవునండీ" అన్నాడు ఫణీంద్ర శాంతంగా.

"సరే సరే" అనేసింది రంభ.

అంతకు మించి వాదన పెంచుకోవటానికి అదేవంత పెద్ద సంగతని?

భోజనాల కార్యక్రమం అయ్యాక.

రంభకి ఓ గదిలో పక్క అరేంజ్ చేసి, మరో గదిలో తామిద్దరూ పడుకున్నారు మిత్రులిద్దరూ.

ఒంటరిగా పడుకున్న రంభకి ఎంతకీ నిద్రపట్టలేదు.

ఆమె మనసులో తనకీ నారదుడికీ మధ్య జరిగిన సంభాషణ మెదిలింది.

సో… తన లీవ్ పిరియడ్ థర్టీడేస్ పూర్తయ్యేలోగా తాను ఫణీంద్రని లైన్‌లో పెట్టాలి.

ఎలాగోలా స్వర్గ భ్రష్టత్వం పొందాలి.

మరలాంటప్పుడు ఇలా టైంవేస్ట్ చేసుకుంటే ఎలా?

ప్రతి నిముషమూ ఇప్పుడు తనకు విలువైనదే.

ఆ ఆలోచన వచ్చిందే తడవుగా ఆమె తలుపు దగ్గరికొచ్చి "ఫణీంద్రగారూ…





# ఏరిన ముత్యాలు

★ కష్టాలను చాలామంది ఎదుర్కోగలరు. కానీ ద్వేషాన్ని ఎక్కువమంది తట్టుకోలేరు.
–పుల్లర్

★ నింద పడనివాడు లోకంలో ఎవడు లేడు.
–గౌతమబుద్ధుడు

★ అస్పృశ్యత కొనసాగితే హిందూమతం నశిస్తుంది. ఇండియాయే నశిస్తుంది.
–మహాత్మాగాంధీ

★ అన్ని కళలలో గొప్ప కళ అందమైన నడవడి.
–ఎమర్సన్

★ మనిషి దేహం జ్వాల. అది ప్రసరించే కాంతి అతని తెలివి.
–డి. హెచ్. లారెన్సు

★ ప్రజలలో లోపించింది బలం కాదు సంకల్పం.
–విక్టర్ హ్యూగో

★ ఈర్ష్య కళ్లు పచ్చగా ఉంటాయి.
–పి.బి. షెల్లి

★ మంచి సంకల్పాలు, మంచి ప్రవర్తనకు బీజాలు.
–విలియం టెంపుల్

★ దారిద్ర్యానికి ఎన్నో వేళ్లు. కానీ తల్లివేరే అవివేకం.
–లిండన్ జి.జాన్సన్

★ ఉద్గ్రంథాలకంటే ఉత్తేజకరమైనది 'నిశ్శబ్దం'.
–జె.బి.యస్. హాల్డేన్

★ సంతోషం కొనుక్కోలేవు. దానిని నీవు కష్టపడి గడించుకోవాలి.
–వారోల్డ్ జి.హాపెన్

★ ఆశ్చర్యంలోనుంచే తత్వశాస్త్రం పుడుతుంది.
–సోక్రటీస్

★ విద్య ఐశ్వర్యంలో ఆభరణం. ఆపదలో అండ.
–అరిస్టాటిల్

★ అసలైన స్నేహం మెల్లమెల్లగా పెరిగే చెట్టు వంటిది.
–జార్జివాషింగ్‌టన్

★ మనిషి సాధించే ఘనకార్యాల ప్రతిధ్వని 'కీర్తి'.
–థామస్‌పుల్లర్

సేకరణ: ఎ. రాంబాబు

ఫణీంద్రగారూ" అని పిల్చింది నెమ్మదిగా.

అప్పటికి మిత్రులిద్దర్లో ఏ ఒక్కరూ నిద్ర లోకి జారుకోలేదింకా.

"ఏంటండీ?" అని సంయుక్తంగా బదులు పలికేరిద్దరూ.

"నేను పిల్చింది ఇద్దర్నీ కాదండీ! ఫణీంద్ర గార్ని" అంది బిడియంగా రంభ.

ఆ మాటలకి ఆనందంతో ఉప్పొంగి పోతూ...

"చెప్పండి మేడమ్. చెప్పండి ఏంటి?" అంటూ దిగ్గున లేచి కూర్చున్నాడు ఫణీంద్ర.

"నాకు నిద్రపట్టట్లేదండీ..." అంది రంభ తలుపు కావలినుంచే.

"అలాగాండీ? ! అయితే నన్నేం చేయమం టారు? జోలపాట పాడమంటారా? !!" ఉత్సాహంగా అడిగాడు ఫణీంద్ర.

ఆ సమయంలో అతనికి తనది గార్ధభ స్వరం అన్న సంగతే గుర్తుకురాలేదు.

ఒక అందమైన అమ్మాయి నిద్రలేమితో బాధపడుతున్నప్పుడు అలాగని ఆమే స్వయంగా చెప్పినప్పుడు ఇర్రెస్పెక్టివ్ ఆఫ్ కంఠమాధుర్యం జోలపాట పాడాలని ఏ మగాడికి మాత్రం అనిపించదు!

అందుకే ఫణీంద్ర అడిగాడలా.

"జోలపాట అక్కర్లేదుగానీ కాసేపీగదిలో కొచ్చి కబుర్లు చెప్పండి చాలు..." బిడి యంగా అంది రంభ.

ఆమె అలా అంటుంటే ప్రభాకర్‌కి సహ జంగానే డౌటొచ్చేసింది.

'కేవలం కబుర్లు చెప్పడానికే అయితే కేవలం ఫణిగాణ్ణి మాత్రమే ఆహ్వానించడం ఏంటి?'

తానేం పాపం చేసుకున్నాడు?

సో... ఇందులో ఏదో తిరకాసుంది,

అలా అన్పించగానే అతను కూడా దిగ్గున లేచి కూర్చున్నాడు.

అది చూసి అంది రంభ. "మీరొద్దు లెండి. ఫణీంద్రగారొస్తే చాలు..."

"ఏం? కబుర్లు చెప్పడానికి నేను పనికి రానా? !" కించిత్ కోపంగా అన్నాడు ప్రభా కర్.

"అని కాదండీ! మీరు త్వరలో పెళ్లి చేస్కోబోతున్నవారు. మీ కాబోయే భార్య గురించి తియ్యటి కలలుకంటూ హ్యాపీగా నిద్రపోయే మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడం బావుండదు కదాని..." అంది రంభ తెలి విగా.

"అలాంటిదేం లేదులెండి. నేనామె గురించి కలలు గనటం ఇంకా స్టార్ట్ చెయ్య లేదు. అదీగాక వాడికన్నా నేనే బాగా కబుర్లు చెప్పగలను" అన్నాడు ప్రభాకర్ మొండిగా.

అతనలా అంటుంటే ఫణీంద్రకి సహజం గానే తిక్కరేగిపోయింది.

'ఒరి కుళ్లుబోతు వెధవా!' అని మనసులో కోపంగా అనుకుని.

'ఇలాటి వెధవని ఏం చేసినా పాపం లేదు' అని కూడా అనుకుని-

"నీ మొహానికి నీకేం కబుర్లొచ్చురా?" అన్నాడు కోపంగా.

"ఎందుకు రావు? పోలిటిక్స్ గురించి మాట్లాడగల్ను. సినిమాల గురించి మాట్లా డగల్ను. సమాజంలోని అవినీతి గురించి మాట్లాడగల్ను. సాహిత్యం గురించి మాట్లా డగల్ను. నానాటికీ కలుషితమైపోతున్న సాహిత్యం గురించి మాట్లాడగల్ను. అసలు నేను మాట్లాడలేని టాపిక్కేముంది గనక?" మిత్రుడు తీసిపారేసినట్టుగా మాట్లాడేసరికి తను కూడా కోపంగానే అన్నాడు ప్రభాకర్.

అంతలో రంభ అంది.

"నాకు మీరు చెప్పిన టాపిక్స్ నచ్చవ్ లెండి"

"మరేం నచ్చుతాయ్?"

ముసుగులో గుద్దులాట దేనికి లెమ్మని పించి "ప్రేమకబుర్లు" అనేసింది రంభ పుసుక్కున.

"అవి కూడా నేనే చెప్పగలను" అన్నాడు





ప్రభాకర్. అన్న మరుక్షణం "అబ్బా!" అని కూడా అన్నాడు.

అనడా మరి?

వీపుమీద పిడిగుద్దు పడితే ఎవరికి మాత్రం అబ్బ గుర్తుకురాకుండా ఉంటాడు?

"ఎందుకురా గుద్దేవ్?"

"లేకపోతే ఏంటి? నువ్ ఆల్రెడీ పెళ్లిచూపుల్లో ఒకమ్మాయిని చూసేసినవాడివి. పైగా ఆ చూసిన అమ్మాయిని నచ్చుకున్న వాడివి. అలాంటి నువ్వు పరకాంతలతో ప్రేమకబుర్లు ఎలా చెప్తావు?"

ఫణీంద్ర అలా అంటుంటే-

"హియర్ హియర్" అంటూ చప్పట్లు కొట్టింది రంభ.

ఆ మీదట ఆమే అంది.

"అవునండీ ప్రభాకర్‌గారూ! మీరు నాతో ప్రేమకబుర్లు చెప్పటం భావ్యం కాదు"

"వాడూ మీకు పరపురుషుడే కదా! వాడైతే చెప్పొచ్చా?" ఉక్రోషంగా అన్నాడు ప్రభాకర్.

ఇంక దాపరికం అనవసరం అనిపించి "కావచ్చుండీ? కానీ నేను వార్ని ప్రేమిస్తున్నానుకదా?" అనేసింది రంభ తన హృదయాన్ని బార్లా తెరిచేస్తూ.

దాంతో ఫణీంద్ర సహజంగానే ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బులైపోయాడు.

"రంభగారూ? మీరంటున్నది నిజమేనా?" అన్నాడు కంఠం ఆనందంతో వణికిపోతుండగా!

అవును మరి.

ఒక కాబోయే హీరోయిన్ అంత సడన్‌గా తనని ప్రేమించేయడం అంటే అదేవన్నా సామాన్యమైన విషయమా?

"నిజం ఫణీంద్రగారూ! మిమ్మల్ని చూసిన తొలిక్షణంలోనే నా మనసు మీ వశమైపోయింది. నేను మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను" డొంకతిరుగుడు లైన్‌లో వెళ్ళి లైనేయడంకన్నా ఇదే బెటరనిపించి ఓపెన్‌గా చెప్పేసింది రంభ.

మిత్రుడికి పట్టిన ఆకస్మిక అదృష్టానికి మనసులో కాస్త సంతోషం కలిగినా అంతలోనే ఈర్ష్య కూడా పుట్టుకొచ్చింది ప్రభాకర్‌కి.

"ఎలా ప్రేమిస్తారండీ? మీరు కాబోయే హీరోయిన్‌కదా! వీడేమో ఒక సామాన్యుడాయె! అదెలా కుదుర్తుంది? నింగికీ నేలకీ సాపత్యమా?" అన్నాడు ఆనందంతో రాయిలా బిగుసుకుపోయి వున్న మిత్రుడి నెత్తిమీద ఓ మొట్టికాయ వేస్తూ!

దానికి ఫణీంద్ర 'అబ్బా!' అనగా,

రంభ ఈ గదిలోకొచ్చేస్తూ, "ఛ ఊర్కోండీ! కాబోయే హీరోయిన్ నైనంత మాత్రాన్న గొప్పేంటీ?" అంది ఫణీంద్రవైపు ప్రేమగా చూస్తూ, తన ఘనతని తాను తగ్గించేస్కుంటూ.

"అర్థం లేకుండా మాట్లాడకండి. రేప్పొద్దున్న మీరు పెద్ద హీరోయిన్ అయ్యాక మీ ఇంటిముందు వాచ్‌మేన్‌గా ఉండటానిక్కూడా పనికిరాడు మావాడు. అలాంటిది, మీరు వీడ్ని ప్రేమించడం ఏంటి?" అన్నాడు. ప్రభాకర్ ఇంతకన్నా విడ్డూరం ఈ ప్రపంచంలో ఇంకెక్కడన్నా ఉంటుందా? అన్నట్టుగా చూస్తూ.

ఆ మాటలకి ఫణీంద్ర సహజంగానే కుపితుడవుతూ, "నోర్మూయ్యరా కుళ్లుబోతుకుంకా! పోన్లేకదాని ఆవిడ నన్ను ప్రేమిస్తుంటే మధ్యలో నువ్వెందుకలా ఇదైపోతావ్? మనిషన్నవాడికి ఇంత ఈర్ష్య పనికిరాదు" అన్నాడావేశంగా.

"ఏడిశావ్‌లే నోర్మూయ్. ఈర్ష్య మనుషులక్కాపోతే పశువులకుంటుందా? అయినా నేనిలా అంటోంది ఈర్ష్యతో ఏంకాదులే" అన్నాడు ప్రభాకర్.

"మరి?"

"ఆవిడమీద అభిమానంతో. నా అభిమాన నటి తప్పటడుగు వెయ్యబోతుంటే ఆమెను వారించటం ఓ అభిమానిగా నా బాధ్యత కాదా?" రంభవంక అభిమానంగా

చూస్తూ అన్నాడు ప్రభాకర్.

"నీ అభిమాన నటి ఈవిడెందుకయ్యింది? రంభకదా?" పళ్లు నూర్తూ అన్నాడు ఫణీంద్ర.

"అది నిన్నటిమాట. ప్రస్తుతం నా అభిమాననటి రంభకాదు. రంభశ్రీగారు"

"నేనింకా నటిని కాకముందే మీరప్పుడే నాఅభిమాని ఎలా అయ్యారు?" విస్మయంగా చూసింది రంభ.

"ఎందుకవ్వడండీ. కుళ్లుబోతు వెధవ? మీరు నన్ను ప్రేమిస్తున్నారన్న అక్కసుకొద్దీ అయ్యాడు" అన్నాడు ఫణీంద్ర కోపంగా.

తీరా అన్నాక తన మాటలు తనకే అసందర్భంగా అనిపించాయి అతనికి.

"అంటే?" అంది రంభ బుర్రగోక్కుంటూ.

"ఏముందండీ! ఇలా ఉత్తుత్తి అభిమానాన్ని ప్రదర్శిస్తే మీరు మనసు మార్చుకుని మీ పవిత్రమైన ప్రేమని నామీంచి వాడిమీదకు మళ్లిస్తారేమోనని వాడి ఆశ!" అన్నాడు ఫణీంద్ర.

"అలాగెలా ప్రేమిస్తాను? ఆయన ఆల్రెడీ పెళ్లిచూపుల్లో ఒకమ్మాయిని చూసి నచ్చుకున్నాడుగదా" అంది రంభ.

"కానీ ఆ జ్ఞానం వాడికుండాలిగదండీ!" అన్నాడు ఫణీంద్ర.

"ఏం ప్రభాకర్‌గారూ! మీ ఉద్దేశం అదేనా?" రంభ నేరుగా అలా అడిగేసరికి తత్తరపడ్డాడు ప్రభాకర్.

"అహఁ... అహహఁ..." అన్నాడు తడబడుతూ.

"మరి?" కళ్లెగరేస్తూ చూసింది రంభ.

ఏంచెప్పాలో తోచలేదు ప్రభాకర్‌కి.

"మాట్లాడరేం?" రెట్టించింది రంభ.

"ఏం మాట్లాడతాడండీ? కుళ్లుతో కుమిలిపోతున్నాడు వెధవ..." అన్నాడు కోపంగా ఫణీంద్ర.

అతని ముఖంలోని ఏహ్యతని గమనించాక అప్పుడు కలిగింది ప్రభాకర్‌లో పశ్చాత్తాపం.

ఏంటిది?

తామిద్దరూ స్నేహితులు.

అలాంటిది... వాడ్ని అదృష్టం వరించబోతుంటే తానిలా ఈర్ష్య చెందటం ఏంటి? ఇదేనా స్నేహమంటే? ఛ...

ఇంతకన్నా ఘోరం ఇంకేవన్నా ఉంటుందా?

నిండు మనసుతో వాళ్ల ప్రేమనాశీర్వదించాల్సిందిపోయి ఇలా చెడగొట్టాలని చూడ్డం... ఎంత హేయం? ఎంత ఇది? ఎంత అది?

అలా అన్పించాక అతను బిడియంగా తలదించుకుని తగ్గుస్వరంలో అన్నాడు.

"మీరిద్దరూ నన్ను మన్నించాలి. నేను కొంత ఈర్ష్యతో మాట్లాడిన మాట నిజమే! అందుకు నేనిప్పుడు నిజంగా పశ్చాత్తాపం చెందుతున్నాను. ప్రేమకు అంతస్తులు అవీ ఇవీ అడ్డురావు. గో అహెడ్..."

అతని కంఠంలో ధ్వనించింది కల్తీలేని పశ్చాత్తాపం అని తెలిసిరావడంతో...

"సర్లేరా టేకిటీజీ..." అనేశాడు ఫణీంద్ర తేలిగ్గా.

అదే భావాన్ని వ్యక్తం చేస్తూ, "పోన్లెండి ప్రభాకర్‌గారూ... తప్పు తెలుసుకున్నారుగా..." అంది రంభ.

ప్రభాకర్‌కి ఏం మాట్లాడాలో తోచక బిడియంగా తలాడించి ఊరుకున్నాడు.

"ఇట్సోకే... మరైతే ఇంక మమ్మల్నా గదిలోకి వెళ్లి ప్రేమించుకోమంటారా?" అంది రంభ.

"మీ ఇష్టం..."

ప్రభాకర్ ఇంకా అలా అంటూనే ఉన్నాడు. ఈలోగా ఫణీంద్ర దిండూ, చాపా అందుకుని పక్కగదిలోకి పరుగుతీశాడు.

రంభ పక్కపక్కనే తను కూడా పక్క పరుచుకుని ఒక్క నవ్వు నవ్వి దానిమీద చక్కగా కూర్చుని, "ఊఁ చెప్పండి..." అన్నాడు ఫణీంద్ర ఆమెకేసి ఆరాధనగా





చూస్తూ.

"ఏంటి చెప్పమంటారు? " తన పక్కమీద తాను ఒద్దికగా కూర్చుంటూ అడిగింది రంభ.

"ఇంత సడన్‌గా మీరు నన్నెందుకు ప్రేమించారు? " మెలికలు తిరిగిపోతూ అడిగాడు ఫణీంద్ర.

"అదేం ప్రశ్నండీ! ప్రేమ అనేది సడన్‌గానే పుడుతుందెప్పుడూ" అంది రంభ ప్రేమ గురించి తనకెంతో తెలిసినట్టు.

"నిజమేలెండి..." అన్నాడు ఫణీంద్ర ఆమెతో ఏకీభవిస్తూ.

అతనికిదంతా చాలా విచిత్రంగా అనిపించసాగింది.

అవును మరి.

ఇంత స్వల్ప వ్యవధిలో... ఒక అపరిచితురాలు ఇంత దగ్గరైపోవడం... ఎవరికి మాత్రం విచిత్రంగా అనిపించదు?

అసలిదంతా కలా నిజమా అన్న మీమాంసలో అతను కొట్టుమిట్టాడుతుండగా.

రంభ కూడా ఆలోచనలో పడింది.

ఏదో నోరుజారి ఇతన్ని ప్రేమిస్తున్నట్టుగా డిక్లేర్ చేసేసింది తను.

ఇట్సోకే...

కానీ ప్రేమించినంతమాత్రానికే స్వర్గభ్రష్టత్వం ప్రాప్తించదుగదా!

అలా జరగాలంటే... తను మానవసంపర్కం పొందాలి!

కానీ పెళ్ళికాకముందే సంపర్కమంటే ఇతని దృష్టిలో తానిప్పుడు చీపైపోతుంది గదా? అసలే ఇక్కడ తన ఎంట్రీ చాలా డౌట్‌ఫుల్ కండిషన్‌లో జరిగింది.

అలాంటిది తానిప్పుడు ఏమాత్రం అడ్వాన్స్ అయినా ఇతను తనని గురించి అదోలా అనుకునే ప్రమాదముంది.

అర్జంటుగా ఇతన్లో ఏకమైపోయి... దాన్ని 'గాంధర్వ వివాహం'గా తాను డిక్లేర్ చేయొచ్చు.

కానీ ఈ కాలం మనుషులకి గాంధర్వ వివాహాలమీద సదభిప్రాయం ఉండదు కదా?

సో... తను జాగ్రత్తగానే ఉండాలి.

అలా అనుకున్నాక, ఇప్పుడప్పుడే గాంధర్వ వివాహం వద్దన్న ఒక నిర్ణయానికి వచ్చేసి,

"ఏంటి ఫణీంద్రా మాట్లాడరు? ఏవన్నా స్వీట్ నథింగ్స్ చెప్పండి..." అంది రంభ గోముగా.

దాంతో తెల్లారేదాకా వాళ్ళిద్దరూ స్వీట్ నథింగ్స్ చెప్పుకుంటూ కూర్చున్నారు.

★ ★ ★

పక్కగదిలో వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటుంటే ఇక్కడ ప్రభాకర్ కూడా ఏదో ఆలోచనలో పడ్డాడు.

ఏదో ఏముందీ... డౌట్!

ఈ మహాతల్లి చెబుతున్నదంతా నిజమేనా? నిజంగా ఆమె కాబోయే హీరోయి నేనా? అన్న డౌట్!

ఇంత అర్జంట్‌గా మిత్రుడ్ని ప్రేమిస్తున్నదీ అంటే నిజంగా క్యారెక్టరున్న మనిషేనా? అన్న డౌట్.

తననితాను ఎంత కన్విన్స్ చేస్కోవాలని చూసినా అతనికెందుకో రంభ అనుమానాస్పదురాలిగానే అనిపించసాగింది.

రకరకాల ఆలోచనలు... రకరకాల సందేహాలు అతన్ని కూడా ఆ రాత్రంతా నిద్రపోనివ్వలేదు.

అదీగాక పక్కగదిలో వాళ్ళు కేవలం స్వీట్ నథింగ్స్ మాత్రమే చెప్పుకుంటున్నారని ఇతనికేం తెలీదుగదా! వాళ్ళేం చేసేసుకుంటున్నారో నన్న యాంగ్జైటీ ఒకటి!!

అలా మొత్తానికా రాత్రి... ఆ ముగ్గురికీ నిద్ర లేకుండానే గడిచింది.

తత్కారణంగా... మర్నాడు తెల్లారేక.

కాఫీ, టిఫిన్ల అనంతరం, ముగ్గురూ పగటి నిద్రలోకి జారారు.

"దభా దభా" మని ఎవరో తలుపుమీద



బాదుతున్న చప్పుడికి సడన్‌గా మెలుకువ వచ్చింది రంభకి.

అలా మెలుకువ రావడానికి ముందు ఆమె ఓ అందమైన కల గంటూ ఉంది.

అదేంటంటే...

తన తొలిసినిమా విజయవంతమైపోయి, దానితర్వాత ఒకదాని వెంబడి ఒకటి ఆఫర్లు వచ్చిపడిపోయి, అనతికాలంలోనే తానొక పెద్ద నటీమణి అయిపోయినట్టూ...

తన పోటీని తట్టుకోలేక రంభ ఇండస్ట్రీ నుంచి నిష్క్రమించేసినట్టూ...

దరిమిలా తనకి నేషనల్ లెవెల్లో కూడా గుర్తింపు వచ్చి జాతీయస్థాయిలో ఉత్తమన టిగా అవార్డు పొందినట్టూ...

అంత అందమైన కలొస్తున్నప్పుడు ఎవ రైనా చెడగొడితే కోపం రావడం సహజమే గదా!

అందుకే... 'ఛీ! ఎవడా వచ్చిన వెధవ?' అని కోపంగా అనుకుంది రంభ.

అలాగే...

ఫణీంద్ర కూడా అచ్చం అలాగే అనుకు న్నాడు.

అతనెందుకయ్యా అలా అనుకున్నా డంటే...

అతను కూడా ఆ చప్పుడు కాకముందు రంభలాగే ఓ అందమైన కలగంటూ ఉన్నాడు.

అదేంటంటే...

రంభశ్రీ బిజీ యాక్ట్రెస్ అయిపోయి నట్టూ...

ప్రముఖ నిర్మాతలెందరో ఆమె ఇంటి ముందు క్యూ గట్టినట్టూ...

కాబోయే భర్త హోదాలో ఆమె తాలూకు కాల్‌షీట్లూ అవీ తానే చూస్తున్నాడు గనక, ఆయా నిర్మాతలంతా ఆమెనొదిలి తన చుట్టూ మూగి "మేడమ్‌గారి కాల్షీట్లు మీరే ఎలాగైనా సరే ఇప్పించాలి సార్" అని తనని ప్రాధేయపడుతున్నట్టూ...

"అబ్బే వీల్లేదండీ! ఇంకో ఒన్ అండ్ ఆఫ్ ఇయర్‌దాకా ఆమెకసలు ఖాళీయేలేదు. ఎయిటీన్ మంత్స్ తర్వాత కావాలంటే చెప్పండి. ఎలాగోలా అడ్జస్ట్ చేస్తాను" అని తను వాళ్ళసందర్నీ కసిరిపారేస్తున్నట్టూ...

దానికి వాళ్ళంతా "సార్ సార్... ప్లీజ్ సార్" అని తనను గడ్డం పుచ్చుకుని బతి మాలుతున్నట్టూ అలాగన్నమాట.

అందుకే అతనిక్కూడా కోపమొచ్చి అలా అనుకున్నాడన్నమాట.

మరి వీళ్ళిద్దరూ అలా అనుకుంటే ప్రభా కర్ ఏమనుకున్నట్టు?

అతనేం అనుకోలేదు.

ఎందుకంటే ఆ సమయంలో అతను గాఢనిద్రలో ఉన్నాడు.

"ఎవరదీ?" అంటూ రంభ లేచి కూర్చోగా,

"మీరుండండి. నేనెళ్ళి చూసొస్తా"నంటూ ఫణీంద్రలేచి గుమ్మం దగ్గరికి వెళ్ళాడు.

ఆ వెళ్ళడంలో అతను ప్రభాకర్ చేతిని తొక్కివెళ్ళడంవల్ల 'కెవ్' మంటూ అతను కూడా లేచికూర్చున్నాడు.

ఫణీంద్ర తలుపు తెరవగానే "మేడమ్‌గారూ!" అంటూ ఓ ముప్పై అయి దేళ్ళ వ్యక్తి ఆ గదిలోకి ప్రవేశించాడు.

అతన్ని చూస్తూనే పోల్చేసుకుంది రంభ. అతను దర్శక వెంకన్నగారి కారుడ్రైవర్ అని.

"నువ్వా... సారీ మీరా?" అంది చెదిరిన దుస్తుల్నీ, జుట్టునీ సరిచేసుకుంటూ.

"అవును మేడమ్. అయ్యగారు మిమ్మల్ని అర్జంటుగా తీసుకు రమ్మన్నారు" అన్నాడ తను వినయంగా చేతులు కట్టుకుంటూ.

"ఏ అయ్యగారూ?" అతన్ని పోల్చుకోలేక పోయిన ఫణీంద్ర కుతూహలంగా అడి గాడు.

"దర్శక వెంకన్నగారు" అతను ఫణీంద్రకేసి ఎగాదిగా చూస్తూ చెప్పాడు.

ఆ చూపులో 'నువ్వెవడివిరా?' అన్న ప్రశ్న.

అది గమనించి అంది రంభ "ఆయన మా బావ"

"మరి ఇంకో ఆయన?" అప్రయత్నంగా అడిగేశాడు కారు డ్రైవర్.

"ఆయనా మా బావే" అంది రంభ సిగ్గుగా.

వెంటనే కారు డ్రైవరు జేబులోంచి ఓ పాకెట్ నోట్‌బుక్‌ని బయటకు తీసి అందులో ఏదో నోట్ చేసుకున్నాడు.

అతను చేసిందేంటో అర్థంకాక ముగ్గురూ అతనికేసి కుతూహలంగా చూశారు.

"ఏంటి ఏదో నోట్ చేసుకున్నారు?" కుతూహలం అణచుకోలేక ఫణీంద్ర పైకే అడిగేశాడు.

"ఇపుడు మేడమ్‌గారన్నమాటని" చెప్పాడు కారు డ్రైవర్.

"నేనన్నమాటనా? నేనేవన్నాను?" రంభ అయోమయంగా చూసింది.

"ఆయనా మా బావే అన్నారుగదా?"

"అంటే?" మరి కాస్త అయోమయంగా చూసింది రంభ.

"అది సినిమా టైటిల్‌కి బావుంటుందని పించి మళ్ళీ మర్చిపోతానేమోనని నోట్ చేస్కున్నాను" అంటూ చిన్నగా నవ్వాడు కారు డ్రైవర్.

'దర్శక వెంకన్న దగ్గర పనిచేసే కారు డ్రైవరుక్కూడా ఎంత తెలివో' అనుకుంది రంభ అబ్బురంగా.

అంతలో కారు డ్రైవరన్నాడు, "టైం లేదు. అయ్యగారు మిమ్మల్ని తొందరగా తీసుకు రమ్మన్నారు. తమరు అర్జంటుగా బయల్దేరాలమ్మా"

"సరే... అయిదు నిమిషాల్లో తయారై వచ్చేస్తా. ఈలోగా మీ... నువ్వలా కూర్చో..." అంటూ కుర్చీ చూపించి పక్క గదిలోకి వెళ్ళిపోయింది రంభ.

"ఎల్లోకలర్ మీద బ్లూ పూలున్న చీర కట్టుకోండి" అంటూ ఆమెకు విన్పించేలా ఓ కేకవేసి...

"ఏం తీస్కుంటావ్ బాబూ? కాఫీనా, టీనా?" అని డ్రైవర్‌నడిగాడు ఫణీంద్ర.

"అబ్బే ఏం వద్దండీ" అన్నాడతను మొహమాటంగా.

"పర్లేదు. ఏదో ఒకటి తీస్కో. పోనీ కూల్‌డ్రింక్ తెప్పించనా?" అన్నాడు ఫణీంద్ర.

తానిపుడు హీరోయిన్ రంభశ్రీగారి పర్సనల్ అసిస్టెంట్ కదా? ఆమెకోసం వచ్చిన వార్ని గౌరవించడం తన విధికదా? అని అతని ఉద్దేశ్యం.

"అహ... ఏమీవద్దు" అంటూ మళ్ళీ అడ్డంగా తలాడించాడు కారు డ్రైవరు.

దాంతో "పోనీ మంచినీళ్ళయినా తీస్కోండి" అంటూ లేచి కూజా దగ్గరికెళ్ళి ఓ గ్లాస్‌లో నీళ్ళు తీస్కొచ్చి అతనికందించాడు ఫణీంద్ర.

ప్రభాకర్ మాత్రం కనీసం పక్కమీంచి లేచే ప్రయత్నమైనా చెయ్యకుండా అలాగే చూస్తూ కూర్చున్నాడు.

రంభ ప్రేమిస్తున్నది తననికాదుగదా?

సో... వాళ్ళ తిప్పలేవో వాళ్ళేపడతారు అన్నది అతగాడి ఉద్దేశ్యం.

నిజం కూడా అంతేగా మరి?

అన్నట్టుగానే ఓ అయిదు నిముషాల్లో నీట్‌గా ముస్తాబైవచ్చింది రంభ.

"డ్రైవర్! మనమింక బయల్దేరుదామా?" అంది వస్తూనే కాబోయే హీరోయిన్ హోదాలో.

"ఎస్ మేడమ్..." అంటూ మంచినీళ్ళ గ్లాసుని టీపాయ్‌మీద పెట్టి లేచి నిలబడ్డాడు డ్రైవరు.

"అదేంటీ... నేను రాకుండా మీరొక్కరే వెళ్తారా?" కొంచెం ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తూ అన్నాడు ఫణీంద్ర.

రంభ తన ప్రేయసి.

ప్రస్తుతం తనామెకు పియ్యేలాంటివాడు. భవిష్యత్తులో కాబోయే మొగుడు.

మరలాంటప్పుడు తను పక్కన లేకుండా

ఆమె ఒక్కర్తే వెళ్ళడం ఏంటి? అన్నది అతని ఉద్దేశ్యం.

అతని ఊహలలా ఉన్నాయని రంభకేం తెలుసు.

అందుకే "మీరెందుకులెండి. నేనెళ్ళి మాట్లాడి వస్తాగా? " అనేసింది సింపుల్‌గా.

"అహ... అదికాదు రంభా... నీకు సినిమా ఇండస్ట్రీ కొత్తగదా? నేను పక్కనుంటే తోడున్నానన్న ధైర్యం ఉంటుంది గదా? అదీగాక ఇకనుంచి నీకు పియ్యేగా ఉండాల్సినవాడ్ని కూడా నేనేగదా? " అంటూ తన మనసులోని ఉద్దేశ్యాన్ని బయటపెట్టాడు ఫణీంద్ర.

దాంతో నిజమే సుమా అనుకుని, "అయితే మీరు కూడా తయారవ్వండి త్వరగా" అంది రంభ.

"ఏ కలర్ ప్యాంట్ వేస్కోను? ఏ కలర్ చొక్కా వేస్కోను? " ఉత్సాహంగా అడిగాడు ఫణీంద్ర రంభని.

"మీకెలాంటి డ్రస్సులున్నాయో నాకేం తెల్సు? ఉన్నవాటిల్లో మీకు నచ్చిందేదో వేస్కోండి" అంది రంభ.

అంతలో డ్రైవర్ చిరాగ్గా అన్నాడు, "ఏదో ఒకటి వేస్కోండిసార్. అవతల హీరోయిన్‌గా నటించబోతున్నది మేడమ్‌గారు. అంతేతప్ప మీరేం హీరోగా నటించబోవట్లేదుకదా? "

తనని తీసిపారేసినట్టు అతనలా అంటుంటే చాలా బాధగా అనిపించింది ఫణీంద్రకి.

అయినా తమాయించుకున్నాడెలాగో.

'మీ హీరోయిన్‌కి నేను కాబోయే మొగుడునన్న సంగతి నీకు తెలీదుగదా? అందుకే నువ్విలా వాగుతున్నావ్' అని మనసులో కోపంగా అనుకుని పైకిమాత్రం ఓ వెర్రినవ్వు నవ్వేసి పక్క గదిలోకి వెళ్ళిపోయాడు డ్రస్ ఛేంజ్ చేసుకుని రావడానికి.



గ్రీన్‌పార్క్‌లో ఓ కుర్చీలో కూర్చునివుంది రంభ. మేకప్‌మేన్ మేకప్‌కిట్ తెరిచి ఏదో లిక్విడ్‌లో కాటన్ ముంచి ఆమె ముఖాన్ని శుభ్రంగా తుడుస్తూ చెప్పాడు, "తొలిసారిగా నాచేత మేకప్ వేయించుకున్నవాళ్ళంతా ఇవాళ అగ్రతారలై వెలుగుతున్నారు"

"హీరోయిన్ రంభకి మొదటగా నువ్వేనా మేకప్ చేసింది?" కుతూహలంగా అడిగింది రంభ.

ఏంటా పిచ్చిప్రశ్న అన్నట్టు నవ్వాడతను. "నేనుకాక ఇంకెవరు? " అన్నాడు.

"అయితే నేను ఖచ్చితంగా సెలెక్ట్ అవుతానా? " అడిగిందామె ఆశగా.

రంభ ముఖాన్ని క్లీన్‌చేశాక, ఫౌండేషన్ క్రీమ్ రాస్తున్న నెపంతో ఆమె చెంపల్ని గట్టిగా నిమురుతూ "నా మేకప్‌కి తిరుగే లేదు. స్క్రీన్‌టెస్ట్‌లో మీరు ఫెయిలవడం అంటూ జరగదు" అన్నాడు.

రంభ గర్వంగా నవ్వుకుంది.

ఆమె అలా నవ్వుకోవడం చూసి అతనన్నాడు, "అయితే ఒకటి... టెస్ట్‌కొచ్చిన అమ్మాయిల్లో నాకెవరైనా నచ్చలేదనుకోండి... మేకప్ సరిగా చెయ్యను. దాంతో వాళ్ళు స్క్రీన్‌టెస్ట్‌లో ఘోరంగా ఫెయిలై...

ఇంటికెళ్లిపోకతప్పదు"

రంభ కిసుక్కున నవ్వింది అతని అమాయకత్వానికి. 'స్వతఃసిద్ధమైన నాలాంటి అందగత్తెల్ని వీడేం చెయ్యగలడు. వీడి మేకప్పేం చెయ్యగలదు' అనుకుంటూ అతనితో అల్లరిగా అంది, "అమ్మాయి సహజంగా అందమైనదైతే నువ్వేం చెయ్యగలవ్?"

అతనీసారి రంభ అమాయకత్వం చూసి నవ్వాడు.

"ఎంతటి అందగత్తెనైనా అందవికారంగా, అందంలేనివాళ్ళని కూడా మహా అందగత్తెలుగా ప్రెజెంట్ చేసే టెక్నిక్కే మేకప్ అంటే. అందులో నేను నిష్ణాతుడ్ని"

రంభ భయపడిపోయింది. 'ఛ... మానవులు నయవంచకులు... అందుకే నరకంలో యమా అంకుల్ వీళ్ళనట్లా కల్తీనూనెలో అప్పడాల్లా వేయించేది' అనుకుని మేకప్‌మేన్‌కేసి సందేహంగా చూస్తూ, "ఇంతకీ నన్నెట్లా ప్రెజెంట్ చెయ్యబోతున్నావ్?" అనడిగింది.

"సినిమాస్టార్ రంభలా ప్రెజెంట్ చేస్తాను. ఎందుకంటే నువ్వు నాకు నచ్చావ్" అన్నాడు ఆమె పెదాలమీద వేళ్ళతో సున్నితంగా రాస్తూ.

తను అతనికి నచ్చటం రంభకి ఆనందాన్నిచ్చింది గానీ... తనని రంభలా ప్రెజెంట్ చేస్తాననటం ఆమెకు నచ్చలేదు. 'వీడుకూడా అందానికి కొలమానం సినిమా రంభే అన్నట్టు మాట్లాడుతున్నాడు. దగుల్బాజీ వెధవ' అనుకుంటూ "నన్ను భూలోకరంభలా కాదు దేవలోకరంభలా ప్రెజెంట్ చెయ్యి" అంది.

అతను పడీపడీ నవ్వుతూ, "మీ లేలేత యవ్వనాల సినిమా హీరోయిన్ల ముందు ఆ తాతలకాలంనాటి రంభాఊర్వశులేం పనికొస్తారండీ బాబూ!" అన్నాడు నవ్వు నెట్లాగో ఆపుకుంటూ.

రంభ ఉడుక్కుంటూ "వాళ్లని చూసినట్లే మాట్లాడుతున్నావే" అంది.

"చూడక్కర్లేదు, ఊహించగలను" అన్నాడు.

ఈ మొండి బండవాడితో తనకెందుకులే అని "ఎవరో ఒకరిలాచెయ్యి. ఎలాగయినా నేను చాలా అందంగా కన్పించాలి. ఖచ్చితంగా హీరోయిన్ కావాలి" అంది.

"ఖచ్చితంగా అవుతావ్. చెప్పాగా నువ్ నాకు నచ్చావని?"

అట్లా అంటూనే అతను రంభ చేతిని పట్టుకుని ఆమెవేళ్ళని తన పెదవులకానించుకున్నాడు.

రంభకు వాడి వరస అర్థమైంది. ఇప్పుడు కానీ తను విదిలించి కొడితే తనని అందవికారంగా ప్రెజెంట్ చేస్తాడని కూడా అర్థమైంది.

"భూలోకంలో ప్రతీ ఫీల్డ్‌లో అవినీతి విస్తరించిపోయింది. నరకానికొచ్చే వాళ్ళెక్కువైపోయారు. నరకలోకాన్ని ఎక్స్‌టెండ్ చేయకతప్పదని మన యముడు ఓ లక్ష ఎకరాల స్థలంకోసం విష్ణువుకి అప్లికేషన్ పెట్టుకున్నారీమధ్యే" అని నారదుడోసారి చెప్పడం గుర్తుకొచ్చిందామెకు.

'ఏదేమైనా అవసరం తనది. వీడ్ని జాగ్రత్తగా టేకిల్ చెయ్యాలి' అనుకుంటూ అతన్ని చూసి సిగ్గుగా నవ్వి, "నువ్ కూడా నాకు నచ్చేశావ్" అంది.

అతనదోలా చూశాడామెవంక.

చటుక్కున రిమ్మ తెగులు తగిలిన బ్రహ్మ గుర్తొచ్చాడామెకు.

'మానవుల్లోనే ఏంలే... దేవతల్లో కూడా ఆడదాన్ని చూస్తే వచ్చే జబ్బేగా ఇది' అనుకుంది.

"ఎప్పుడు కలుస్తావు మళ్ళీ" అడిగాడు.

"స్క్రీన్‌టెస్ట్‌లో సెలెక్ట్ అయితేచాలు నువ్వెప్పుడు రమ్మంటే అప్పుడొస్తాను" చెప్పింది అతనికేసి మత్తుగా చూస్తూ.

"హేండివ్వవుగా" అన్నాడతను అనుమానంగా.



"ఉహూ..." అంది.

"హీరోయినయ్యాకైనా... పర్సనల్ మేకప్ మేన్‌గా ఎవర్నయినా పెట్టుకునే స్తోమత నీకొచ్చేంతవరకూ నీకు మేకప్ చేసేది మా కంపెనీవాళ్ళే. సో... హేండిస్తే నీ మొదటి సినిమా ఘోరంగా ఫ్లాప్ అయ్యేలా నీకు మేకప్‌చేస్తా"

"ఛ... ఎందుకట్లా అంటావ్. అట్లాంటిదేం జరగదు" చెప్పింది రంభ. అతని తలమీద ముద్దుగా రాస్తూ.

అప్పుడే "డైరక్టర్ సార్ రమ్మంటున్నారు" అంటూ వచ్చాడు ఓ బోయ్.

"జస్ట్ ఫైవ్ మినిట్స్" చెప్పాడు మేకప్ మేన్ రంభకు ఆర్టిఫిషియల్ ఐ లేషెస్ అమరుస్తూ.

మేకప్ అంతా పూర్తయ్యాక రంభ నిలువుటద్దంలో చూసుకుంది.

తన అందానికి తనే ఆశ్చర్యపోయింది. దేవలోకంలో వుండగా నాట్యానికి ముందు ముస్తాబై ఇట్లాగే అద్దంలో చూసుకునేది. కానీ ఇప్పుడున్నంత అందంగా అప్పుడు లేనే లేదు.

ఇదంతా మేకప్ మహాత్యమే అనుకుంది.

'ఈ మేకప్ మేన్ చచ్చాక ఒకవేళ నరకానికి పోయినా యమా అంకుల్ని స్పెషల్‌గా రిక్వెస్ట్ చేసైనా వీడ్ని స్వర్గానికి లాక్కెళ్ళి తన పర్సనల్ మేకప్‌మేన్‌గా పెట్టుకోవాలి' అనుకుంది.

మళ్ళీ వెంటనే... 'తనేమిటిలా భూలోకంలో హీరోయిన్‌గా సెటిలవ్వాలనుకుంటూనే స్వర్గలోకం మీద మరులుగొంటోంది. నాన్సెన్స్ తనిక ఈ భూలోకాన్ని వదిలే ప్రసక్తేలేదు' అనుకుంది.

ముందు స్టిల్‌ఫొటోగ్రాఫర్ రంభని రకరకాల యాంగిల్స్‌లో స్టిల్స్ తీశాడు.

తర్వాత దర్శక వెంకన్న ఓ డైలాగ్‌ని రంభకిచ్చి చెప్పాడు. "నువ్వొక ప్రేమికురాలివనుకోమ్మా. ప్రేమించిన ప్రియుడితో ప్రేమ గొప్పదనాన్ని గురించి చెబుతున్నావ్. అదీ సిట్యుయేషన్. అండర్‌స్టాండ్. స్క్రిప్ట్ చదువుకుని డైలాగ్‌చెప్పు"

రంభ క్షణాల్లో ప్రిపేరైపోయింది.

"ఇక చెప్తానండీ" అంది రంభ డైలాగ్ కంఠతా రావడంతో.

"స్టార్ట్" అన్నాడు వెంకన్న.

రంభ గొంతు సవరించుకుంది. కాస్తదూరంలో వున్న ఫణీంద్రకేసి చూసింది. రంభ ఎలా చేస్తుందో అన్న ఆత్రుతతో అతనామెకేసి తదేకంగా చూస్తున్నాడు.

రంభ... తన ప్రేమికుడ్ని అతనిలో చూసుకుంది. వెంటనే ఆమె ముఖకవళికల్లో మార్పొచ్చింది.

ఫణీంద్రకేసి మరింత ప్రేమగా చూసింది. "ప్రేమంటే ఏమనుకున్నావ్? ప్రేయసి ప్రియుడ్నీ, ప్రియుడు ప్రేయసినీ, భర్త భార్యనీ, భార్య భర్తనీ, తల్లి బిడ్డనీ, బిడ్డ తల్లినీ, అక్క చెల్లినీ, చెల్లి అక్కనీ, అన్న తమ్ముడ్నీ, తమ్ముడు అన్ననీ మనసారా అభిమానించేలా చేసే భావనే ప్రేమ. ప్రేమకు పుట్టుకలేదు. చావులేదు. అది అనంతంలా సాగిపోతూనే వుంటుంది. ప్రేమ ఆగదు. ఆగితే ఈ లోకం సాగదు"

వెంకన్నతోసహా అందరూ రంభకి బిగ్ హేండ్ ఇచ్చారు.

వెంటనే రంభకు ఆ రోజు వెంకన్న సినిమారంభ ఇంటికొచ్చినప్పుడు ఆమె అతని కాళ్లకు వంగి దండం పెట్టడం గుర్తొచ్చి తనూ అట్లాగేచేసింది.

"డెఫినెట్లీ నువ్ పైకొస్తావమ్మాయ్" అన్నాడు వెంకన్న.

"థాంక్యూ సర్" అంది రంభ.

"సర్... నేను సెలెక్ట్ అయినట్టేగా?" అంది సందేహంగా చూస్తూ.

"మా హీరోయిన్ నువ్వే" అన్నాడు వెంకన్న నవ్వుతూ.

రంభా, ఫణీంద్రా ఒకరిముఖాలొకరు చూసుకున్నారు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయిపోతూ.





రంభా, ఫణీంద్రా ప్రొడక్షన్ కార్లో బయ ల్దేరబోతుంటే మేకప్‌మేన్ దగ్గరగావచ్చి చేతులు నలుపుకుంటూ ఆమెకేసి చూసి ఏదో గొణిగాడు ఆమెకు మాత్రమే వినబ డేలా.

రంభకి ఒళ్ళు మండిపోయింది. వెంకన్న తననే హీరోయిన్‌గా డిక్లేర్ చేసేశాక ఇక వాడికి భయపడాల్సిన అవసరం ఆమెకేం కనబడలేదు. అందుకే "ఏరు దాటాను. నీ తెప్పమాత్రం తగలెయ్యను. దాన్ని పట్టుకెళ్ళి ఇంకెవర్నయినా అందులో ఎక్కించుకో" అని అంది.

రంభని ఇంటిదగ్గర దింపాక డ్రైవర్ గుర్తుచేశాడు, "మేడమ్ మీరు పైకొచ్చాక నాతో సినిమా మర్చిపోరుగా"

"ఊహూ... మర్చిపోను" చెప్పింది రంభ హేపీగా నవ్వుతూ.

★ ★ ★

"ఏమైందిరా?"

ఓ నాలుగ్గంటల తర్వాత బైటికెళ్ళిన రంభ, ఫణీంద్రలు తిరిగి రాగానే ప్రభాకర్ కుతూహలంగా అడిగాడు మిత్రుడ్ని.

"గ్రాండ్ సక్సెస్" అంటూ నవ్వాడు ఫణీంద్ర.

"అంటే రంభగారు హీరోయిన్ అయిపో యినట్టేనా? అగ్రిమెంట్ మీద సైన్ చేసే శారా?" ఇద్దరికేసీ మార్చిమార్చి చూస్తూ అడిగాడు ప్రభాకర్.

"అంతేకాదు లక్ష రూపాయలు అడ్వాన్స్ కూడా ఇచ్చారు. రేపే రంభశ్రీ పేరుతో మన బ్యాంక్‌లోనే మన బ్రాంచ్‌లోనే ఓ అకౌంట్ కూడా ఓపెన్ చెయ్యాలి" అంటూ జేబులోంచి ఓ చెక్కుని బైటికి తీసి మిత్రు డికందించాడు ఫణీంద్ర.

దాన్నోమారు అటూఇటూ తిప్పిచూసి 'ఎక్సలెంట్' అనుకున్నాడు ప్రభాకర్.

'సో... ఈవిడకు కొన్నచీరల బాపతు సొమ్ము వెనక్కి తీసేస్కోవచ్చన్నమాట' అని కూడా అనుకున్నాడు.

"ఇవ్వాళ బ్యాంకుకి శలవుకదా. రేపు మనం డ్యూటీకెళ్ళినప్పుడు అలాగే అకౌంట్ ఓపెన్ చేద్దాంలే" అన్నాడు పైకి.

ఆ మాటలకి ఏదో పెద్ద జోక్ విన్నవా డిలా విరగబడి నవ్వాడు ఫణీంద్ర.

అతన్తోపాటు రంభ కూడా ముసిముసిగా నవ్వింది.

వాళ్ళ నవ్వుకి కారణమేమిటో అర్థంకాని ప్రభాకర్ ఆశ్చర్యంగా చూశాడు వాళ్ళదిక్కు.

కొద్దిక్షణాల తర్వాత అడిగాడు "ఎందు కలా నవ్వుతున్నారు?"

"లేకపోతే ఏంట్రా? రేపు మనం డ్యూటీ కెళ్ళాక అంటున్నావేంటి? రేపట్నుంచి నేనెందుకొస్తాను డ్యూటీకి?" మిత్రుడికేసి గర్వంగా చూస్తూ అన్నాడు ఫణీంద్ర.

అతనంటున్నదేంటో నిజంగానే అర్థంకా లేదు ప్రభాకర్‌కి.

అందుకే అయోమయంగా బుర్ర గీరు కుంటూ "అంటే?" అంటూ కళ్ళెగరేశాడు.

"నేనెవర్ని?"

"ఫణీంద్రవి..."

"పేరుకాదు నేనడుగుతుంట. ప్రస్తుతం నా హోదా?"

"అదేం ప్రశ్న? నువ్వూ నాతో పాటే బ్యాంక్‌లోనేగదా పని జేస్తుంట?" ఆశ్చ ర్యంగా కళ్ళెగరేశాడు ప్రభాకర్.

"నిన్నటిదాకా నేను నీలాగే ఓ బ్యాంక్ ఎంప్లాయినే కావచ్చు కానీ నేనిపుడు హీరో యిన్ రంభశ్రీగారి ఉడ్‌బీని. అలాంటిది ఇంకా ఎందుకు బ్యాంక్‌లో పనిచేస్తాను?" అంటూ గర్వంగా నవ్వాడు ఫణీంద్ర.

అతనంత స్పష్టంగా చెప్పాకగానీ విషయం అర్థంకాలేదు ప్రభాకర్‌కి.

'వార్నీ?' అనుకున్నాడు మనసులో.

"అయితే నువ్ జాబ్ రిజైన్ చేసేస్తు న్నావా?" అనడిగాడు పైకి.

"మరంతేగదండీ?" అంటూ రంభ తల దూర్చింది.

"ఆయనింకా బ్యాంక్‌లో పనిచేస్తూ ఉంటే

నా డేట్లూ అవీ ఎవరు చూస్తారు? ”

ఆమె ముసిముసి నవ్వులు నవ్వుతూ అలా అంటుంటే 'అబ్బ! ఫణిగాడికి ఎంత అదృష్టం పట్టింది? ' అని అనుకోకుండా ఉండలేకపోయాడు ప్రభాకర్.

అంటే అతన్ది ఈర్ష్యతో రగిలిపోయే హృదయం అని కాదుగానీ మొత్తానికైతే అతనికి మాత్రం అలాగే అనిపించింది.

హీరోయిన్ భర్త అంటే మాటలా? !

కోటిమందిలో ఏ ఒక్కరికో పడుతుంది అలాంటి అదృష్టం!

అందుకే... అతనికి తెలియకుండానే అతనిలో అలాంటి ఈర్ష్య ప్రవేశించింది.

అయినప్పటికీ విజ్ఞతతో ఎలాగో అణచుకున్నాడు దాన్ని.

“ఇంతకీ మీరేక్ట్ చేస్తున్న సినిమా పేరేంటి? ” అనడిగాడు రంభని.

“పేరు” అని రంభ ఇంకా ఏదో చెప్పబోతుండగా,

“మీరుండండి మేడమ్... పిఏని నేనున్నాగా! నే చెబుతాలెండి ఆ వెధవ ప్రశ్నలకి జవాబులు” అంటూ ఆమెకు మధ్యలో అడ్డు తగిలాడు ఫణీంద్ర.

దాన్ని అహంకారం అనుకోవాలో లేక పిఏగా అతని బాధ్యతని అతను సక్రమంగా నిర్వర్తించడం అనుకోవాలో అర్థంకాలేదు ప్రభాకర్‌కి.

'అప్పుడే ఎంత టెక్కొచ్చిందిరా నీకు? ' అని మనసులో అనుకుని,

“సరే నువ్వే చెప్పేడువ్... రంభశ్రీగారు నటిస్తున్న చిత్రం పేరేంటి? ” అనడిగాడు పైకి.

“పేరు ఇంకా డిసైడ్ చెయ్యలేదు” కాలర్ గుండీని సరిచేసుకుంటూ చెప్పాడు ఫణీంద్ర.

“ఎప్పుడు డిసైడ్ చేస్తారట? ”

“ఏమో తెలీదు. డైరెక్టర్‌గార్ని నేను వివరాలడగలేదు”



“షూటింగ్ ఎప్పుడు? ”

“అదీ ఇంకా డిసైడ్ చెయ్యలేదు. డేట్ డిసైడ్ అయ్యాక మళ్ళీ కబురు చేస్తామన్నారు డైరెక్టర్‌గారు”

మిత్రుడడిగిన ప్రశ్నలకి పియ్యే హోదాలో బహు గర్వంగా జవాబులిచ్చాడు ఫణీంద్ర.

“అయితే షూటింగ్ ప్రారంభమయ్యేదాకా రంభశ్రీగారు మన రూంలోనే ఉంటారన్నమాట!' ఆనందంగా అడిగాడు ప్రభాకర్. ఎంతైనా ఒక హీరోయిన్‌తో పాటు సహజీవనం చేయడం అంటే మాటలుకాదుగదా? అందుకే అతనికి తెలియకుండానే అతన్లో అలాంటి ఆనందం చోటు చేసుకుంది.

కానీ ఆ ఆనందాన్ని అట్టేసేపు మిగలనివ్వలేదు ఫణీంద్ర.

“ఛ...ఛ... రంభశ్రీగారు ఇకనుంచి ఈ రూంలో ఎందుకుంటారు? ఒక హీరోయిన్ ఉండాల్సిన రూమా ఇది? ఒక ఏసీలేదు. పాడూలేదు. ఇలాంటి రూమ్‌లో ఉంటే ఆవిడ పరువేంకావాలి? ఇంకా ఒకట్రెండ్రోజులు ఇక్కడుంటాం అంతే. ఆ తర్వాత మంచి ఇల్లేదైనా చూస్కొని మారిపోతాం”

ఫణీంద్ర మాటలు ప్రభాకర్‌లోని ఆనందాన్ని హరింపచేయడమేకాదు, అతన్ని అపరిమితంగా బాధపడేలా చేశాయి.

'అదృష్టం అందలం ఎక్కించగానే వీడికెంత పొగరు పట్టేసిందీ? ' అనుకున్నాడు బాధగా.

'ఇన్నాళ్ళూ నా రూమ్మేట్‌గా ఉండి, ఇపుడు వేరైపోతానంటున్నాడు అంటే... ఛీ! ఎంత కృతఘ్నుడు? ' అనుకున్నాడు ఆవేదనగా.

ముఖకవళికల్ని బట్టి అతని ఆంతర్యాన్ని గ్రహించగలిగిన రంభ, ఫణీంద్ర మాటలు తనకూడా అంతగా రుచించకపోవడాన “అంటే మేం మాత్రమే షిఫ్ట్ అవుతామని కాదండీ. మనమందరం షిఫ్ట్ అవుతామని అర్థం” అంది నవ్వేస్తూ. ఒకపక్క నవ్వుతూనే ఆమె ఫణీంద్రకేసి కాస్త కోపంగానూ చూసింది.

కానీ ఫణీంద్ర దాన్ని గుర్తించలేదు.

"మన మధ్య పానకంలో పుడకలా వీడెం దుకూ." అనేశాడు పుసుక్కున.

సహజంగానే ఆ మాటలు ప్రభాకర్‌కి శరాఘాతంలా తగిలాయి.

"అంటే అప్పుడే నేను నీకంత చీప్పైపో యానా?" అన్నాడు బాధగా.

అలా అంటుంటే అతని కంఠం అతని ప్రమేయం లేకుండానే వణికింది.

అది గమనించిన ఫణీంద్రకి తన తప్పేంటో తెలిసొచ్చింది.

"సారీరా... నా ఉద్దేశం అదికాదు" అన్నాడు రియలైజ్ అవుతూ.

"అది కాకపోవడం ఏంట్లే..." ప్రభాకర్ ఇంకా ఆవేదనగానే అన్నాడు. "మీరు ఉండ మన్నా మీ పంచలో నేనేం ఉండన్లే"

అనుకోకుండా సంభాషణ వక్రమార్గం పట్టిందని గ్రహించిన ఫణీంద్ర ఈసారి మరింత నొచ్చుకోలుగానూ, అపాలజిటిక్ గానూ అన్నాడు. "అయామ్ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీరా! ప్రేమికులమధ్య మూడోవ్యక్తి ఉండడం అంత బావుండదన్న ఉద్దేశంతో అన్నానే తప్ప నిన్ను దూరం చేసుకుందామ నికాదు. నిన్ను బాధపెట్టుంటే నన్ను మన్నించు" అతని కంఠంలో సిన్సియారిటీ ధ్వనించింది.

దాంతో ప్రభాకర్ ఒకింత నెమ్మదిం చాడు.

"సర్లే... సర్లే..." అనేశాడు నవ్వడానికి ప్రయత్నిస్తూ.

కానీ అతని ప్రయత్నం వీగిపోయింది.

అతని పెదవులమీద కనీసం చిరుదర హాసం కూడా విచ్చుకోలేదు. అవునుమరి. అలాంటి సందర్భంలో ఎవరుమాత్రం నవ్వ గలుగుతారు?

వాతావరణంలో అనుకోకుండా తలెత్తిన ఈ అనీజీనెస్ రంభకి ఏమాత్రం నచ్చలేదు.

దీన్ని తేలికపర్చటం ఎలా?

ఒకట్రెండు క్షణాలు ఆలోచించి... "మనం సరదాగా ఎటైనా వెళ్లొద్దాం పదండి" అంటూ లేచిందామె.

"ఎటైనా అంటే?" అన్నాడు ప్రభాకర్.

"మీ ఇష్టం ఎక్కడికైనా పర్లేదు. ఊర్కే అలా బైటతిరిగొద్దాం" స్థలనిర్ణయాన్ని అత నికే వదిలేస్తూ అంది రంభ.

ఆమె ఊహించినట్టే పరిస్థితిలోని అనీజీ నెస్ తగ్గిపోయింది.

"ఏదైనా సిన్మాకి వెళ్దామా?" అన్నాడు ప్రభాకర్ ఉత్సాహంగా.

"మీ ఇష్టం. కొన్నాళ్లు పోయాక నేనె లాగూ బైట ఫ్రీగా తిరగలేను. కాబట్టి ఏంచూసినా ఈ కొద్దికాలంలోనే" అంది రంభ.

ఆమె ఉద్దేశం అర్థమైంది మిత్రులిద్దరికీ.

నిజమేగదా? రంభశ్రీగా ఆమె పాపులర్ అయ్యాక, ఆమె నటించిన తొలి సినిమా విడుదలయ్యాక జనాలందరూ ఆమెని హీరో యిన్ రంభశ్రీగా గుర్తుపట్టి ఎక్కడికెళ్లినా పొలోమని ఎగబడిపోతారు కాబట్టి మున్ముం దామె బైటెక్కడా ఫ్రీగా తిరగలేదుగదా!

"నిజమేనండోయ్" అన్నాడు ప్రభాకర్.

"మరందుకే ఎక్కడికైనా వెళ్దాం పదండి" అంది రంభ.

"సిన్మాకన్నారుగా... సిన్మాకి వెళ్దాం?" అన్నాడు ప్రభాకర్.

"'ఇద్దరు మిత్రులు' ఇంకా ఆడ్తూనే ఉంది దానికి వెళ్దామా?" అన్నాడు ఫణీంద్ర.

"వొద్దు. రంభున్న సిన్మాకొద్దు. ఇంకేదైనా సిన్మాకెళ్దాం" అయిష్టంగా అంది రంభ.

"మీరే చెప్పండైతే" అన్నాడు ప్రభాకర్.

"రంభలేని సిన్మా ఏదైనా పర్లేదు" అంది రంభ.

"అసలీ గొడవంతా దేనికి? ఏదైనా ఇంగ్లీష్ సిన్మాకి పోతే పోలా?" అన్నాడు ఫణీంద్ర.

దానికి రంభ వెంటనే "ఓకే" అనేసింది.

ఫలితంగా వాళ్లు ముగ్గురూ మరి కాసేప టికి ఆ ఇంట్లోంచి బయటపడ్డారు.

★ ★ ★



ఇంగ్లీష్ సినిమాకని బయల్దేరి కూడా తీరా ఒక తెలుగు సినిమానే చూసొచ్చారు వాళ్లు ముగ్గురూ.

ఎందుకంటే వాళ్లు వెళ్లింది సంగీత్ థియేటర్‌కి.

వాళ్లు వెళ్లేసరికే అక్కడ 'హౌస్‌ఫుల్' బోర్డ్ తగిలించి ఉండటంతో అక్కణ్ణించి కాలినడకన అజంతాకి వెళ్ళారు.

అందులో ఏదో హిందీ సిన్మా ఆడుతోంది.

కానీ దానిక్కూడా టిక్కెట్లు దొరకలేదు.

ఫణీంద్ర, ప్రభాకర్‌లు క్యూలో అయితే నిలబడ్డారుగానీ, వాళ్ళ వంతు రాకముందే కౌంటర్ కాస్తా క్లోజ్ చేసేశారు.

దాంతో అక్కడ్నుంచి మళ్లీ నడక పట్టి, మనోహర్‌లో ఏదో పాత తెలుగు సినిమా ఆడుతుంటే దాన్ని చూసొచ్చారు వాళ్లు.

సహజంగానే ఇంటికి రాగానే రంభని కూర్చోబెట్టి మిత్రులిద్దరూ వంటకుపక్రమించారు.

కాబోయే హీరోయిన్‌తో వంటచేయించడం బావుండదుగదా?

అందుకని "మీరు కూర్చోండి. మేం చిటికెలో వంట పూర్తిచేస్తాం" అని చెప్పి రంభని హాల్లో కూర్చోబెట్టి వాళ్ళిద్దరూ కిచెన్‌లోకి దూరారు.

"అరెరె. ఆడదాన్ని నేనుండగా మీరు చెయ్యి కాల్చుకోవడం ఏంటి? " అని మాట వరసకైనా అనలేదు రంభ.

అలా అనగలిగేందుకు అసలామెకు వంటొచ్చి ఏడిస్తేగా?

అందుకే... "అలాగే కానివ్వండి" అని చెప్పి సోఫాలో దర్జాగా కూర్చుంది రంభ.

"ఏంటో ఈ మానవజీవితాలు! వంట వొండుకోవడం, తినడం, వీళ్ళకసలు ఆకలెందుకేస్తుందో? " అనుకుంది మనసులో.

★ ★ ★

చేతిలో డబ్బుండాలేగానీ ఏపనైనా జరిగిపోవటం ఎంతసేపు?

ఆ మర్నాడే వాళ్లు ముగ్గురూ జూబ్లీహిల్స్‌లోని ఓ డీసెంట్‌గా ఉన్న ఇంట్లోకి మారిపోయారు.

అద్దె నెలకు ఎనిమిదివేలు. అడ్వాన్స్ పాతికవేలు.

"అద్దదీ ఇలా ఉండాలి హీరోయిన్ ఇల్లంటే" అన్నాడు ఫణీంద్ర ఇంట్లో సామాన్లన్నీ సర్దుకోవడం అయ్యాక.

సామాన్లంటే రంభకేం సామాన్లున్నాయ్ గనక. వీళ్ళ సామాన్లే అక్కడికి తీస్కెళ్ళి సర్దుకున్నారన్నమాట.

"అవునవును..." అన్నాడు ప్రభాకర్ మిత్రుడితో ఏకీభవిస్తూ.

"నిన్నటిదాకా ఏదో చేతులు కాల్చుకున్నాం. కానీ ఇకనుండి అలా బావుండదు. ఎవరైనా వంట మనిషిని కుదుర్చుకోవాలి..." అంటూ ఓ ప్రతిపాదన లేవదీశాడు ఫణీంద్ర.

"ఎందుకురా అనవసరంగా ఖర్చు! ఇద్దరున్నాం ఆపాటి చేస్కోలేమా? " అన్నాడు ప్రభాకర్.

"ఎబ్బే వద్దండీ! మీ ఫ్రెండు చెప్పిందే కరెక్టు" అతని మాటల్ని ఖండిస్తూ అంది రంభ. "ఫణీంద్రగారు నాతో షూటింగులకీ గట్రా వస్తుంటారుగదా! ఇహ ఇంట్లో ఉండేది మీరొక్కరే. మీరొక్కరే చెయ్యి కాల్చుకోవటం ఏం బావుంటుంది? "

"నేను మాత్రం ఇంట్లో ఎందుకుంటాను? రేపట్నుంచి డ్యూటీకి వెళ్ళిపోతాగా" అన్నాడు ప్రభాకర్.

నిజానికారోజే అతను డ్యూటీకి వెళ్ళాల్సింది. కానీ ఇల్లు మార్తున్న సందర్భంగా వాళ్ళ మేనేజర్‌కి ఫోన్‌చేసి సెలవు పెట్టాడు.

అదేవిధంగా ఫణీంద్ర కూడా తను రిజైన్ చేయబోతున్నట్టు ఫోన్‌లోనే చెప్పేశాడు వాళ్ల మేనేజర్‌కి. రిటెన్‌గా రెజిగ్నేషన్ లెటర్ రేపోమాపో సబ్‌మిట్ చెయ్యాలి.

"మీరు మాత్రం డ్యూటీకి వెళ్ళటం దేని




కండి! మీరు కూడా జాబ్‌కి రిజైన్ చెయ్యండి..." అంది రంభ.

"బాగుందండీ! వీడికంటే మీ పియ్యే పోస్ట్ దొరికింది కాబట్టి రిజైన్ చేస్తున్నాడు. నేనెలా చెయ్యగలుగుతాను?" అడ్డంగా తలాడిస్తూ అన్నాడు ప్రభాకర్.

"ప్రస్తుతానికైతే కుక్ పోస్ట్ ఖాళీగా ఉందిగా" అంటూ జోక్ చేశాడు ఫణీంద్ర.

దానికి ప్రభాకర్ ముఖాన్న గంటుపెట్టుకోగా, "చఛ! అదేం మాటండీ..." అంది రంభ ఫణీంద్రని వారిస్తూ.

క్షణమాగి ఆమే అంది. "మీరు నా డేట్సూ అవీ చూస్తుండండి. ప్రభాకర్‌గారేమో డబ్బు వ్యవహారం చూసుకుంటారు..."

"అంటే డబ్బు పెత్తనం వాడికా? ఊహుఁ..." కంగారుగా అన్నాడు ఫణీంద్ర.

"పెత్తనం అని కాదండీ! లెక్కలూ అవీ చూసుకుంటారు..." అంది రంభ అప్పుడే తానేదో బిజీ హీరోయిన్ అయిపోయినట్టుగా.

"ఆ పని కూడా నేనే చెయ్యగలను. అసలా మాటకొస్తే మా బ్యాంక్‌లో నాది క్యాషియరు పోస్టు..." అన్నాడు ఫణీంద్ర ఆమె ప్రపోజల్‌ని మళ్ళీ ఖండిస్తూ.

అతనలా అంటుంటే ప్రభాకర్ అతనికేసి గుర్రుగా చూశాడు.

"నీ ధోరణి చూస్తుంటే నేనిక్కడుండటం నీకిష్టం లేదల్లే ఉందే?" అన్నాడు కించిత్ బాధగా.

మిత్రుడు నొచ్చుకున్నాడని గ్రహించి, "చఛ... అదేం కాదురా" అన్నాడు ఫణీంద్ర రవంత సిగ్గుగా. తన మాటల్లో కొంత అపసవ్యత దొర్లినట్టుగా అప్పుడనిపించిందతనికి.

"రంభ నా ఉడ్‌బీ గనక తనకి సంబంధించిన పన్లన్నీ నేనే చెయ్యాలన్న ఆశతో అలా అన్నాను. అంతే తప్ప నువ్ ఇక్కడుండటం ఇష్టం లేకకాదు" అన్నాడు తనే మళ్ళీ.

"నువ్వే ఉద్దేశంతో అన్నప్పటికీ నేనేం నా ఉద్యోగానికి రిజైన్‌చేసి మీకు భారంగా ఉండబోవట్లేదు లే..." అన్నాడు ప్రభాకర్ ముఖాన్ని పక్కకి తిప్పుకుంటూ.

"సారీరా! నీ మనసుని గాయపరిచుంటే నన్ను మన్నించు" అన్నాడు ఫణీంద్ర మిత్రుడి చేతులు పుచ్చుకుంటూ.

దాంతో ప్రభాకర్ ఆ విషయాన్ని కొంత తేలిగ్గా తీసుకోగలిగాడు. "నేనేం కోపంతో అనడంలేదురా! రంభగారు హీరోయిన్‌గా సెటిలయ్యేవరకూ నా జాబ్ విషయంలో నేను రిస్క్ తీసుకోదల్చుకోలేదు" అన్నాడు ముఖాన్ని ప్రసన్నంగా మార్చేస్తూ.

అతని మాటలు రంభకి ఏమంతగా రుచించలేదు.

"అంటే?!" అంది నుదురు చిట్లిస్తూ, "నేను హీరోయిన్‌గా సెటిలవ్వలేనని మీ ఉద్దేశమా?" అంది బాధగా.

"అది మీ ఫస్ట్ పిక్చర్ సక్సెస్ అవ్వడం బట్టుంటుందండీ" అన్నాడు ప్రభాకర్ నిర్మొహమాటంగా.

అతని మాటలు ఈసారి ఫణీంద్రకి కూడా అంతగా రుచించలేదు.

"నటిస్తున్నది నా రంభ... తీస్తున్నది వెంకన్న. సక్సెస్ కాకుండా ఎందుకుంటుంది?" అన్నాడు కొంచెం కోపంగా.

"సినిమా విషయంలో సక్సెసా ఫ్లాపా అన్నది ముందుగా ఎవ్వరూ చెప్పలేరు. 'నీ' రంభ నటించినంత మాత్రాన, వెంకన్న దర్శకత్వం వహించినంత మాత్రాన హిట్ అవ్వాలని రూలేంలేదు. ఎంత గొప్ప దర్శకుడైనా అన్నీ హిట్‌లే అందివ్వలేడు..." అన్నాడు ప్రభాకర్ మళ్ళీ అంతే నిర్మొహమాటంగా.

"అశుభం పలకటం కాదండీ! వాస్తవం చెబుతున్నా! అంటే మీ ఫస్ట్ ఫిల్మ్ ఫ్లాప్ అవ్వాలని నేను కోరుకుంటున్నానని కాదు. కానీ అలా ఫెయిలయ్యే అవకాశం కూడా ఉందని చెబుతున్నానంతే" అన్నాడు ప్రభాకర్.



అతని మాటల్లో సబబున్నప్పటికీ శ్రోతలి ద్దరికీ మాత్రం అవి చేదుగానే అనిపిం చాయి.

"సర్లెండి సర్లెండి. రిస్క్ తీస్కోకండి అయితే..." అనేసింది రంభ.

"నీ అంత దూరదృష్టి మాకు లేదులే" అని మూతి బిగించుకున్నాడు ఫణీంద్ర.

శుభమా అంటూ కొత్త ఇంట్లోకి చేరిన రోజే ఈ అపసవ్యపు సంభాషణేమిటా? అనిపించింది రంభకి.

ఒకవేళ నిజంగానే తను హీరోయిన్‌గా ఫెయిలైతే? అన్న ఆలోచన ఓ క్షణం కుది పేసిందామెను.

అయినా అంతలోనే ధైర్యం తెచ్చుకుంది.

"ఆఫ్టరాల్ మానవాంగనలే అద్భుతంగా నటిస్తుండగా లేన్ది తనాపాటి నటించలేకపో వడం ఏంటి?

నో...

ఫెయిల్యూర్ అనేది తన దరిచేరదు" అలా అనుకున్నాక మళ్ళీ మామూలు మని షైందామె.

"నాకాకలిగా ఉంది. ముందు భోజనం సంగతి చూడండి" అంది టాపిక్‌ని డైవర్ట్ చెయ్యడానికి.

అసలు సంగతి ఫణీంద్రకేం తెలుసు? తన ఉడ్‌బీ ఆకలనగానే ప్రాణం విలవిల్లాడి పోయిందతనికి.

"ఇప్పుడు వంట చెయ్యడం కుదరదు. క్షణాల్లో హోటల్నుండి కారేజీ పట్టుకొస్తా" అంటూ దాదాపుగా బయటికి పరుగుతీశాడ తను.

పసివాడిలా అతనలా పరుగెత్తుతుంటే "ఈ మానవుడికి నేనంటే ఎంత ప్రేమ?" అని అనుకోకుండా ఉండలేకపోయింది రంభ.

అతని నిష్క్రమణానంతరం ఆమె ప్రభా కర్‌తో అంది. "మీ ఫ్రెండ్ మాటల్ని మీరేం పట్టించుకోకండి. ఏదో నామీద ప్రేమకొద్దీ అతనలా అనుంటాడంతే!"

"ఆపాటి నేనూ అర్ధ చేసుకోగలనులెండి" అనేశాడు ప్రభాకర్ దాన్నింకేం సాగదియ్య కుండా.

దాంతో చాలా రిలీఫ్‌గా అనిపించింది రంభకి.

★ ★ ★

'నిన్నామొన్నా రెండు రాత్రుళ్లు వేస్టయిపో యినై! ఇవ్వాళ ఎలాగైనా సరే...' అను కుంది రంభ ఆరోజు రాత్రి.

కానీ మళ్ళీ అదే సందేహం... తానై అతని పొందుకోరితే అతను తన గురించి చీప్‌గా అనుకుంటాడేమోనని.

అలాగని మిన్నకుండిపోతే తనకి స్వర్గభ్ర ష్టత్వం ప్రాప్తించదు గదా?

సో... అతన్ని రంగంలోకి దింపడమే మంచిది.

ఎలాగూ అతన్ని ప్రేమిస్తున్నట్టుగా చెప్పే సిందాయె. తను కొంచెం అవకాశం ఇవ్వా లేగాని అతను అడ్వాన్సైపోకుండా ఎందు కుంటాడు?

అదే ధీమాతో ఆ రాత్రి "నాకు బోర్ కొడ్తోంది. కాసేపు కబుర్లు చెబుదురుగాని రండి" అంటూ అతన్ని తన గదిలోకి పిలి చింది రంభ.

మునుపట్లా ప్రభాకర్ వాళ్లకేం అడ్డుపడ లేదు. తన మట్టుకు తను వేరేగదిలో ముసుగుతన్ని పడుకుండిపోయాడు. ఆమె ఎలాగూ వాడ్నే ప్రేమిస్తున్నప్పుడు తనెందు కులే తలదూర్చడం అని.

"హోటల్ భోజనం అంత బాగున్నట్టుగా లేదు. వంటమనిషి గురించి సీరియస్‌గా ఆలోచించాలి మనం..." అనే వాక్యంతో సంభాషణ ప్రారంభించాడు ఫణీంద్ర.

ఆకలంటేనే తెలియని రంభకి తిండి విషయం ఏం రుచిస్తుంది? అందుకే అత నలా అంటుంటే లోలోన చాలా చిరాగ్గా అనిపించిందామెకి.

"తిండిగోల ఇప్పుడెందుకులేగానీ ఏవైనా సరదాగా ఉండే కబుర్లు చెప్పండి" అంది

పైకి మాత్రం నవ్వేస్తూ.

"సరదాగా ఉండే కబుర్లంటే? " అన్నాడు ఫణీంద్ర.

"ప్రేమకబుర్లు" అంటూ కావాలనే పైట జార్చింది రంభ.

కానీ ఆ సంగతి ఫణీంద్రకేం తెలుసు?

పొరపాట్న జారిందేమో అనుకుని అత నామె పైటని మళ్ళీ మామూలుగా కప్పాడు.

'ఎంత బుద్ధిమంతుడు?' అనిపించినా కూడా అంతలోనే అతనిమీద చిరుకోపమొచ్చింది రంభకి.

అవకాశాన్నిస్తుంటే సద్వినియోగం చేసుకోడేం?

చూద్దాం ఈసారేం చేస్తాడో అనుకుని మళ్ళీ పైటజార్చింది రంభ.

ఫణీంద్ర మళ్ళీ అదేపని చేశాడు.

'వార్నీ!' అని మనసులో అనుకుని, "ఎందుకోగాని పైట తెగజారిపోతూ ఉంది..." అంది రంభ మత్తుగా.

ఆ మత్తుకళ్లని చూసి మరో మగాడైతే చిత్తైపోవాలి న్యాయంగా.

కానీ ఫణీంద్ర మాత్రం అలాగేం చిత్తైపోలేదు.

"ప్రియుడి సమక్షంలో ప్రేయసికి పైటజారిపోవటం చాలా సాధారణంలే..." అనేశాడు, నిజంగానే అదేంతో సాధారణమైన విషయం అయినట్టు.

"మరప్పుడు ప్రియుడేం చెయ్యాలి" అంది రంభ మరింత మత్తుగా.

"అల్లరి ప్రియుడైతే ఏమేమో చేస్తాడు. కానీ నాలాంటి బుద్ధిమంతుడు మాత్రం ఇదిగో ఇలా బుద్ధిగానే ఉంటాడు" అన్నాడు ఫణీంద్ర బుద్ధిగా చేతులు కట్టుకుంటూ.

రంభకు కావాల్సింది వేరే అయినప్పుడు ఆ మాటలామెకేం రుచిస్తాయి?

అవడమేకాదు 'అయామ్ రెడీ' అన్నట్టుగా అతనికి మరింత దగ్గరగా కూడా జరిగిందామె.

ఫణీంద్ర ఆమె చేష్టని బరితెగింపుగా అనుకోలేదు. 'చిన్నపిల్లగదా! తెలిసీ తెలియనితనం' అనుకున్నాడు ప్రేమగా.

'అలా అల్లరి ప్రియుడ్నైపోవటం నాకిష్టంలేదు. పెళ్లయ్యేదాకా మనం పవిత్రంగా ఉండటమే మంచిది' అంటూ అతను తనని సున్నితంగా పక్కకు జరుపుతుంటే... 'నైస్ ఫెలో' అనిపించినా... అంతలోనే అతని మీద చెప్పలేనంత కోపమొచ్చేసింది రంభకి.

ఆ కోపంలో తననితాను మర్చిపోతూ, "అంతేనా లేక నా అందం నిన్నాకర్షించటం లేదా? " అనడిగింది బాధగా.

"నీ అందం నన్నాకర్షించకపోవటమా? భలేదానివే! అలాగైతే నిన్నెందుకు ప్రేమిస్తానసలు? " అన్నాడు ఫణీంద్ర ఆమె ముక్కు చిదుముతూ.

"ప్రేమంటే ఇదేనేమిటి? " అంది రంభ మూతి బిగిస్తూ.

"కాక? " అన్నాడు ఫణీంద్ర కళ్లెగరేస్తూ.

"ప్రేమన్నాక కాస్త ముద్దూ మురిపెం ఉండాలి..."

"హద్దు దాటనంత వరకే ఏముద్దైనా మురిపెమైనా.. ప్రస్తుతానికీ చిన్న ముద్దుతో సరిపెట్టుకో"

అలా అని అతను తన చెక్కిల్ని ముద్దాడుతుంటే అతన్ని దూరంగా నెట్టేసింది రంభ.

'పిచ్చిపిల్ల' అని మనసులో అనుకుని "కోపమా? " అన్నాడు ఫణీంద్ర.

"కాదు విరహతాపం" అనాలనిపించినా కూడా మరీ చీప్‌గా జమకట్టేస్తాడేమోనని పించి సైలెంట్ అయిపోయింది రంభ.

"మాట్లాడవేం? " అంటూ మళ్లీ ఆమె ముక్కు చిదిమాడు ఫణీంద్ర.

అసలు పని ఎలాగూ జరగదని తెలిసిపోయినప్పుడు అనవసరపు మాటలు దేనికి?

అందుకే... "నాకు తల నొప్పిగా ఉంది" అనేసి పడుకుండిపోయింది రంభ!

ప్రేయసి తలనొప్పంటే ఏ ప్రియుడు

మాత్రం సహించగలుగుతాడు?

ఆమె నుదుటికి జండూబాం పూస్తూ ఆ రాత్రంతా మెలుకువగా ఉండిపోయాడు ఫణీంద్ర.

రంభ మాత్రం హ్యాపీగా నిద్రపోయింది.

★ ★ ★

ప్రభాకర్ నీట్‌గా ముస్తాబవుతుంటే "ఎక్కడికి రా? " అనడిగాడు ఫణీంద్ర.

"ఇంకెక్కడికి బ్యాంకుకి" అన్నాడు ప్రభాకర్.

"అయితే మీరు మీ నిర్ణయాన్ని మార్చుకోలేదన్నమాట? " అంది రంభ అప్పుడే అక్కడికొస్తూ.

"మారేది నిర్ణయం ఎలా అవుతుంది రంభగారూ? " అని నవ్వేసి, "నన్ను యధావిధిగా నా ఉద్యోగం చేసుకోనివ్వండి" అన్నాడు ప్రభాకర్.

"నిన్నటి నా మాటల్ని ఇంకా మనసులో పెట్టుకున్నావా? " కాస్త బాధగా అన్నాడు ఫణీంద్ర.

"అదేంలేదు..." అని అడ్డంగా తలాడించి, "నిన్ననే చెప్పానుగా నేను రిస్క్ ఫేస్ చెయ్యదల్చుకోలేదని..." అన్నాడు ప్రభాకర్.

రిస్క్ అన్నపదం కసుక్కున కత్తిలా గుచ్చుకుంది రంభ మనసులో.

"అంటే నేను హీరోయిన్‌గా స్థిరపడలేననేగా మీ డౌటు? " అంది బాధగా.

"అది కూడా నిన్ననే చెప్పానుగా. మీరు స్థిరపడేదీ లేన్దీ మీ ఫస్ట్ పిక్చర్ హిట్టవడాన్ని బట్టి ఉంటుందని" అన్నాడు ప్రభాకర్ నిర్మొహమాటంగా.

మిత్రుడి మాటలు ఫణీంద్రకి చాలా వెగటుగా అనిపించాయి.

"మళ్లీ నిన్నటి పాటే పాడుతున్నావా నువ్వు? ఎందుకురా ఇలా అశుభాన్ని కోరుకుంటావ్? " అన్నాడు ఆవేశంగా.

"దీనిక్కూడా సమాధానం నిన్ననే చెప్పాను? " అన్నాడు ప్రభాకర్.

వ్యవహారం మళ్లీ తగవుకు దారితీస్తుందేమోనని భయపడి "అవునవును చెప్పారు. ఇక దీన్ని గురించి వాదోపవాదాలొద్దు" అనేసింది రంభ ఖండితంగా.

దాంతో ఫణీంద్ర ఏదో అనబోయినవాడల్లా మానేసి నోరు మూసుకున్నాడు.

మనసులో మాత్రం 'కుళ్లుబోతు వెధవ!' అనుకున్నాడు మిత్రుడ్ని ఉద్దేశించి.

అంతలో రంభే అంది మళ్ళీ. "ఫణీంద్రా... మీరు కూడా వెళ్ళండి బ్యాంకుకి..."

"రెజిగ్నేషన్ లెటరివ్వడానికేగా? వెళ్ళొచ్చు లెస్తూ" అన్నాడు ఫణీంద్ర బద్ధకంగా.

"కాదు..."

రంభ అలా అనేసరికి కాస్త ఉలిక్కిపడ్డాడు ఫణీంద్ర.

"అదేంటీ? !" అన్నాడు అయోమయంగా.

"మీరు కూడా మీ జాబ్‌కి రిజైన్ చెయ్యొద్దు. ప్రభాకర్‌గారన్నట్టు నేను హీరోయిన్‌గా సెటిలయ్యాకనే..."

"నాన్సెన్స్..." ఆమె మాటలకు మధ్యలోనే అడ్డుతగుల్తూ అరిచాడు ఫణీంద్ర. "నువ్వు హీరోయిన్‌గా సెటిలవ్వలేకపోవడం ఏంటి? అలా జరగదెప్పటికీ" అంటూ పిడికిళ్ళు బిగించాడు.

'ఎంత ప్రేమ? ' అని మనసులో అనుకుని...

"ఏ విషయంలోనైనా కీడెంచి మేలెంచాలంటారుగా. ప్రస్తుతానికి ప్రభాకర్‌గారి సలహానే పాటించండి" అంది రంభ.

"నేను చచ్చినా పాటించను. నీ నటనా కౌశలంమీద నాకు పూర్తిగా నమ్మకం ఉంది. నువ్ హీరోయిన్‌గా సెటిలవ్వడం ఖాయం. నేను నీ పియ్యేగా సెటిలవ్వడమూ ఖాయమే" అన్నాడు ఫణీంద్ర.

అతని అమాయకత్వానికి మనసులోనే జాలిపడ్డాడు ప్రభాకర్.

"హీరోయిన్‌గా సెటిలవ్వడానికి నటనాకౌశలం ఒక్కటే సరిపోదు. ఎక్స్‌పోజింగ్




చెయ్యడం రావాలి. నాటోన్లీ దట్... ఎంత బాగా ఎక్స్‌పోజ్ చేసినా కూడా కొందరు హీరోయిన్లని ప్రేక్షకులు తిరస్కరిస్తూ ఉంటారు. సో... అన్నిటికన్నా ప్రేక్షకాదరణ ముఖ్యం..." అన్నాడు జ్ఞానబోధ చేస్తున్న ధోరణిలో.

"అంటే నన్ను ప్రేక్షకులు ఆదరించకపోయే ప్రమాదముందంటావా?" అంది రంభ బాధగా.

"వైనాట్? వెండితెరమీద ఇప్పటికే మీకన్నా అందకత్తెలు ఎంతోమందున్నారు. వాళ్లందర్నీ వెనక్కినెట్టి మీరు ముందుకు దూసుకుపోగలగటం... అసాధ్యం అనను గానీ, దానికి మీరు చాలా కష్టపడాల్సుంటుంది" అన్నాడు ప్రభాకర్ ఏమాత్రం సంకోచించకుండా.

రంభని హర్ట్ చెయ్యాలన్నది అతని ఉద్దేశం కాదు. జస్ట్ వాస్తవాన్ని చెప్పాడంతే.

"హీరోయిన్‌గా నిలదొక్కుకోవడానికి నేను ఎంత కష్టానికైనా సిద్ధమే" అంది రంభ నీరసంగా. అవునుమరి! అతని మాటలకి ఇప్పటికే ఆమెకి నిలువునా నీరసం ఆవహించేసింది.

"చిత్రసీమ చాలా విచిత్రమైంది రంభగారూ! మీ కష్టం ఒక్కటే కూడా సరిపోదక్క.డ. అదృష్టం కూడా అన్నివిధాల అనుకూలించాలి. సినిమా విజయానికి హీరోయిన్ పెర్‌ఫార్మెన్స్ ఒక్కటే చాలదుగదా? మిగతా వాళ్ళు కూడా బాగా నటించాలి. ముఖ్యంగా కథ బాగుండాలి. ఆ కథని దర్శకుడు సమర్ధవంతంగా తెరకెక్కించగలగాలి..." అన్నాడు ప్రభాకర్.

"ఇంతకీ నువ్ అనేదేంటి? నా రంభ హీరోయిన్‌గా క్లిక్ అవ్వదనా?" ఆవేశపడ్డాడు ఫణీంద్ర.

పరిస్థితి మళ్ళీ విషమించేలా ఉందనిపించి, "సర్లెండి సర్లెండి. ఆవేశాలొద్దు. ఏది ఎలా జరగాలనుంటే అలాగే జరుగుతుంది. ప్రస్తుతానికైతే మీరిద్దరూ. బ్యాంకుకి వెళ్ళండి. ఇద్దర్లో ఏ ఒక్కరూ జాబ్‌కి రిజైన్ చెయ్యొద్దు" అనేసి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది రంభ.

ఉడ్‌బీ ఆజ్ఞాపించిందీ అంటే అది మస్ట్ అండ్ షుడ్డేగదా!

అందుకే... ప్రభాకర్‌తో పాటు తనూ బ్యాంకుకి బయల్దేరాడు ఫణీంద్ర.

★ ★ ★

రంభ స్వర్గభ్రష్టత్వాన్ని పొంది భూలోకంలోనే సెటిలైపోవాలన్న నిర్ణయానికొచ్చిందన్న విషయం నారదుడి ద్వారా విని వికలమనస్కుడైపోయాడు దేవేంద్రుడు.

దీన్ని ఎలాగైనా సరే నివారించాలి.

రంభని ఎలాగైనా సరే మళ్ళీ స్వర్గానికి రప్పించాలి.

ఆవిడగారు లేకపోతే ఇక్కడ తెల్లవారదని కాదు. ప్రస్తుతం రంభ ప్లేస్‌లో టెంపరరీగా అపాయింట్ అయిన 'సిల్క్‌స్మిత' అనే ఆవిడ రంభకన్నా బాగానే డాన్స్ చేస్తోందిక్క.డ. సో... అదికాదు ప్రాబ్లం.

ఈ తిరుగుబాటు ధోరణిని ఆదిలోనే అరికట్టలేకపోతే ఈ భూలోక వలసల్ని ఇలా కొనసాగనిస్తే కొన్నాళ్ళకి స్వర్గం అంతా ఖాళీ అయిపోదూ?

అప్పుడు తానిక్కడ దేవేంద్రుడిగా చెయ్యాల్సిందేముంటుంది? ప్రజలుంటేనే కదా రాజ్యం? రాజ్యముంటేనేకదా రాజు?!

సో...

ఏదో ఒకటిచేసి ఈ అకృత్యాన్ని ఆపాలి.

ఒక దేవనర్తకీమణి భూలోకంలో హీరోయిన్‌గా సెటిలవ్వడమా? ఊహించడానికే అసహ్యంగా ఉందిది.

ఈ సమయంలో తానిలా చేతులు ముడుచుక్కూర్చోవటంకన్నా కల్తీ అమృతం తాగి మరణించటం మిన్న.

దేవేంద్రుడు రంభని అదుపులో ఉంచలేకపోయాడన్న విషయం అందరికీ తెలిస్తే అంతకన్నా అవమానం ఇంకేముంటుంది తనకి?



ఇప్పటికే చాలా నెగ్లెక్ట్ చేసేశాడు తను.

ఇప్పుడైనా సరే ఏదోక ఉపాయమాలోచించకపోతే కొంప మునిగిపోతుంది.

అసలే స్వర్గంలో పరిస్థితులు బాగోలేవు. ఇక్కడ ప్రజాస్వామ్యం లేదా? ఎప్పుడూ ఒక్కరికే పదవా? సమర్థవంతులైన మిగతా వారిక్కూడా అవకాశం కల్పించకపోతే ఎలా? అంటూ కొత్తగళాలు, కొత్త వాదాలు వినిపిస్తున్నాయి.

ముఖ్యంగా ఆ ఎన్టీఆర్ స్వర్గలోకవాసుల్ని ఇప్పటికే ఈ విషయంలో చాలా చైతన్యవంతుల్ని చేశాడు.

ఇప్పటి పరిస్థితుల్లో తన అసమర్థత ఏమాత్రం బయటపడినా అతన్తో చాలా ప్రాబ్లం!

ప్రాబ్లం కాదు. ఏకంగా పదవీచ్యుతి సంభవించినా కూడా ఆశ్చర్యపోవాల్సిన పన్లేదు. అతని చరిత్రేమైనా సామాన్యమైనదా? తన స్థానాన్ని గనక అతను చేజిక్కించుకుంటే... నిస్సందేహంగా తనపని మటాషే!

సో... అంత ఉపద్రవం ముంచుకురాకముందే రంభ ఆట కట్టించాలి.

హౌ?

వాటేమై టు డూ నౌ?

ఆలా పరిపరివిధాల ఆలోచించాక ఒక ఉపాయం తోచింది దేవేంద్రుడికి.

వెంటనే ఆయన విఘ్నేశ్వరుడ్ని కాంటాక్ట్ చేశాడు.

★ ★ ★

"నిన్ననే కదయ్యా ఫోన్‌చేసి రిజైన్ చెయ్యబోతున్నట్టు చెప్పేవ్? వాట్ మేడ్‌యు ఛేంజ్ యువర్ డెసిషన్ నౌ?" ఫణీంద్రని అడిగాడు వాళ్ళ బ్యాంకు మేనేజరు.

ఉడ్‌బీ సూచనమేరకు తన నిర్ణయాన్ని మార్చుకున్నట్టు మేనేజర్‌తో చెప్పడం ఏం బావుంటుంది.

అందుకే... "ఏంలేదు సార్" అని నవ్వేసి ఊరుకున్నాడు ఫణీంద్ర.

"ఏం లేకపోవడం ఏంటి?" అన్నాడు మేనేజర్ సాగదీస్తూ.

"ఉత్తుత్తి రాజీనామా బెదిరింపు బెదిరించటానికి నువ్వేమన్నా కేంద్రమంత్రివా?"

చూపులన్నీ తనమీదనే కేంద్రీకరించి ఆయనలా అడుగుతుంటే ఏం చెప్పాలో తోచలేదు ఫణీంద్రకి.

అతని అవస్థ గమనించి ఆ పక్కనే ఉన్న ప్రభాకర్ అందుకుని చెప్పాడు. "ఏంలేదు సార్! మనవాడీమధ్య ప్రేమలో పడ్డాడు. ఆ ప్రేమ మైకంలో నిన్న ఏదో అలా వాగేశాడంతే!"

ప్రేమ వ్యవహారాలంటే ఆ మేనేజర్‌కి చాలా ఇష్టం. ఎందుకంటే ఇరవైరెండేళ్ళకే బట్టతల వచ్చిన ఒక విచిత్రమైన వ్యక్తాయన. ఆ కారణంగా వయసులో ఉండగా ఆయనెవర్నీ ప్రేమించలేకపోయాడు. అంటే ఆయన ప్రేమించినవారెవరూ ఆయన ప్రేమనంగీకరించలేదు. అంచేత ప్రేమికులన్నా, ప్రేమకథలన్నా చాలా ఇంట్రెస్ట్ ఆయనకి.

అందుకే...

"అలాగా! కంగ్రాట్స్ మిస్టర్ ఫణీంద్ర" అన్నాడాయన అభినందిస్తూ.

"థాంక్యూ సార్!" అనేశాడు ఫణీంద్ర సిగ్గుపడిపోతూ.

"ఇంతకూ నీ ఫియాన్సీ పేరేంటి?"

"మేనేజర్ కుతూహలంగా అడుగుతుంటే "రంభ సార్" అన్నాడు ఫణీంద్ర మరింత సిగ్గుపడిపోతూ.

"జోకా?" సీరియస్‌గా అడిగాడు మేనేజర్.

అవును మరి...

రంభ అనేది చాలా అరుదైన పేరుగదా!

"అహఁ... జోక్కాదు సార్! నిజమే ఆ అమ్మాయి పేరు రంభే!" అన్నాడు, ప్రభాకర్ మిత్రుడి తరపున తాను సమాధానం ఇస్తూ!

"వెరీ నైస్ నేమ్! ఆ అమ్మాయి ఎలా పరిచయమైంది నీకు?" ఫణీంద్రవైపు తిరిగి

 

అడిగాడు మేనేజర్.

"ఎలా పరిచయమైతే ఏంలేకానీ... ఆవిడొక కాబోయే హీరోయిన్ సార్..." అన్నాడు ప్రభాకర్. మిత్రుడు మాట్లాడగలిగే స్థితిలో లేనందున ఈసారి కూడా అతనే చెప్పాడు జవాబు.

"వ్వాట్?!" మేనేజర్ దాదాపుగా కొయ్యబారిపోతూ అన్నాడు "మీరిద్దరూ కలిసి నన్నుగాని ఫూల్‌ని చేస్తున్నారా?"

"ఛఛ! అదేం లేదుసార్! నిజంగానే వాడి ఫియాన్సీ ఒక కాబోయే హీరోయిన్. దట్టూ వెంకన్నగారి ఫిల్మ్‌లో..."

గర్వంగా చెప్పిన ప్రభాకర్‌కేసి అనుమానంగా చూసి, "ఏవోయ్ నిజమేనా?" అని ఫణీంద్రనడిగాడు మేనేజర్.

"నిజమే సార్. వెంకన్నగారి నెక్ట్స్ ఫిల్మ్‌లో తను 'రంభశ్రీ'గా పరిచయం కాబోతోంది. రేపోమాపో పేపర్ అనౌన్స్‌మెంట్ కూడా రాబోతోంది..." అన్నాడు ఫణీంద్ర.

"వెరీ నైస్" అన్నాడు మేనేజర్ సంబరంగా.

తన బ్యాంక్‌లో పనిజేసే ఒక సాధారణ ఉద్యోగి సినీహీరోయిన్ భర్త కాబోతున్నాడంటే మాటలా?

"ఆమెతో మన బ్యాంక్‌లో అకౌంట్ ఓపెన్ చెయ్యించు" అన్నాడాయనే మళ్లీ.

"ప్రస్తుతానికి అడ్వాన్స్‌గా లక్షే ఇచ్చారు సార్! చేతిఖర్చుకుండాలిగా అని చెప్పి ఇంటి దగ్గరే పెట్టుకున్నాం. ఫుల్ పేమెంట్ రాగానే మీరన్నట్టే తనచేత అకౌంట్ ఓపెన్ చెయ్యిస్తా" అన్నాడు ఫణీంద్ర.

"ఇట్సాల్‌రైట్! మరి ఈ శుభసందర్భంలో పార్టీ ఏదైనా..." అంటూ నవ్వేడు మేనేజర్.

"వైనాట్ సార్?" అంటూ తనూ నవ్వేశాడు ఫణీంద్ర.

"ఫలితంగా ఓ అరగంట తర్వాత బ్యాంక్‌లో స్టాఫ్ అందరికీ స్వీటూ హాటూ పంచబడ్డాయ్!

దాంతో ఒక్క మేనేజర్‌కే కాదు. మిగతా అందరిక్కూడా విషయం తెలిసిపోయింది.

అందరూ తనని అభినందిస్తుంటే, కాబోయే హీరోయిన్‌కి కాబోయే భర్తగా అందరూ తనకేసి ఈర్ష్యగా చూస్తుంటే చాలా హ్యాపీగా ఫీలయ్యాడు ఫణీంద్ర.

"మరి నీ ఉడ్‌బీని ఎప్పుడు చూపిస్తావ్?" అని ఎవరో అడిగితే,

"తొందరేముందీ? వెండితెరమీద మీరందరూ ఎలాగూ చూస్తారుగా?" అంటూ నవ్వేశాడు ఫణీంద్ర.

కాస్త దూరంగా వున్నవ్యక్తి "అదే మంచిదిలే. వెండితెరమీదైతే అన్నీ చూడొచ్చు" అంటుంటే ఆ మాటలు ప్రభాకర్ చెవిన పడ్డాయ్.

అతనన్నదాన్లో తప్పేముంది గనక అతన్తో కయ్యాం పెట్టుకోగలగటానికి?

అందుకని మిన్నకుండిపోయినా మనసులో మాత్రం ఫణీంద్రమీద చాలా జాలి కలిగిందతనికి.

నిజమేగదా! రేపు వెండితెరపై 'రంభశ్రీ' అందాలన్నిట్నీ ఆరబోస్తారు.

అప్పుడు వీళ్లందరూ డబ్బుపెట్టి ఆ అందాలన్నిట్నీ చూసొస్తారు.

"కత్తిలా ఉంది ఫిగరు!"

"డాన్స్‌తో అదరగొట్టేసింది!"

"వానపాటలో... ఆ తడిబట్టల్లో... వావ్..."

"ఆ ఎదసంపద ఒరిజినల్లేనా, లేక ప్యాడింగా?"

సిన్మా చూసొచ్చాక వీళ్ళంతా అలా రకరకాలుగా కామెంట్స్ చేస్తుంటే పాపం ఫణి అవన్నీ వింటూ తట్టుకోగలడా?

"అలా అనుకుంటుంటే హీరోయిన్ మొగుడు కావటం వరమో శాపమో అర్థం కాలేదు ప్రభాకర్‌కి.

'సర్లే... అదంతా రంభశ్రీ ఫస్ట్ ఫిల్మ్ రిలీజైనప్పటిమాటకదా!' అని సరిపెట్టుకు



న్నాడప్పటికి.



"ఏంటి సార్ ఇలా వచ్చారు" దేవేంద్రుడు నేరుగా తన దగ్గరికి రావటం చూసి ఆశ్చర్యంగా అడిగాడు విఘ్నేశ్వరుడు.

"ఐ నీడ్ యువర్ హెల్ప్ మిస్టర్ గణేశ్" అన్నాడు దేవేంద్రుడు చేతులు నలుపుకుంటూ.

"బై ఆల్ మీన్స్ విత్ ప్లెజర్! చెప్పండి... వాట్ కెన్ ఐ డు ఫర్ యు?" దేవేంద్రుడికి ఆసనం చూపించి తను మాత్రం ఎలుక మీద కూర్చుంటూ అడిగాడు విఘ్నేశ్వరుడు.

'ఎంత బరువున్నాడో! కాస్త డైటింగ్ చెయ్యకూడదూ?' అని ఎలుక గొణుక్కుంటుంటే అది విని నవ్వబోయి మానేశాడు దేవేంద్రుడు.

నవ్వుకోవటాలు తర్వాత. ముందు వచ్చిన పని ముఖ్యంకదా.

అంచేత తన ప్రాబ్లం అంతా వివరించాడాయన విఘ్నేశ్వరుడికి.

"భలే చిక్కొచ్చిపడిందే! ఇంతకీ ఇందులో నేను చెయ్యగలిగిందేముందీ?" గింజుకుంటున్న ఎలుక నెత్తిన ఓ మొట్టు మొట్టి అడిగాడు విఘ్నేశ్వరుడు దేవేంద్రుడ్ని.

అప్పుడు చెప్పాడు దేవేంద్రుడు మిస్టర్ గణేష్ తనకు చేయగలిగిన హెల్ప్ ఏమిటో!

అది విని నిజమేస్మీ అనుకుని... "ఓకే సార్! అలాగే చేస్తాను" అన్నాడు విఘ్నేశ్వరుడు, తలని పూర్తిగా ఊపటం దేనికి లెమ్మని తొండాన్ని మాత్రమే ఊపుతూ.

ఊపింది దేన్నయితేనేం, మాటగదా ముఖ్యం?

అంచేత "చాలా థాంక్స్ మిస్టర్ గణేష్" అంటూ అతని చేతులు పుచ్చుకున్నాడు దేవేంద్రుడు.

"మనలో మనకి థాంక్స్ లేంటిసార్" అని తేలిగ్గా అనేసి "ఏం తీసుకుంటారు? కుడుములా, ఉండ్రాళ్లా?" అనడిగాడు విఘ్నేశ్వరుడు.

"ఇప్పుడు టిఫిన్లేం వద్దు..." అడ్డంగా తలాడిస్తూ అన్నాడు దేవేంద్రుడు.

"భలేవారు సార్! ఏమీ తీస్కోకుండా ఎలా వెళ్తారు? నాకది మర్యాదగా ఉంటుందా? కనీసం ఓ కప్పు అమృతమైనా..." అన్నాడు విఘ్నేశ్వరుడు.

"అదీ వద్దు. ఇప్పుడే తాగొస్తున్నాను"

"అమృతందేముందిసార్? ఎన్నిసార్లైనా తాగొచ్చు"

విఘ్నేశ్వరుడలా అనేసరికి మరీ బ్రతిమాలించుకోవడం బావుండదని సరే అనేశాడు దేవేంద్రుడు.

★ ★ ★

'వారంరోజులు పూర్తిగా వేస్టయిపోయాయి. ఎంత ప్రయత్నించినా ఈ మానవుడు లొంగడేమిటి?' బాధగా అనుకుంది రంభ.

అవునుమరి. ఫణీంద్రతో పొందుకోసం ప్రతిరోజూ ప్రయత్నిస్తూనే ఉన్నా అతను రోజూ నీతివాక్యాలే చెప్పుకుంటూ వస్తుంటే ఆమెకు బాధ కలక్కుండా ఎలా ఉంటుంది?

'ఈ రాత్రికి ఎలాగైనా సరే తాడోపేడో తేల్చేసుకోవాలి' అనుకుందామె గట్టిగా.





ఆగలేకపోవడం అన్నది కాదిక్కడ ప్రశ్న.

ఒకపక్క రోజులు గడిచిపోతూ ఉన్నాయి కదా. ఎంత త్వరగా స్వర్గభ్రష్టత్వం పొంద గలిగితే అంతమంచిదికదా!

అందుకే అలా గట్టిగా అనుకుందామె.

అంతలోనే నిరుత్సాహం.

తానెంత గట్టిగా అనుకుంటే మాత్రం ఏం లాభం? అవతలివాడు గట్టివాడు కాన పుడు?

అలా అనుకుంటుంటే 'ఛ...ఛ...!' అని పించిందామెకి.

ఫణీంద్ర గట్టివాడు కాకపోవడం ఏంటి? గట్టివాడే! కానైతే పెళ్ళయ్యేదాకా పవిత్రం గానే ఉండాలన్న సిద్ధాంతం కలవాడు.

ఏమిటో ఈ మనుషుల పిచ్చి?

పెళ్లయ్యాక తప్పుకానిది పెళ్ళికిముందు తప్పెలా అవుతుంది? ఈ విషయం ఇవ్వాళ అతనికి బాగా అర్థమయ్యేలా చెప్పాలి.

అప్పటికీ లొంగకపోతే అతనికి తెలియ కుండా ఏ వయాగ్రానో మింగించి...

అలా అనుకుంటుంటే 'అది తప్పేమో' అనిపించిందామెకి.

కానీ అంతలోనే తనకు తానే సర్దిచెప్పు కుంది.

తప్పేముంది? కార్యసాధనకి సామదాన భేద దండోపాయాలు! ఏదో ఒకటి చెయ్యక పోతే ఎలా?

అలా సర్దిచెప్పుకున్నాక వయాగ్రా ఎక్కడ దొరుకుతుందా అని తన దివ్యదృష్టితో చూసిందామె.

ఏ అమెరికానో వెళ్ళాల్సిన పన్లేకుండా ఇండియాలోనే, ఆంధ్రప్రదేశ్‌లో కూడా చాలా చోట్ల వయాగ్రా అమ్ముతున్నారని గ్రహించి... అప్పటికి మిత్రద్వయం ఇంకా బ్యాంకునుండి రానందున ఇదే అదననుకుని చటుక్కున అదృశ్యమై ఒక మెడికల్ షాపు ముందు ప్రత్యక్షమైందామె.

అంటే అందరూ చూసేలా అని కాదు... ఎవరికీ అనుమానం రాకుండా తగు జాగ్రత్త వహించి అన్నమాట.

"వయాగ్రా టాబ్లెట్స్ ఉన్నాయా? " అని ఆమె మెడికల్ షాపతన్ని అడుగుతుంటే బిత్తరపోయాడతను.

రహస్యంగా అతను వయాగ్రా టాబ్లెట్స్ అమ్మేది నిజమే. అమెరికానుండి సీక్రెట్‌గా తెప్పించుకుని టాబ్లెట్ ఒక్కింటికి వెయ్యిరూ పాయల చొప్పున అమ్ముతుంటాడు. ఖరీ దైన మనుషులు కార్లలో వచ్చి కొనుక్కెళ్తూ ఉంటారు వాటిని.

ఈ రహస్య వ్యాపారాన్ని అతనెంతోకా లంగా చేస్తున్నప్పటికీ వయాగ్రా కావా లంటూ ఒక లేడీ కస్టమర్ రావడంమాత్రం ఇదే మొదటిసారి కావడంవలన బిత్తరపోవ డమేకాదు ఆమెకేసి చాలా సందేహంగా చూశాడతను ఎవరైనా ఆడ తనిఖీ అధికారి కావచ్చేమోనని.

ఆ సంగతి తెలియక రంభ ఇదేంటిలా చూస్తున్నాడు? అనుకుని ఒకవేళ సరిగ్గా వినిపించలేదేమో? అని కూడా అనుకుని "వయాగ్రా టాబ్లెట్టండీ" అంది గట్టిగా.

"అవి మా షాపులో దొరుకుతాయని ఎవ రుచెప్పారు? " కాస్త భయంగానూ, బోలెడంత అనుమానంగానూ అడిగాడు షాపతను.

"ఎవరో చెప్పాలా? నేనే నా దివ్యదృష్టితో చూశాను" అనబోయి మానేసింది రంభ.

నిజంగా అలాగనకంటే తననో పిచ్చిదా నిగా జమకట్టేయడూ?

"ఎవరు చెప్తే ఏంలెండి. నాకో రెండుకా వాలి ఇవ్వండి" అంది వ్యానిటీ బ్యాగ్‌లో చెయ్యి పెడుతూ.

ఫణీంద్ర గిఫ్ట్‌గా కొనిచ్చిన వ్యానిటీ బ్యాగ్ అది.

"మీరేదో జోక్ చేస్తున్నట్టున్నారు. ఇక్కడ లాంటివేం దొరకవు మాడమ్" ఎందుకొచ్చిన రిస్కులెమ్మని బుకాయింపుగా అన్నాడు షాప తను.

"డోంట్ బ్లఫ్! మీదగ్గర దొరుకుతాయని మీ కస్టమర్స్ కొందరు చెప్పార్లెండి" అంటూ బ్యాగ్‌లోంచి ఓ వందరూపాయల నోట్లకట్టని బైటకి తీసింది రంభ.

దాన్ని చూడగానే షాపతని కళ్ళు ఆటోమాటిగ్గా మెరిశాయి. పోనీ ఇచ్చేస్తేనో? అనుకున్నాడు కానీ... ఎందుకైనా మంచిదని "లేవు మాడమ్" అనేశాడు మళ్ళీ.

"అదేంటీ! రావుగారు మీ షాపులోనే కొన్నార్ట, చెప్పారే! అసలు నన్నిపుడు పంపించింది కూడా ఆయనే" అంటూ ఓ రాయి విసిరింది రంభ.

"ఏ రావుగారూ?" అన్నాడు షాపువాడు తన వయాగ్రా కస్టమర్లందర్నీ గుర్తుకు తెచ్చుకుంటూ.

"పెద్ద తెలియనట్టు..." అంటూ ముసిముసిగా నవ్వింది రంభ.

ఆ నవ్వుకి ఐసైపోయి "జె.ఆర్. రావుగారేనా?" అన్నాడు షాపతను. తన షాపులో అందరికన్నా ఎక్కువగా 'వయాగ్రా'లు కొనేది ఆయనే కాబట్టి.

"అవునాయనే" అంది రంభ సిగ్గుగా తల దించుకుంటూ. కాబోయే హీరోయిన్‌కి ఆ పాటి నటన రాకుండా ఎలా ఉంటుంది?

"రావుగారు మీకేమవుతారు?" కుతూహలంగా చూశాడు షాపతను.

"ఛీ పాడు" అంటూ మరింత సిగ్గును అభినయించింది రంభ.

దాంతో విషయమంతా అర్థమైపోయినట్టనిపించి, "ఈచ్ థౌజండ్ రూపీస్ మాడమ్" అనేశాడు షాపతను. తనవద్ద వయాగ్రా ఉన్న విషయాన్ని అంగీకరించేస్తూ.

'అమౌంట్‌దేముందీ? పనిజరగడం కదా ముఖ్యం?' అనుకుని "సర్లే రెండివ్వండి" అంటూ కట్టలోంచి రెండువేలు తీసి అతని కందించింది రంభ.

"పదీ తీస్కోండి మాడమ్. ఇప్పట్లో మళ్ళీ స్టాక్ రావు" అన్నాడు షాపతను ఆశగా.

"అక్కర్లేదు. రెండివ్వండి చాలు" అనేసింది రంభ పొడిగా.

అన్నాక ఆమె మిగతా పైకాన్ని బ్యాగ్‌లో పెట్టేసుకోవడంతో "సరే మాడమ్" అనేశాడు షాపతను.

★ ★ ★

రంభ మెడికల్ షాపునుండి ఇంటికిలా వచ్చిందో లేదో అనగా ఇంట్లో ఇలా ప్రత్యక్షమయ్యిందో లేదో...

"ట్రింగ్... ట్రింగ్..." మంటూ ఫోన్ మోగింది.

బ్యాంకునుండి ఫణీంద్రో, ప్రభాకరో కావచ్చనుకుంటూ వెళ్ళి ఫోన్ తీస్తే... అవతల డైరెక్టర్ వెంకన్న.

ఈ కొత్త ఇంటికి షిఫ్ట్ అయిన వెంటనే ఆయనకు ఫోన్‌చేసి తన అడ్రస్ మార్పిడి గురించీ, తనకు కొత్తగా ఏర్పడిన ఫోన్ సదుపాయం గురించీ చెప్పే ఉన్నందున ఆయన్నుండి ఫోన్ రావడం పెద్ద ఆశ్చర్యంగా అనిపించలేదు రంభకి.

ఒక హీరోయిన్ ఇంటికి ఒక దర్శకుడు ఫోన్ చేయడం క్వయిట్ కామన్‌కదా! అనుకుంది పైగా.

"నమస్తే సార్! నేను రంభశ్రీని... ఏంటి విశేషం?" అనడిగింది మామూలుగా.

పిక్చర్ ప్రారంభోత్సవం గురించి ఏమైనా చెబుతాడనుకుంటే అవతల్నుండి ఓ బాంబు పేల్చాడు.

ఆయన చెప్పింది విని నిలువెల్లా వణికిపోయింది రంభ!

"సార్! ఏంటి సార్ మీరంటోంది?" అంది రంభ గాబరాగా.

"అవునమ్మా... అనుకోకుండా ఆ ప్రాజెక్ట్‌ని కాన్సిల్ చేసుకోవాల్సి వచ్చింది. నీకీ విషయాన్ని చెప్పడానికి బాధగా వున్నా చెప్పక తప్పడంలేదు. లేకుంటే నువ్వింకా అలాగే ఆశ పెట్టుకుని ఉంటావుగదా! నిన్నంత ఘోరంగా డిజప్పాయింట్ చెయ్యాల్సి వచ్చినందుకు అయామ్ వెరీ వెరీ సారీ..."

ఆయనెంతో బాధగా అలా అంటుంటే వెక్కివెక్కి ఏడ్చేయాలనిపించింది రంభకి.

అనిపించడంకాదు. నిజంగానే ఏడుపు ఎగదన్నుకొచ్చేసింది.

ఆమె వెక్కిళ్ళు పెడుతుండడం గమనించి "అరె... ఏడుస్తున్నావా? ఊరుకోమ్మా... ప్రస్తుతానికి ప్రాజెక్ట్ డ్రాపైపోయినా, ఆ తర్వాత ఎప్పుడైనా నీకు తప్పకుండా అవకాశమిస్తాలే" అన్నాడు ఆమెను ఓదార్చేందుకు ప్రయత్నిస్తూ.

అంతమాత్రానికే ఉపశమించే దుఃఖమా రంభకొచ్చింది?

"అసలీ సినిమా ఎందుకు వాయిదాపడి పోయింది సార్?" అనడిగింది చిన్నగా ఏడుస్తూ.

"వాయిదా పడ్డం కాదమ్మా! ఈ ప్రోజెక్ట్ పూర్తిగా వైండప్ అయిపోయినట్టే" బాధగా చెప్పాడు వెంకన్న.

"అదే అడుగుతున్నాను సార్! ఎందుకని అలా జరిగింది?" ముక్కు చీదుతూ మూలిగినట్టుగా ప్రశ్నించింది రంభ.

"...."

"చెప్పండి సార్! మిమ్మల్నే అడుగుతూంట!" ఏమని చెప్పగలడు?

అనేకానేక సినిమాలు అనేకానేక కారణాలవల్ల మధ్యలో ఆగిపోతుంటాయ్? కొన్ని కొన్ని సినిమాలు నిర్మాణం పూర్తయ్యాక కూడా రిలీజ్‌కి నోచుకోవు. పరిశ్రమకు పూర్తిగా కొత్తదైన రంభకు ఈ విషయాలన్నీ ఎలా తెలుస్తాయి.

ఆమాటే అన్నాడు వెంకన్న. "నువ్ కొత్త కాబట్టి ఇలా అడగ్గలుగుతున్నావమ్మా! ఒక సినిమా ఆగిపోవటానికి ఎన్నెన్నో కారణాలుంటాయి. అవన్నీ నీకు చెప్పినా అర్థం కావులేగానీ మనసు దిటవు చేసుకో"

"మరి నాకిచ్చిన అడ్వాన్సు!" అడిగింది రంభ ఏడుపు నాపుకోవడానికి ప్రయత్నిస్తూ.

"నెక్స్ పిక్చర్‌లో నీకేదోక వేషం ఇస్తానంటున్నాగా అందులో అడ్జస్ట్ చేసుకోవచ్చులే" రంభను ఊరడించాలని అలా అన్నాడు వెంకన్న.

కానీ రంభ ఊరడిల్లలేదు.

"ఏదోక వేషమంటున్నారు, అంటే నెక్స్ ఫిల్మ్‌లో నేను హీరోయిన్‌ని కానా?" అంది మళ్లీ ఏడ్చేస్తూ.

"కావచ్చా కాకపోనూవచ్చు. ఆ విషయం ఇప్పుడే ఎలా చెప్పగలనమ్మా? అది నాకు దొరికే కథనుబట్టి ఉంటుంది. శ్యామలా ఆర్ట్స్ వాళ్లకి నెక్స్ పిక్చర్ చెయ్యాలి నేను. కథ ఇంకా దొరకలా"

రంభకాయన మాటలు సరిగ్గా అర్థం కాలేదు.

"అదేంటి సార్! మరో కథ రెడీగా లేదా అయితే?" అంది ఆశ్చర్యంగా.

"ప్రస్తుతానికైతే రెడిగా ఏం లేదమ్మా" నిట్టూరుస్తూ అన్నాడు వెంకన్న.

"అదెంత పని సార్! నేను హీరోయిన్‌గా సూటయ్యే ఏదో ఒక కథ ఇవ్వాళ రాత్రికి రాసేయొచ్చుగా?" అమాయకంగా అంది రంభ.

ఆమె అమాయకత్వానికి నవ్వాలో ఏడ్వాలో అర్థం కాలేదు వెంకన్నకు.

"ఇట్స్ నాట్ సో ఈజీ! ఏ సినిమాకైనా కథే ఊపిరి. అలాంటిది ఒక్క రాత్రిలో కథ రాసిపారేయడం ఎలా వీలవుతుంది? ఏదైనా మంచి పాయింట్ తట్టే వరకూ ఆగాలి" అన్నాడు జాలిగా.

"పోనీ నన్నేదయినా కథాలోచించమంటారా?"

రంభ ఎంతో ఆశగా అలా అడుగుతుంటే నవ్వొచ్చేసింది వెంకన్నకు.

అయినా తమాయించుకుని "ఆలోచించగలిగితే మంచిదే" అనేశాడు. ఎదుటి మనిషిని పూర్తిగా డిస్కరేజ్ చెయ్యడం ఇష్టంలేక అలా అన్నాడే తప్ప నిజంగానే రంభ ఏదో కథాలోచించగలుగుతున్నదన్న నమ్మకంతో కాదు.




మహా మహా రచయితలే కొత్త సబ్జెక్టుల కోసం కొట్టుకు అల్లాడిపోతున్నారు. మెదళ్లు చించేసుకుంటున్నారు. కళ్లు ఊడిపడిపోయేటంత ఇదిగా అన్యభాషా చిత్రాల క్యాసెట్లు చూసేస్తున్నారు. అలాంటిది ఏమాత్రం అనుభవం లేని ఒక కొత్త అమ్మాయి సినిమాకి కథ ఏం ఆలోచించగలుగుతుంది?

వెంకన్న మనసులో అలా అనుకుంటున్నాడని రంభకేం తెలుసు?

అందుకే...

"మీరు పర్మిషన్ ఇచ్చారుగా! ఇంక చూస్కోండి సార్! రేపీపాటికల్లా ఒక మంచి కథతో మీ ముందుంటాను" అని ఎంతో ఉత్సాహంగా అంది రంభ.

నీ మొహంలే అనే నాలుగక్షరాల్ని మనసులో అనుకుని "సరే ట్రై చెయ్" అని ఫోన్ పెట్టేశాడు వెంకన్న.

ట్రై చేయడానికిందులో అలవి కానిదేముంది. ఓ అరగంటసేపు కళ్లు మూసుకుని ఆలోచిస్తే ఏదోక కథ రెడీ కాకపోతుందా? అనుకుంది రంభ.

అనుకున్నాక అలాగే కళ్లు మూసుకుని అరగంటేం ఖర్మ ముప్పావుగంట సేపు ఏకధాటిగా ఆలోచించింది రంభ

అయినా సరే కథకేమీ అయిడియా రాలేదు. దాంతో సినిమాకి కథ ఆలోచించడం స్వర్గంలో డ్యాన్స్ చేసినంత ఈజీకాదు అనుకుందామె.

అనుకుని భారంగా కళ్లు తెరిచేసరికి ఎదురుగా మిత్రద్వయం కనిపించారు.

"మీరా! ఎంత సేపైంది వచ్చి?" అని రంభ అంటుంటే,

"ఇప్పుడేలేగానీ అదేంటి నీ కళ్లలా ఎర్రగా ఉన్నాయ్?" అని వర్రీగా అడిగాడు ఫణీంద్ర.

"ఇంతకుముందు చాలా సేపు ఏడ్చాన్లే.. అందుకు" అంది రంభ.

తన ఉడ్‌బీ చాలా సేపు ఏడ్చిందని వింటుంటే ఏ మగాడి మనసు ఏడ్వకుండా ఉంటుంది?

"చాలా సేపు ఏడ్చావా? ఎందుకూ?" అని గాభరాగా అడిగాడు ఫణీంద్ర మనసు రోదిస్తుండగా.

"రేపొద్దున్న సినిమాలో ఏడుపు సీన్సులో పనికొస్తుందని ప్రాక్టీస్ చేశారేమోలే, ఏం రంభగారూ అంతేనా?" తగుదునమ్మా అంటూ తనూ ఓ మాట అన్నాడు ప్రభాకర్.

"అదేంకాదు. నిజంగానే ఏడ్చాను" మళ్లీ ఏడుపు ముఖం పెట్టేస్తూ అంది రంభ.

గుండె మీద రోడ్‌రోలర్‌ని ఎక్కించినంత బాధగా అనిపించింది ఫణీంద్రకి ఆమె అలా ఏడుపు ముఖం పెట్టేసరికి.

"నిజంగానే ఏడ్చావా ఎందుకూ?" అన్నాడు మనసులో మరింతగా రోదిస్తూ.

అతని మనోరోదన రంభకు వినిపించలేదుగానీ లేకుంటే ఎంత ప్రేమ? అని మురిసిపోయుండేదే!

"చెప్పు రంభా! ఎందుకేడ్చావ్ నిజంగా?"

ఫణీంద్ర మళ్లీ అలా రెట్టించి అడిగేసరికి తన ఇష్ట సఖుడంతటి ప్రేమని ప్రదర్శిస్తుండేసరికి భోరున ఏడ్చేస్తూ మిత్రద్వయానికి సంగతంతా వివరంగా చెప్పుకొచ్చింది రంభ.

"ఎంత ఘోరం జరిగిపోయింది. ఊరుకో రంభా ఊరుకో" అన్నాడు ఫణీంద్ర విషయం విన్నాక.

ఏడుస్తున్నది మిత్రుడి ప్రేయసి గదా అందుకే ప్రభాకర్‌కేం బాధగా అనిపించలేదు.

"ఇంకా నయం. ఇచ్చిన అడ్వాన్స్ వెనక్కిచ్చేయమన్లేదు. అలాగనుక అడిగుంటే చచ్చుండేవాళ్లమే" అన్నాడు పుసుక్కున.

అతని మాటలకి చిర్రెత్తుకొచ్చింది ఫణీంద్రకి.

"అసలిదంతా నీ ఏడుపు వల్లే జరిగింది. ముందు నుంచీ అశుభం పలుకుతూనే వచ్చావ్. అందుకే ఇలా వచ్చిన అవకాశం

కాస్తా వెనక్కెళ్లిపోయింది" అన్నాడు దాదాపుగా పళ్లునూర్తూ.

"ఇది మరీ బాగుంది. మధ్యలో నన్నంటావేం? " అంటూ గుర్రుగా చూశాడు ప్రభాకర్.

"నిన్నుగాక ఇంకెవర్నన్నాన్రా? నీ ఏడుపు తగిల్తే" రొప్పుతూ ఫణీంద్ర ఇంకా ఏదో అనబోతుంటే చటుక్కున అతని నోరు మూసేసింది రంభ.

"అనవసరంగా మీరిద్దరూ కీచులాడుకోకండి. నా అదృష్టం బాగోక అలా జరిగిందంతే! నెక్స్ట్ మనమేం చెయ్యాలో అదాలోచించండి ముందు"

"ఏముంది చెయ్యడానికి! మీరన్నట్టే మనమే ఓ కథాలోచించి రేపాయనకి చెప్తే సరి" అన్నాడు ప్రభాకర్.

తన నోటిమీంచి రంభ చేతిని తప్పించి "అదంత తేలికా? " అన్నాడు ఫణీంద్ర. అతని చూపులో ఇంకా కోపం తాండవిస్తూనే ఉంది.

"తేలిక్కాకపోవచ్చుగానీ అసాధ్యమైతే కాదు" మిత్రుడి కోపపు చూపుని కేర్ చెయ్యకుండా కూల్‌గా అన్నాడు ప్రభాకర్.

రంభ అతని వంక అదోలా చూసి అంది. "ఏమో ప్రభాకర్‌గారూ! నాకు మాత్రం అసాధ్యంగానే అనిపిస్తోంది! మీరొచ్చేముందు చాలాసేపు ఆలోచించాన్నేను. అయినా ఒక్క కథ కూడా ఐడియా రాలేదు"

"సినిమా కథకి ఐడియాలు ఆలోచిస్తే రావు" అన్నాడు ప్రభాకర్.

"మరెలా వస్తాయ్? " కాస్త వెటకారంగా అడిగాడు ఫణీంద్ర.

"ఏమైనా నాలుగైదు పాత సినిమా క్యాసెట్లు చూస్తే వస్తాయ్..." జ్ఞానిలా నవ్వి చెప్పాడు ప్రభాకర్.

అతని మాటలకి కొంచెం సంతోషంగా నవ్వింది రంభ. "నిజమేనండోయ్! చాలా మంది అలానే చేస్తుంటారని నేనూ విన్నాను..." అంది చెంపలు నిమురుకుంటూ. నిజానికి నిమురుకోవటం కాదది. చెంపలమీద ఆల్రెడీ చారికలు కట్టున్న కన్నీళ్లని తడుముకోవటం!

"అంటే కాపీ కథ తయారు చెయ్యాలా? " అన్నాడు ఫణీంద్ర అయోమయంగా.

"దాన్ని కాపీ చెయ్యడం అనరు. ప్రేరణ పొందటం అంటారు. నీకిలాంటివన్నీ తెలియవుగానీ సినిమాకి కథ తయారుచేసే బాధ్యతని నా కొదిలేయ్" అన్నాడు ప్రభాకర్.

దాంతో అతనిమీద కోపం ఒకింత ఉపశమించింది ఫణీంద్రకి.

"నిజంగానే అంటున్నావా? నిజంగానే నువ్ సినిమాకి కథ తయారు చెయ్యగలవా? " అన్నాడు ఆశగా.

"ఇంతకుముందు అనుభవమైతే లేదు గానీ... తల్చుకుంటే చెయ్యగలననే అనిపిస్తూ ఉంది" అన్నాడు ప్రభాకర్ గోడమీద పిల్లివాటంగా.

"అయితే చెయ్యి..." అంటూ అతని చేతులు రెండూ గట్టిగా పట్టుకున్నాడు ఫణీంద్ర.

"ఓకే... బట్ ఆన్ వన్ కండిషన్" అప్పుడే పెద్ద సినిమా రచయిత అయిపోయినట్టు పోజిస్తూ అన్నాడు ప్రభాకర్.

"ఏంటది? " సంయుక్తంగా అడిగారు ఉడ్‌బీలిద్దరూ.

"రాత్రంతా మీరు కూడా నాతోపాటు మెలుకువగా ఉండి క్యాసెట్లు చూడాలి. నాతోపాటు డిస్కషన్స్‌లో పాలుపంచుకోవాలి"

'అంటే మేం ప్రేమ కబుర్లు చెప్పుకోకూడదనేగా నీ కుట్ర? కుళ్లుమోతు వెధవా!' అని మనసులో అనుకుని.. "సరే" అన్నాడు ఫణీంద్ర.

రంభ మాత్రం అలాంటి వంకరాలోచనలేం చెయ్యలేదు. "దాందేముంది ప్రభాకర్ గారూ! తప్పకుండాను" అనేసింది తేలిగ్గా.

పర్యవసానంగా ఆ రాత్రి వాళ్ళు ముగ్గురికీ నిద్రలేకుండా పోయింది.

అయితేనేం...?

తెలతెలవారుతుండగా మొత్తానికో సినిమా కథని తయారుచేయగలిగాడు ప్రభాకర్.

వయాగ్రా టాబ్లెట్లు రంభ బ్యాగ్‌లో పదిలంగా ఉండిపోయినై!

★ ★ ★

మర్నాడు బావలిద్దరిచేతా బ్యాంకుకి శెలవు పెట్టించి వాళ్ళిద్దర్నీ వెంటబెట్టుకుని వెంకన్నవద్దకెళ్ళింది రంభ!

సర్లే ఏ పుట్టలో ఏ పాముంటుందో ఎవరికి తెలుసు?' అన్న ఉద్దేశ్యంతో వాళ్ళని ఎంటర్‌టెయిన్ చేశాడు వెంకన్న.

పరస్పర పరిచయాలయ్యాక ప్రభాకర్ కథ చెప్పటం ప్రారంభించాడు.

వెంకన్న శ్రద్ధగా ఆలకించసాగాడు.

హావభావాల్ని అవసరమైనదానికన్నా ఎక్కువగానే వ్యక్తం చేస్తూ, చేతుల్ని అటూ ఇటూ ఊగాడిస్తూ ప్రభాకర్ సీరియస్‌గా కథ చెబుతుంటే 'పర్లేదే... సినీ రైటర్‌గా షైనయ్యే లక్షణాలు బానే ఉన్నాయ్' అనిపించింది వెంకన్నకు.

అదీగాక ఇక్కడ 'కట్' ఇక్కడ 'ఫ్రీజ్' అంటూ ప్రభాకర్ కథ చెబుతున్న తీరు కూడా చాలా ఇంప్రెసివ్‌గానే అనిపించిందాయనకి.

నిజం చెప్పాలంటే డైరెక్ట్‌గా ఒక సినిమాని చూస్తున్న అనుభూతి కలిగేంత గొప్పగా చెప్పాడు ప్రభాకర్ కథ.

వింటున్నంతసేపూ ఎలాంటి కామెంట్ కూడా చెయ్యలేదు వెంకన్న. జస్ట్ 'ఊ' కొడుతూ కూర్చున్నాడంతే!

"ఇక్కడ ఇంటర్‌వెల్" అని ప్రభాకర్ అన్నప్పుడు మాత్రం "ఓహో... బాగుంది" అని మాత్రం అన్నాడాయన.

దరిమిలా ప్రభాకర్ మిగతా కథంతా చెప్పుకొచ్చి "... హీరోహీరోయిన్లు ఒకరి కౌగిల్లో ఒకరు ఒదిగిపోతారు. ఫ్రీజ్ చేసి 'శుభం' కార్డ్‌వేస్తాం" అని ముగించి "ఎలా ఉంది సార్?" అనడిగాడు ఫైనల్‌గా.

దానికి బదులుగా "మనసే మందిరం, మంచి మనసులు, గంగ-మంగ, కలిసి ఉంటే కలదు సుఖం" అన్నాడు వెంకన్న.

అది విని స్టన్నైపోయారు ముగ్గురూ.

"అవునా?" అన్నాడు వెంకన్న చిన్నగా నవ్వుతూ.

"అవున్సార్! ఆ నాలుగు క్యాసెట్లు చూసే కథ తయారుచేశాం..." అన్నాడు ప్రభాకర్ బిడియంగా తలదించుకుంటూ.

"ఏం తప్పా సార్?" అంది రంభ కళ్ళెగరేస్తూ.

"ఇండస్ట్రీలో కొంతమందికి ఇది తప్పుకాకపోవచ్చు ఇలాంటి కథలు తయారుచేసే రైటర్లిక్కడ కోకొల్లలు. నా వరకైతే...' ఐ వాంట్ ఎ ఫ్రెష్ థాట్! మీ దగ్గర మీదైన కొత్త కథేమైనా ఉంటే చెప్పండి" అన్నాడు వెంకన్న నవ్వేస్తూ.

తాతకు దగ్గు నేర్పబోయిన తన అజ్ఞానానికి చాలా సిగ్గుగా అనిపించింది ప్రభాకర్‌కి.

"సారీ సార్! బేసికల్‌గా నేనేం రైటర్‌ని కాను. కానీ మా మరదలు రంభ 'అర్జంట్' అనేసరికి రాత్రికి రాత్రి ఇలా ఈ కథని తయారుచేశానంతే!" అన్నాడు చేతులు నలుపుకుంటూ.

"ఇట్సోకే! నీలో కథ చెప్పగలిగే నేర్పు బాగానే ఉంది! నీదైన ఐడియాలతో ముందుకొస్తే నువ్ డెఫినిట్‌గా రాణిస్తావ్! ఐ విష్ యూ ఆల్ సక్సెస్..." ప్రభాకర్‌ని ఆశీర్వదిస్తూ అన్నాడు వెంకన్న.

అంత పెద్ద దర్శకుడినుండి ఆపాటి కాంప్లిమెంట్ చాలదూ ఒక సాధారణమైన వ్యక్తి మురిసిపోవడానికి?

"థాంక్యూ సార్" అన్నాడు ప్రభాకర్ మెలికలు తిరిగిపోతూ.

వెంకన్న చిన్నగా అతని భుజం తట్టి ఊరుకున్నాడు.

అంతలో రంభ అడిగింది "అద్సరే...



ఇంతకీ మన పిక్చర్ ఎందుకాగిపోయినట్టు సార్? "

"చెప్పానుగా అమ్మా! సవాలక్ష కారణా లుంటాయని..." క్రాపు సరిజేసుకుంటూ చెప్పాడు వెంకన్న. "ఆ సిన్మా తీద్దామను కున్న ప్రొడ్యూసర్‌కి అనుకోకుండా ఏవో ఫైనాన్షియల్ ట్రబుల్స్ వచ్చిపడ్డాయి. దాంతో డ్రాప్ అయిపోయాడు..."

"పోనీ అదే సబ్జెక్టుతో మీరే సొంతంగా తియ్యొచ్చుగా సార్? "

"వచ్చు... కానీ నా సొంత బ్యానర్‌మీద మరో కథని ఎప్పట్నుంచో అనుకుం టున్నాం. దాన్ని మార్చుకునే ఉద్దేశ్యంలేదు"

"పోనీ అందులోనే నాకు హీరోయిన్‌గా అవకాశం ఇవ్వొచ్చుగా సార్? " మరింత ఆశగా అడిగింది రంభ.

"ఆ క్యారెక్టర్‌కి నువ్ సరిపోవమ్మా!" నిర్మొహమాటంగా చెప్పేశాడు వెంకన్న.

"పోనీ సెకండ్ హీరోయిన్ క్యారెక్టర్ అయినా" నసిగింది రంభ.

"కథలో ఉన్నదే ఒక్క హీరోయిన్. సెకండ్ హీరోయిన్‌ని ఎక్కణ్ణుంచి తేను? పోనీ ఇంకేదైనా చిన్న పాత్ర ఇద్దామన్నా నీకు సరిపోయేదేదీ లేదు..."

"పోనీ ఆ శ్యామలా ఆర్ట్స్ వాళ్ళకే ఇంత కుముందనుకున్న ఆ కథని తియ్యొచ్చుగా? "

"ఆ కథ ఆ ప్రొడ్యూసర్‌కి నచ్చలేదు. సో... ఆ ప్రశ్నేలేదు"

వెంకన్న పెదవివిరిచి అలా అంటుంటే ఆయన్ను మరింత విసిగించే సాహసం చేయలేకపోయింది రంభ.

"మరైతే మమ్మల్ని మళ్ళీ ఎప్పుడు కలు సుకోమంటారు సార్? " అడిగింది విన యంగా.

"సమయం వచ్చినపుడు నేనే కబురు చేస్తాను. ఈలోగా కావాలంటే నువ్ ఇతర ప్రయత్నాలేమైనా చేస్కోవచ్చు" అన్నాడు వెంకన్న.

సరే... లెమ్మని అక్కడ్నుంచి వచ్చేశారు వాళ్లు ముగ్గురూ.

★ ★ ★

"ఇతర ప్రయత్నాలేమైనా చేస్కోవచ్చని వెంకన్నగారన్నారుగా! మనం ఇంకెవర్నేనా కన్సల్ట్ చేస్తే ఎలా ఉంటుంది? " అన్నాడు ఫణీంద్ర ఆటోలో ఇంటికొస్తుండగా.

వెంకన్నగారి సమక్షంలో అతనసలు నోరే విప్పని సంగతి గుర్తుకొచ్చి "మీవల్ల అవు తుందా అది? " అంది రంభ.

"ఏది? " అన్నాడు ఫణీంద్ర.

"నా గురించి మరో డైరెక్టర్‌తో చెప్పటం" అంది రంభ.

"దాందేముందీ! అపాయింట్‌మెంట్ తీసు కుని ట్రైచేద్దాం" అన్నాడు ఫణీంద్ర.

"ఎలా? " అడిగాడు ప్రభాకర్ కల్పించు కుంటూ.

"మన బ్యాంక్ కస్టమర్ శ్రీమన్నారాయణ ఫిల్మ్ ఫైనాన్సియరే కదా! ఆయన ద్వారా డైరెక్టర్ శర్మతో ట్రై చేద్దాం. మనం నోరు తెరిచి అడగాలేగానీ ఆపాటి అపా యింట్‌మెంట్ ఇప్పించలేకపోతాడా? "

ఫణీంద్ర అలా అనేసరికి ఇదేదో బానే ఉన్నట్టుందే అనిపించింది ప్రభాకర్‌కి.

శ్రీమన్నారాయణ వీళ్ళిద్దరికీ కాస్త క్లోజే!

అందుకే అదేమాట పైక్యూడా అన్నాడు "నువ్ చెప్పింది బానే ఉంది. రేపే ట్రై చేద్దాం అయితే"

"రేపటిదాకా ఎందుకు? ఇవ్వాళ ట్రై చేస్తే పోలా? " ఆశగా అంది రంభ.

"లేడికి లేచిందే పరుగంటే ఎలా? కాస్త ఓపికపట్టు" కాస్త విసుగ్గా అన్నాడు ఫణీంద్ర.

"అది కాదు ఫణీ..." అని ఏదో చెప్ప బోయి ఆగిపోయింది రంభ.

"కొన్ని కొన్ని విషయాల్లో వేగిరపాటు తగదు"

ఫణీంద్ర అలా అనేసరికి పూర్తిగా మిన్న కుండిపోయింది.

★ ★ ★

ఆ రాత్రి షరా మామూలుగా "స్వీట్ నథింగ్స్ చెప్పుకుందామా?" అంటూ ఫణీంద్ర తన గదిలోకి రాగా "వద్దులే" అని ముసుగుతన్ని పడుకుండిపోయింది రంభ.

అవును మరి...

హీరోయిన్ ఛాన్స్ వచ్చినట్టే వచ్చిపోయిందామెకి. మరో ఛాన్స్ ఇంతలో వస్తుందో రాదో ఎవరికి తెలుసు?

"తానిక్కడ శాశ్వతంగా ఉండబోయేది హీరోయిన్ ఛాన్స్ వస్తేనే కదా?

ఒకవేళ రాకపోతే తానెలాగూ స్వర్గానికి తిరిగి వెళ్ళిపోవాలి తప్పదు.

అలాంటప్పుడు అనవసరంగా అతన్లో ఆశలు రేపటం దేనికి? ఇప్పటికే ఆల్రెడీ రేపేసింది తను. వాటిని ఇంకా పెంపొందించటం దేనికి?

తన అదృష్టం బాగుందికాబట్టి అతనిమీద వయాగ్రాని ప్రయోగించకముందే హీరోయిన్ ఛాన్స్ మిస్ అయిన సంగతి తెలిసిపోయింది తనకి.

అలా కాకుండా వేరొకలా జరిగుంటే ఈ పాటికి అతనికి తన సర్వస్వాన్నీ అర్పించేసి స్వర్గభ్రష్టత్వం పొందేసి ఉండేది తను!

హీరోయిన్ కాలేకపోయినప్పుడు అనవసరంగా స్వర్గభ్రష్టత్వం పొంది ఈ కోన్‌కిస్కాగాడికి భార్యగా ఈ భూలోకంలో పడుండటం ఎంత వేస్టు?'

ఆమె మనసులో ఉన్నది ఇదని ఫణీంద్రకేం తెలుసు? అసలామె అసలైన రంభన్న విషయం కూడా అతనికి తెలీదు గదా!

అందుకే ఆమె అలా ముసుగు తన్నేసేసరికి విలవిల్లాడిపోయాడు తను.

"నామీద కోపమా?" అన్నాడామె ముసుగుని తొలగించటానికి ప్రయత్నిస్తూ.

"అదేం లేదు. నా మూడేం బాలేదు. వెళ్లిపో..." చిరాగ్గా అంది రంభ.

అప్పటికీ ఆమెను వదల్లేదు ఫణీంద్ర.

తానై వలచివచ్చిన ఆడదాన్ని చులకన చేస్తే ఆమెకు కోపం రాదేమిటీ? అనుకున్నాడు.

అదే ఆమె కోపానికి కారణంగా ఎంచి, "సారీ డియర్ ఇవ్వాళ నిన్ను డిసప్పాయింట్ చెయ్యను. రోజూలా నీతివాక్యాలు చెప్పను. నువ్వన్నదే నిజం. ఎలాగూ పెళ్ళి చేస్కోబోయేవాళ్ళమేగా! కమాన్..." అంటూ ఆమెను అక్కున చేర్చుకోబోయాడు.

'ఓరీ అక్కుపక్షి వెధవా?' అనుకుంది రంభ కోపంగా.

తుక్కురేగతన్నాలన్నంత కోపమొచ్చింది గాని అయినా తమాయించుకుంది.

ఇన్నాళ్లూ అతనికా చనువిచ్చింది తనేగా?

అందుకే అతన్ని క్షమించేస్తూ 'అదేం వద్దులే... నువ్వన్నట్టు పెళ్లయ్యేదాకా, పవిత్రంగానే ఉందాంలే" అంది అతన్ని నెట్టేస్తూ.

అయినా వదల్లేదు ఫణీంద్ర. "కాదులే కాదులే..." అంటూ మళ్లీ ఆమెను అల్లుకోబోయాడు.

ఆ స్పీడూ అదీ చూసి, కొంపదీసి వయాగ్రా టాబ్లెట్లు ఎక్కడన్నా పడిపోతే ఇతనిగ్గాని దొరికితే మింగేశాడా? అన్న డౌటొచ్చింది రంభకి.

ఇందాకేగా తను వాటిని పదిలంగా అటకమీద ఓ రహస్య ప్రదేశంలో దాచిపెడత?

సో... అదయ్యుండదులే అనుకుని "చెప్పేది నీకే! నా కిష్టంలేదంటున్నాగా! వదులు!" అంది కోపంగా.

అది నిజం కోపమేనని గ్రహించి చటుక్కున ఆమెను వదిలేశాడు ఫణీంద్ర.

"సారీ రంభా! రోజూ నువ్ ముచ్చటపడుతున్నావని ఇవ్వాళ నేను తొందరపడబోయానంతే. అయామ్ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ..." అన్నాడామె చుబుకం పుచ్చుకుంటూ.

"ఇట్సోకే... ఇంక వెళ్ళి పడుకో..." అని మళ్ళీ ముసుగు కప్పేసుకుంది రంభ.

దాంతో ఫణీంద్ర ఉసూరుమంటూ ప్రభాకర్ ఉన్న గదిలోకి వచ్చేశాడు.



గోరుచుట్టుమీద రోకటిపోటా అన్నట్టు అతని రాకను గుర్తించి "ఏం ఇవ్వాళ ప్రేమ కబుర్లు లేవా? " అనడిగాడు ప్రభాకర్.

మిత్రుడ్ని బాధించాలన్న ఇంటెన్షన్‌తో కాదు జస్ట్ కుతూహలంకొద్దీ అడిగాడంతే!

అయినప్పటికీ ఫణీంద్ర మనసును ఆ మాటలు ముల్లులానే తాకాయ్!

'అసలు మా ప్రేమకి నీ దిష్టే తగిలిందిరా దుష్టుడా! అందుకే ఇవ్వాళ నా దేవి ఇలా రివర్స్ అయిపోయింది' అని మనసులో అనుకుని...

"తనకి అలసటగా ఉండి నిద్రపోతానంటే వచ్చేశాను" అనేసి తన పక్కమీదకు చేరిపోయాడు.

పడుకున్నాడన్నమాటేగానీ ఒక పట్టాన్న నిద్రపట్టి చస్తేగా?

ఆ రాత్రంతా ఏవేవో పిచ్చి కలలు వచ్చాయ్ అతనికి.

★ ★ ★

'డైరెక్టర్ శర్మగారి అపాయింట్‌మెంట్



దొరికింది. రేపొద్దున్న ఎనిమిదింటికి ఈ నంబర్‌కి ఫోన్ చేసి రమ్మన్నారు' అని బ్యాంకు నుండి ఫణీంద్ర వచ్చి చెప్పేసరికి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బులయ్యింది రంభ.

ఎంతైనా తను రంభ గదా!

దేవ నర్తకీమణి కదా! ఎంత అగ్రదర్శకుడైతే మాత్రం! ఎంత దర్శకేంద్రుడైతే మాత్రం? తన అందానికి కళ్ళు చెదర కుండా ఉంటాయా? శర్మ తన అందం చూసి తప్పకుండా ఐసైపోయి తప్పకుండా అవకాశం ఇస్తాడు!

నో డవుట్ ఇన్ ఇట్!

శర్మ చిత్రంలో హీరోయిన్‌గా చేసే వాళ్ళకెప్పుడూ బ్రైట్ ఫ్యూచర్ ఉంటుంది.

జనం తనకి నీరాజనాలు పలుకుతారు?

అతి త్వరలో తను ఆంధ్రప్రేక్షకుల ఆరాధ్య నటి అయిపోవటం ఖాయం! నాటోన్లీ రంభ... మిగతా హీరోయిన్స్ అందర్నీ కూడా తలదన్నేసి నెంబర్ వన్ హీరోయిన్‌గా వెలిగిపోవటం ఖాయం!

వీలయితే హిందీ ఫీల్డ్‌లోకి కూడా ఎంటరై.

అలా ఎంతో ఆశాభావంతో ఏమేమో ఊహించేసుకుంటూ ఆమె మురిసిపోతుంటే...

ఈ మురిపెంలో రంభ మరింత అందంగా ఉంది! ఇట్టి సౌందర్య రాశికి పతి దేవుణ్ణి కాబోతున్న తన జన్మ ధన్యము! ధన్యము!! అని అనుకోకుండా ఉండలేకపోయాడు ఫణీంద్ర.

కానీ ప్రభాకర్‌కి మాత్రం ఆమె అలా మురిసిపోవటం చాలా హాస్యాస్పదంగా అనిపించింది.

అపాయింట్‌మెంట్ దొరికిందనగానే ముఖం చింకిచేటంత చేసుకుని ఎలా సంబరపడిపోతోందో? ఇల్లలగ్గానే పండగైపోయినట్టా? ఈవిడగారి ఫేసు దర్శకేంద్రుడికి నచ్చినప్పుడే కదా! ఆయన అవకాశం ఇచ్చినప్పుడు కదా? ! అనుకున్నాడు మనసులో హేళనగా.

ఆ సంగతి రంభకేం తెలుసు?

"మీరిద్దరూ కలిసి ఎంతో శ్రమపడి శర్మగారి అపాయింట్‌మెంట్ సంపాదించినందుకు చాలా థాంక్స్ ప్రభాకర్‌గారూ! రియల్లీ అయామ్ వెరీ వెరీ హ్యాపీ" అంది అతని వంకే చూస్తూ.

'దీన్లో ఈ బోడిగాడు శ్రమపడిందేముందిలే' అనుకున్నాడు ఫణీంద్ర మనసులోనే అక్కసుగా.

అంతలో ప్రభాకర్ మళ్ళీ తన నిరాశావాదాన్ని ఒలికించాడు. "అప్పుడే మరీ అంత హ్యాపీగా ఫీలైపోకండి రంభగారూ! శర్మగారు ఓకే అన్నాక అప్పుడు సంతోషించండి. సినిమా ఫీల్డ్‌లో ఏదీ కూడా అంత త్వరగా డిసైడ్ కాదు..." అన్నాడు జ్ఞానిలా తల తాటిస్తూ.

మళ్ళీ అపశకునంమాట! మండిపోయింది ఫణీంద్రకి. "నీ నోటెంట అశుభం తప్ప మంచి మాటలు రావా? " అన్నాడు కోపంగా.

"నేనేం అశుభాన్ని కోరుకోవటంలేదు. సినిమా ఇండస్ట్రీ గురించి కొంత అవగాహనున్నవాడ్ని కాబట్టి హెచ్చరిస్తున్నానంతే! వెంకన్న విషయంలో ఏమైంది? అందుకే ముందుగా ఆశలు పెంచుకోవద్దంటున్నాను" మిత్రుడి కోపాన్ని ఖాతరు చెయ్యకుండా రంభవంక చూస్తూ చెప్పాడు ప్రభాకర్.

"ఎసెస్... మీరన్నది రైటే" అతన్తో ఏకీభవిస్తున్నట్టుగా అంది రంభ.

మనసులో మాత్రం శర్మ తనకి తప్పకుండా అవకాశమిచ్చి తీర్తాడనే అనుకుంది.

ఫణీంద్ర కోపంగా ఏదో అనబోతుంటే 'నువ్ కాస్త శాంతించు' అన్నట్టతనికి కళ్లతోనే సైగ చేసింది.

ఉడ్‌బీ కనుసైగని అర్ధం చేసుకోలేని మగాడెవడుంటాడు?




సరేలెమ్మని నోరు మెదపకుండా ఉండి పోయాడు ఫణీంద్ర.



మర్నాడు ఉదయం ఎనిమిదింటికి శర్మ ఇచ్చిన నంబర్‌కి ఫోన్ చెయ్యగా, అవతల ల్నుండి ఓ పిడుగుపాటులాంటి వార్త తెలిసింది. అనుకోకుండా ఏదో అర్జంట్ పని తగిలి దర్శకేంద్రులవారు చెన్నై వెళ్లారనీ, మరో అయిదార్రోజులదాకా రారనీ చెప్పాడు ఆయన అసిస్టెంట్ ఒకాయన.

దాంతో రంభ, ఫణీంద్రలు పూర్తిగా డీలా పడిపోయారు!

"ఇంకా అయిదార్రోజులే?" అంది రంభ ఎంతో బాధగా.

"ఎంతలో గడిచిపోతాయ్‌లే..." అని ఇంకా ఏదో అనబోయాడు ఫణీంద్ర.

కానీ అంతలో ప్రభాకర్ అందుకుంటూ అన్నాడు.

"సినిమా వాళ్ళతో వ్యవహారం ఇలాగే ఉంటుంది. అందుకే నిన్న అలా అన్నాను..."

"అవునవును. నీ శనినోటితో ఏమన్నావో అచ్చం అలాగే జరిగింది" వెటకారంతో కసిని మేళవిస్తూ అన్నాడు ఫణీంద్ర.

"అంటే ఏంటి నువ్ అనేది? నేనలా అనుండకపోతే ఇవ్వాళాయన చెన్నై వెళ్లుండేవారు కాదా?" తనది శనినోరంటే ఎవరికిమాత్రం కోపం రాదు? మిత్రుడికేసి మింగేసేలా చూస్తూ అన్నాడు ప్రభాకర్.

తను గనుక జోక్యం చేసుకోకపోతే వీళ్లిద్దరూ తన్నుకుచావటం ఖాయమనిపించి, "కోపాలొద్దు... శాంతం... శాంతం..." అనరిచింది రంభ.

అరిచి ఆమె ఫణీంద్రకేసి తగ్గిపోమన్నట్టు చూడగా... అతను మంత్రముగ్ధుడిలా తల వాల్చేశాడు.

అప్పటికి ఆ వ్యవహారం అలా సద్దుమణిగింది.

మరో గంట తర్వాత మిత్రులిద్దరూ బ్యాంకుకు బయల్దేరి వెళ్ళిపోగా రంభ ఒంటరిగా కూర్చుని ఆలోచనలో పడింది.

ఎందుకిలా బెడిసికొడుతోంది వ్యవహారం?

శని చుట్టుకున్నట్టు ఇలా జరగుతోందేంటి?

నిన్నటికి నిన్న అపాయింట్‌మెంట్ ఇచ్చిన వ్యక్తి తెల్లారేసరికల్లా అంత అర్జంట్‌గా చెన్నై వెళ్ళాల్సి రావడం ఏంటి?

తన నుదుట హీరోయిన్ అయ్యే రాత గాని రాసిలేదా?

దుఃఖమనస్కురాలై ఆమె అలా పరిపరివిధాల ఆలోచిస్తుండగా.

ఎక్కడ్నుంచో సన్నటి నవ్వు వినిపించిందామెకి.

తలతిప్పి చూడగానే నారదుడు!

"మీరా?" అంది ఆశ్చర్యంగా.

"అవును తల్లీ నేనే" అంటూ గమ్మత్తుగా నవ్వాడు నారదుడు.

"ఏమిటిలా దయచేశారు? మళ్లీ దేవేంద్రులవారు ఏమైనా కబురు పంపారా?" కాస్త బెదురుగా అడిగింది రంభ.

"ఆయనేం పంపలేదులేగానీ నేనే నీకో విషయం చెప్పిపోవాలని వచ్చాను..." తన వాయిద్యాన్ని మీటుతూ చిద్విలాసంగా

నవ్వాడు నారదుడు.

ఆయన కంఠంలో ధ్వనించింది వాత్స ల్యమో, వెటకారమో అర్థం కాలేదు రంభకి.

"కూర్చోండి..." అంది సోఫా చూపిస్తూ.

కూర్చున్నాక కూల్‌గా మళ్ళీ ఓ నవ్వు నవ్వి "ఎంతదాకా వచ్చాయ్ నీ సినిమా ట్రయల్సు?" అనడిగాడు నారదుడు.

ఏం చెబుతుంది రంభ? రిజల్ట్ పోజిటి వ్‌గా ఉంటేకదా చెప్పుకోవటానికి?

"ఏదీ ఇంకా ఓ కొలిక్కి రాలేదు..." అనే సింది పొడిగా.

"నారాయణ నారాయణ. ఇన్నాళ్ళుగా ప్రయత్నిస్తుంటే ఇంకా ఓ కొలిక్కి రాకపో వటం ఏంటి?" అన్నాడు నారదుడు ఉత్తుత్తి విస్మయాన్ని నటిస్తూ.

యుగయుగాలనుండి ఆయన్ను చూస్తూ వస్తున్న మనిషాయె! ఏ సందర్భంలో ఆయన ముఖకవళికలెలా ఉంటాయో రంభకాపాటి తెలియదా? ఇట్టే అర్థమైపో యిందామెకి ఆయనేదో దాస్తున్నాడని.

"ఏమైంది నారదా! దేవేంద్రులవారు నా మీదేదైనా కుట్రగాని పన్నారా?" అనడిగింది ఆందోళనగా.

"కుట్రంటే కుట్రకాదుగానీ కుట్రలాంటిదే అమ్మా..." అన్నాడు నారదుడు.

"అంటే?" అంటూ కళ్ళెగరేసింది రంభ.

"దేవేంద్రులవారు స్వర్గలోకంలో నీ ప్లేస్‌లో టెంపరరీగా సిల్క్‌స్మితని అపా యింట్ చేశారు"

"అయితే?" అని మళ్ళీ కళ్ళెగరేసింది రంభ.

"అయితే నేనింక తిరిగిరానని ఆయన కూడా డిసైడ్ చేసేసుకున్నారన్నమాట?" అంది తనే మళ్ళీ.

"లేదమ్మా నిన్నెలాగైనా సరే తిరిగి రప్పిం చాలనే ఆయన ప్రయత్నిస్తున్నారు..." సోఫాలో వెనక్కొరిగి కాలుమీద కాలేసుక్కూ ర్చుంటూ చెప్పాడు నారదుడు.



"అవసరమైతే నేను స్వర్గభ్రష్టత్వాన్నైనా పొందుతానే తప్ప తిరిగొచ్చే ప్రశ్నేలేదని చెప్పానుగా! మీరు చెప్పలేదా ఈ విషయం ఆయన్తో?" ముక్కెగబీలుస్తూ అడిగింది రంభ.

"చెప్పాను తల్లీ... అది విన్నాకనే ఆయనో కుయుక్తి ఆలోచించాడు..."

"కుయుక్తా...? ఏమిటి నారదా అది?"

"నీ సినీప్రయత్నాలేమీ ఫలించకుండా అడ్డుతగలమని ఆయన వెళ్ళి విఘ్నేశ్వ రుడ్ని రిక్వెస్ట్ చేశాడు. తత్ఫలితంగానే నీకి ప్పుడు విఘ్నాలు ఏర్పడుతున్నాయ్..."

నారదుడు చెప్పింది విని హతాశురాలైంది రంభ!

స్వయంగా విఘ్నేశ్వరుడే పూనుకుని విఘ్నాలు కలిగిస్తుంటే ఇంక వాటిని ఆపటం ఎవరితరం?

సో... అయిపోయింది. అంతా అయిపో యింది! తన • ఆశలన్నీ అడియాసలైపో యినై!

రంభ ముఖంనిండా కారుమేఘాలలుము కున్నాయ్.

అది చూసి లోలోన సంతోషిస్తూనే పైకి మాత్రం జాలొలకబోశాడు నారదుడు. "అదమ్మా సంగతి, కాబట్టింక నువ్వెన్ని ప్రయత్నాలు చేసినా వేస్టే..." అన్నాడు గాల్లోకి చూస్తూ.

"అంటే నన్ను తిరిగొచ్చేయమని మీ సెలవా?" బాధని దిగమింగుకోవడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ అడిగింది రంభ.

"తిరిగొచ్చేస్తే నీకే మంచిదమ్మా! తొందర పడి స్వర్గభ్రష్టత్వాన్నిగాని పొందేవో, రెంటి కీచెడ్డ రేవడి చందం అవుతుంది నీ బ్రతుకు. బాగా ఆలోచించుకో..." హితవు పలికాడు నారదుడు.

కుట్రలో తనకింత అపకారాన్ని తలపె ట్టిన దేవేంద్రుడ్ని క్షమించబుద్ధి కాలేదు రంభకి. ఏ ప్రయోజనాన్నాశించి ఆయనీ పని చేశాడో అది నెరవేరకుండా చేస్తేనే తప్ప ఆయనమీద తన కసి తీరదనిపించిం

దామెకి.

"మీరెన్నయినా చెప్పండి నారదా! నేను మాత్రం ఇంక చచ్చినా స్వర్గానికి రాను" అంది గుర్రుగా.

"రాకుండా ఏంచేస్తావమ్మా ఈ భూలోకంలో...?" జాలిగా అడిగాడు నారదుడు.

"ఏదో ఒకటి చేస్తాను. సినిమా హీరోయిన్‌సి కాలేకపోయినా ఫర్లేదు. నన్ను ప్రేమిస్తున్న ఆ ఫణీంద్రని పెళ్లిచేసుకుని ఇక్కడే మానవకాంతగా స్థిరపడిపోతాను" బింకంగా అంది రంభ.

"అందువల్ల నీక్కలిగే ప్రయోజనం?"

"అదంతా మీకనవసరం. నేనిలా అన్నానని వెళ్ళి మీ దేవేంద్రులవారితో చెప్పండి. వారి పప్పులేం నా దగ్గర ఉడకవని చెప్పండి"

రంభ ఆవేశంగా అలా అంటుంటే "తప్పమ్మా" అన్నాడు నారదుడు.

"ఏంటి తప్పు?" గుర్రుగా చూసింది రంభ.

"పప్పులో కాలేస్తూ నువ్ దేవేంద్రులవారి పప్పులుడకడం గురించి మాట్లాడటం చాలా తప్పు. తాత్కాలికంగా నీ కసి చల్లారడం గురించి ఆలోచిస్తున్నావే తప్ప దూరదృష్టి లోపించింది నీలో..." నా తల్లివిగదూ, నేచెప్పేది వినమ్మా అన్నట్టుగా చూస్తూ అన్నాడు నారదుడు. "దేవలోకంలో దివ్యసుఖాలనుభవిస్తూ యుగయుగాలపాటు స్థిరంగా ఉండాల్సిన నువ్వు దైవత్వాన్ని కోల్పోయి ఈ మానవలోకంలో ఏం చెయ్యగలననుకుంటున్నావు? మహా అయితే ఈ ఫణీంద్రతో కొన్నాళ్లపాటు కాపురంచేసి ఇద్దరో ముగ్గురో పిల్లల్ని కనగలుగుతావు. ఆ తదుపరి మరణించి మట్టిలో కలిసిపోవాల్సిందేగదా!"

"యుగాల తరబడి అక్కడ తైతక్కలాడ్డం కంటే, కొన్నాళ్ళపాటైనా ఇక్కడ సార్థక జీవితం అనుభవించటం మేలు. మరణం గురించి గుర్తుచేసి మీరు నన్నేం భయపెట్టనవసరంలేదు..." మొండిగా అంది రంభ.

"అయితే నీ నిర్ణయం ఇంక మారదా?"

"చెప్పానుగా చచ్చినా మారదని?"

రంభ పొగరుబోతుతనానికి మనసులో చాలా బాధపడి 'సరే నీ ఖర్మ" అనేసి అంతర్థానమైపోయాడు నారదుడు.

ఆయన సమక్షంలో ఏదో అలా అన్నప్పటికీ ఆయన నిష్క్రమణానంతరం పునరాలోచనలో పడింది రంభ.

దేవేంద్రుడిమీద కసితో ఈ ఫణీంద్రని కట్టుకుని కొన్నాళ్లపాటు సుఖంగా జీవించి ఆ తర్వాత అనివార్యంగా మరణించడం ఏం సబబు?

అసలే ఈ మనుషుల బుద్ధులు మంచివి కావు. ఆ కొన్నాళ్లపాటైనా తను ఫణీంద్రతో సుఖంగా ఉండగలుగుతుందన్న గ్యారంటీ ఏముంది?

తనమీద మోజు తీరిపోయాక అతను తనని ప్రేమగా చూసుకోకపోవచ్చు. లేదా తనకన్నా అందగత్తె ఇంకెవరైనా తటస్థపడితే ఏకంగా అతను తనకు విడాకులే ఇచ్చేయవచ్చు. రెండోపెళ్లి చేసుకోవచ్చు.

అప్పుడు తన పరిస్థితేమిటి? ఒక భర్తృపరిత్యక్తగా ఈ భూలోకంలో తనకింక విలువేముంటుంది?

విఘ్నేశ్వరుడు రంగంలోకి దిగాడు కాబట్టి తనకింక సినిమా ఛాన్స్ అనేది కల్ల!

అలాంటప్పుడు మొండి పట్టుదలకుపోయి ఈ భూలోకంలోనే ఉండిపోవటం ఎంత వ్యర్థం? అంతకన్నా స్వర్గానికి తిరిగి వెళ్ళిపోవటమే మంచిదిగదా? అలా అనుకుంటుంటే ఆమె మనసులో ఫణీంద్ర మెదిలాడు. అనవసరంగా అతన్లో ఎన్నెన్నో ఆశల్ని రేపింది తను. అలాంటిది చెప్పాపెట్టకుండా తనిప్పుడు సడన్‌గా అంతర్థానమైపోతే అతనేమైపోతాడు?

భగ్నహృదయుడై జీవితాంతం ఓ పిచ్చివాడిలా మిగిలిపోడూ?

తెలిసి తెలిసి ఆ పాపాన్ని మూటగట్టుకో



వటం దేనికి తను!

సో... అతను వచ్చాక నెమ్మదిగా అతనికి నచ్చజెప్పి ఆమీదట స్వర్గానికి వెళ్ళిపోవాలి తను.

కొన్నాళ్లపాటు మిగతా డాన్సర్స్ ముగ్గురూ తనని చూసి హేళన చేస్తారు. "వచ్చిందమ్మా హీరోయిను. తీరిందమ్మా తీపడం..." అని నానా మాటలూ అంటారు. మొదట్లో అది భరించటం చాలా కష్టమే అవుతుంది. కానీ కొన్నాళ్ల పాటు ఓర్చుకోగలిగితే అన్నీ అవే సర్దుకుంటాయి.

మొత్తానికైతే తను స్వర్గానికి తిరిగెళ్లిపోవడమే మంచిది.

అది కూడా ఎంత త్వరగా వెళ్ళగలిగితే అంత మంచిది.

ఎందుకంటే ఆల్రెడీ అక్కడ తన ప్లేస్‌లో సిల్క్‌స్మిత అపాయింట్ అయివుంది. ఆమెను పర్మనెంట్ చెయ్యకముందే తనక్కడికి చేరుకోగలిగితే తన పదవి మళ్ళీ తనకు దక్కుతుంది.

లేదంటే హుష్‌కాకి!

సో... వీలయితే రేపే వెళ్లిపోవాలి స్వర్గానికి.

అలా ఒక నిర్ణయానికి వచ్చేసి ఆపైన ఇంక చేయడానికి వేరే పనేంలేదు గనక మంచంమీద వాలి కునుకుతీయటం ప్రారంభించింది రంభ.

★ ★ ★

మధ్యాహ్నం రెండింటికి తలనొప్పిగా ఉందని చెప్పి బ్యాంక్‌లో పర్మిషన్ తీసుకుని ఇంటికొచ్చేశాడు ఫణీంద్ర.

అతనొచ్చేసరికి రంభ ఇంకా నిద్రపోతూనే ఉంది.

ఈవేళపుడిలా నిద్రపోతోందేంటీ? అనుకున్నాడు ఫణీంద్ర ఆమెను చూసి.

లేపుదామా అనిపించిందిగానీ అంత గాఢ నిద్రలో ఉన్న మనిషిని ఎందుకులే డిస్టర్బ్ చేయడం అని మిన్నకుండిపోయాడు.

అతనలా మధ్యలో ఇంటికొచ్చేసింది నిజంగా తలనొప్పి వచ్చేంకాదు. రంభ చెవిన ఓ శుభవార్త వెయ్యాలని.

అదేమిటంటే...

మనసుండబట్టక బ్యాంకునుండి శర్మగారిచ్చిన నంబర్‌కి మళ్ళీ ఒకసారి ఫోన్ చేశాడు ఫణీంద్ర. శర్మగారు చెన్నైనుండి మళ్లీ సిటీకెప్పుడొస్తారో ఎగ్జాక్ట్ డేట్ చెప్పగలరా? అనడిగితే అవతల్నుంచి ఓ శుభవార్త వినిపించింది. "మళ్ళీ ఇక్కడేదో అర్జంట్ పనిబడి చెన్నైనుండి ఆయన రాత్రికే వచ్చేస్తున్నారనీ, కాబట్టి రేప్పొద్దున మళ్ళీ ఇదే నెంబర్‌కి ఫోన్ చెయ్యమని చెప్పాడాయన పియ్యే!"

ఇంకో అయిదార్రోజులకుగానీ తిరిగి రాడనుకున్న మనిషి ఈ రాత్రికే వచ్చేస్తున్నాడంటే అంతకన్నా శుభవార్త ఏముంటుంది?

అందుకే అతనిప్పుడిలా పరుగెత్తుకొచ్చాడు.

కానీ ఏంలాభం? రంభేమో గాఢనిద్రలో ఉందాయె!

సర్లే లేచాకనే చెప్పొచ్చులే అనుకుని అతను బట్టలు మార్చుకుంటుండగా... అటకమీద ఏదో చప్పుడైంది.

ఏంటబ్బా అది? అని తలపైకెత్తగా ఓ ఎలుకని నోటికరుచుకుని అటకమీంచి కిందకు దూకిందో పిల్లి!

అది చూసి 'ఓస్ ఇంతేనా?' అనుకున్నాడు ఫణీంద్ర.

అంతలో అటకమీంచి ఏదో చిన్నపొట్లం లాంటిది జారిపడింది.

కుతూహలంగా దాన్ని విప్పి చూడగా... అందులో రెండు నీలిరంగు మాత్రలు కనిపించాయి అతనికి.

ఏంమాత్రలబ్బా ఇవి అనుకున్నాడు ఒక మాత్రని రెండు వేళ్లతో పట్టుకుని అటూ ఇటూ తిప్పి చూస్తూ.

ప్రభాకర్ తరచుగా మల్టీ విటమిన్

 

మాత్రలు మింగుతూ ఉంటాడు. అంటే అతనికేదో విటమిన్ డెఫిషియన్సీ ఉండి కాదు. ఎక్స్‌ట్రా బలంకోసం అన్నట్టుగా అదో అలవాటుగా అతనలా మింగుతూ ఉంటాడంతే!

ఆ విషయం గుర్తుకొచ్చి అటకమీంచి పడింది కాబట్టి వాడిదే అయ్యుంటుంది. ఏదో మల్టీ విటమిన్ టాబ్లెట్టే అయ్యుంటుం దనుకుని ఓ మాత్రని గుటుక్కున మింగే శాడు ఫణీంద్ర. మల్టీ విటమిన్ మాత్రని ఎవరైనా మింగొచ్చులే తప్పేముందీ? అన్న ఉద్దేశ్యంతో.

కానీ అది నిజంగా మల్టీ విటమిన్ మాత్ర అయితేగా! రంభ పదిలంగా దాచిపె ట్టిన వయాగ్రానాయె!

అందుకే ఓ అరగంట గడిచేసరికల్లా అతన్లో అదోలాంటి మదనవికారం ప్రారంభ మైంది.

దానికితోడు ఎదురుగా మంచంమీద చెది రిన దుస్తుల్లో రంభ.

అలాంటప్పుడు ఎంత బుద్ధిమంతుడైతే మాత్రం తిన్నగా ఎలా ఉండగలుగుతాడు?

కనువిందు చేస్తోన్న రంభ పరువాల్ని చూస్తుంటే అమాంతంగా వెళ్లి ఆమె మీద వాలిపోవాలనిపించింది ఫణీంద్రకి.

కానీ ఎంతో కష్టమ్మీద నిగ్రహించుకు న్నాడు.

ఇదేమిటిలా అయిపోతోంది తనకి? ఆమె ఎన్నోసార్లు అవకాశమిచ్చినా కూడా వద్దను కున్న తను ఇపుడిలా ఆరాటం చెందడం ఏంటి?

ఛ తప్పు!

అలా అతను మనసుకి సర్ది చెప్పుకోబో యాడుగానీ అయినాసరే కోరికని అదుపులో పెట్టుకోవటం అతనివల్ల కాలేదు.

ఎలా అవుతుంది వయగ్రా తాలుకు పవర్ అతని నరనరాల్లోనూ చేరిపోతే?

దాంతో అతని మనసు మరోలా ఆలో చించటం ప్రారంభించింది.

తప్పేముందీ కాబోయే భార్యేగా? అదీ గాక నిన్నా మొన్నట్లో ఆమె కూడా అలాంటి కోరికని వ్యక్తం చేసిన మనిషేగా?

అలా అనిపించాక అతను మరొక్క క్షణం కూడా నిగ్రహించుకోలేకపోయాడు.

ఏమైతే అదే అవుతుంది లెమ్మని గభాల్న వెళ్లి నిదురిస్తోన్న రంభమీద తుమ్మెదలా వాలిపోయాడు.

ఆ స్పర్శకి చటుక్కున మెలుకువచ్చేసింది రంభకి. కళ్లు తెరిచి చూడగా తన మోముపై మోముపెట్టి అధరాల్ని చుంబిం చపోతున్న ఫణీంద్ర కన్పించాడామెకి.

"నువ్వా? " అంటూ ఒక్క విదిలింపుతో అతన్ని నెట్టేసి చటుక్కున లేచి కూర్చుంది.

"నేనే డాళింగ్! నీ సౌందర్యాన్ని చూస్తుంటే నాకెందుకో ఇవ్వాళ పిచ్చెక్కిపో తోంది. ప్లీజ్ కాదనకు" మళ్లీ ఆమెను వాటే సుకుంటూ తమకంగా అన్నాడు ఫణీంద్ర.

"వాట్ నాన్‌సెన్స్ యు ఆర్ టాకింగ్? " మళ్లీ అతన్ని నెట్టేస్తూ కోపంగా అరిచింది రంభ.

"నాన్‌సెన్స్‌కాదు రంభా! ప్రేమ సెన్స్! ఈ రోజు నిన్ను నాలో ఐక్యం చేసేసుకుం టాను. కాబోయే భార్యాభర్తలమేగా, తప్పేం లేదు. కాదనకు" వయాగ్రా ప్రభావం అతన్ని ఊరికే ఉండనివ్వలేదు. మళ్లీ పెన వేసుకున్నాడామెని.

వీలయినంత త్వరగా స్వర్గానికి తిరిగి వెళ్లిపోవాలన్న నిశ్చయానికి ఆల్రెడీ వచ్చేసి ఉన్న రంభకి సహజంగానే ఒళ్లు మండిపో యింది అతని మీద.

దాంతో "డోంట్ టాక్ రబ్బిష్" అంటూ అతని చెంప పగలగొట్టింది.

"వదులు నన్ను వదులు..." అంటూ ఆమె అతని వీపుమీద పిడిగుద్దులు గుద్దు తుంటే సారీ అంటూ ఆమె నొదిలేసి వెళ్లి దూరంగా నిలబడ్డాడు ఫణీంద్ర.

చెదిరిన దుస్తుల్ని సరిచేసుకుంటూ అతని వంక తీక్షణంగా చూసింది రంభ.

"సారీ అన్నాగా" తల దించుకుంటూ అన్నాడు ఫణీంద్ర. "ఎందుకోగాని నా మనసు ఇవ్వాళ కంట్రోల్ తప్పింది. బహుశా ఇదా మల్టీ విటమిన్ టాబ్లెట్ ప్రభావమేమో"

"మల్టీ విటమిన్ టాబ్లెట్టా!" కంగారుపడింది రంభ.

"అవును మల్టీవిటమిన్ టాబ్లెట్టే! ప్రభాకర్‌గాడు బఠానీలు తిన్నట్టు తెగమింగుతుంటాళ్లే. ఇందాక అటకమీంచి రెండు రాలిపడితే సర్దాగా ఒకటి తిన్నాను. అప్పట్నుంచీ నాలో ఈ ప్రకోపం మొదలయ్యింది" వయాగ్రా ప్రభావం ఇంకా వీడనందున ఒక పక్క ఆమె వంక ఇంకా ఆకలిగా చూస్తూనే అన్నాడు ఫణీంద్ర.

దాంతో జరిగిందేమిటో రంభకి అర్థమైపోయింది.

కానీ అవి వయాగ్రా టాబ్లెట్లని అతనితో ఎలా చెప్పగలదు?

చెప్తే ఎక్కడివి? ఏమిటంటూ ఆరాలడుగుతాడుకదా?

అందుకే "అలాగా? " అంది అమాయకత్వాన్ని నటిస్తూ.

"అవును రంభా! ఒట్టు నన్ను నమ్ము స్వతహాగా నేనెంత బుద్ధిమంతుడ్నో నీకు తెలుసుకదా! ఆ మాత్ర మింగేకే నాలో ఈ వేదన ప్రారంభమైంది. ఇప్పటికీ ఇప్పటికీ... నన్ను కంట్రోల్ చేసుకోలేకపోతున్నాను. ప్లీజ్ ఒక్కసారి కాదనకు" అన్నాడు ఫణీంద్ర నిజంగానే మళ్లీ కంట్రోల్ తప్పిపోతూ.

"నేను నీ కంటికెలా కనిపిస్తున్నాను? " కోపంగా అరిచింది రంభ.

"ప్లీజ్ రంభా! నన్నపార్థం చేస్కోవద్దు. మనం ఎలాగూ పెళ్లి చేసుకుంటాంగా! అందుకని అడ్వాన్స్‌గా ఒక్కసారి"

బతిమాల్తూ అతను తనని సమీపించబోతుంటే "ఆగక్కడ" అని గట్టిగా అరిచింది రంభ.

ఉడ్‌బీ అంత గట్టిగా అరిచాక్కూడా ఆగనంత మడ్ బ్రెయినేం కాదుగా ఫణీంద్రది?

ఆగిపోయాడు చటుక్కున.

"మనం కాబోయే భార్యాభర్తలం అన్న మాట మరొక్కసారనొద్దు. నేన్నిన్నేం పెళ్లి చేసుకోబోవటంలేదు" ఆలస్యం దేనికిలెమ్మని చటుక్కున బాంబు పేల్చేసింది రంభ.

కాళ్లకింద భూమి కదిలిపోతున్నట్టుగా అనిపించింది ఫణీంద్రకి.

ఆ షాక్‌కి వయాగ్రా ప్రభావం ఎటెగిరిపోయిందో ఏమో నిలువునా నీరసం ఆవహించేసింది అతన్ని.

"రంభా! నువ్వేనా ఆ మాట అంటోంది? " హీనస్వరంతో దీనంగా అడిగాడు.

ఆల్రెడీ ఒక నిర్ణయానికి వచ్చేసి ఉన్నాక అతని హీనస్వర దీనాలాపనకి కరిగిపోవాల్సిన అవసరమేముంది రంభకి?

"అవున్నేనే అంటున్నాను. నిజంగానే అంటున్నాను. ఐడోంట్ వాంట్ టు మ్యారీయూ" అంది కటువుగా.

"వై? ఎందుకు? " ఆంగ్లాంధ్ర భాషల్లో ఆవేదనగా అడిగాడు ఫణీంద్ర.

"నీకు కారణం చెప్పాల్సిన అవసరం నాకు లేదు" కేర్లెస్‌గా అంది రంభ.

"నో, కారణం చెప్పి తీరాలి" కంపెల్ చేస్తూ అన్నాడు ఫణీంద్ర. అనటంకాదు దాదాపుగా అరిచాడు.

ఓ దేవనర్తకీ మణికి ఓ అల్పమానవుడి అరుపో లెక్కా?

"ఏంటి పెద్ద నిలదీస్తున్నావ్? నేను చెప్పనంతే. చెప్పాల్సిన అవసరం నాకు లేదు" అంది రంభ అతనికేసి గుర్రుగా చూస్తూ.

"చెప్పకపోతే ఇప్పుడే ఇక్కడే నేను ఉరిపోసుకుని చచ్చిపోతానంతే!" బెదిరింపు అస్త్రాన్ని ప్రయోగించాడు ఫణీంద్ర.

ఓ అల్పమానవుడి బెదిరింపుకి జడిసిపోవాల్సిన అవసరం ఏముంది రంభకి?




"నువ్వేమైనా చేస్కో. నేను మాత్రం నిన్ను పెళ్లి చేసుకోనంతే! అందుక్కారణం కూడా చెప్పనంతే" అంది నిర్వికారంగా.

అంత బెదిరింపు బెదిరించినా కూడా రంభ దిగిరాకపోయేసరికి ఛ ఏం మనిషి? అనిపించింది ఫణీంద్రకి.

స్త్రీ సహజమైన కోమల హృదయం ఈమెలో మచ్చుకైనా లేదు! ఇలాంటి మనిషినా నేను ప్రేమించింది? అనుకున్నాడు బాధగా.

అంటే అతనిలోని ప్రేమంతా ద్వేషంగా మారిపోయిందని కాదు. గాయపడిన హృదయం అతన్నలా అనుకునేలా చేసిందంతే.

"అయితే నేను చచ్చిపోయినా నీకు పర్లేదన్న మాట? " ఫణీంద్ర అలా అంటుంటే అతన్లో తన మీద ఏవగింపు కలిగితే అతను తనని తొందరగా మర్చిపోగలుగుతాడు కదానిపించి "అవును" అంది రంభ స్థిరంగా.

దాంతో కొద్దిక్షణాలపాటు ఏం మాట్లాడలేకపోయాడు ఫణీంద్ర.

ఆమె అంత డైరెక్ట్‌గా అలా చెబుతుంటే ఇంకేమనగలడతను?

కొద్దిక్షణాల తర్వాత తేరుకున్నాడెలాగో.

"సర్లే రంభా! ప్రేమ అనేది అడుక్కుంటే దొరికేది కాదు. నీకెలా తోస్తే అలాగే చెయ్యి! నన్ను పెళ్లి చేసుకోవద్దులే! కనీసం నీ స్నేహితుడిగానైనా ఉండనియ్యి" అన్నాడు భారంగా.

"ఇదీ కుదర్దు... నేనివ్వాళ సాయంత్రం ఇక్కడ్నుంచి వెళ్లిపోవాలనుకుంటున్నాను" ముఖం పక్కకు తిప్పేసుకుంటూ అంది రంభ.

"ఇక్కడ్నుంచి వెళ్లిపోతావా? ఎక్కడికీ? " ఆశ్చర్యంగా అడిగాడు ఫణీంద్ర.

స్వర్గలోకానికని ఎలా చెప్పగలుగుతుంది రంభ?

అందుకే "చెప్పను" అనేసింది కటువుగా "ఈ రాత్రికి నేను వెళ్లిపోవటం మాత్రం ఖాయం" అంది స్థిరంగా.

"అదేంటి రంభా! చెన్నైనుండి శర్మగారు ఈ రాత్రికే మళ్లీ వచ్చేస్తున్నారట! ఆయన ప్రోగ్రాంలో సడన్‌గా మార్పొచ్చిందట. ఇందాకే నేను మళ్లీ ఫోన్‌చేసి కనుక్కున్నాను. రేపాయన్ని కలుసుకోవా అయితే? " అన్నాడు ఫణీంద్ర.

శర్మ ఈ రాత్రికే వస్తున్నాడనేసరికి రంభలో మళ్లీ చిన్నపాటి ఆశ మెదిలింది.

కానీ అంతలోనే విఘ్నేశ్వరుడు రంగంలో ఉన్నాడన్న విషయం గుర్తుకొచ్చి అదికాస్తా అణగారిపోయింది.

ఈ రాత్రికి శర్మ వస్తాడు, రైటే అయినా ఒరిగేదేముందీ? రేప్పొద్దున్న ఆయన్ని మీటవ్వడానికి తను వెళ్తే విఘ్నేశ్వరుడు ఇంకో ఆటంకమేదో కల్పించకుండా ఉండడు గదా!

సో... తను హీరోయిన్ కాగలగటం అనేది వట్టిమాట.

అలాంటప్పుడు అనవసరంగా ఎందుకిక్కడ కాలయాపన చెయ్యడం?

అదీగాక తానిక్కడ ఇంకా ఎక్కువ కాలం ఉంటే ఫణీంద్రలో ఇంకా ఇంకా ఆశలు పెరుగుతాయ్!

అపుడు తను వాటిని మళ్లీ తుంచాలి.

ఎందుకతన్ని అనవసరంగా బాధించటం. ఇపుడంటే ఎలాగూ తనతని ఆశల్ని తుంచేసింది కాబట్టి నో ప్రోబ్లం సో...

వీలయినంత వెంటనే వెళ్లిపోవటమే మంచిది.

అలా అనుకుని "నేనింక ఏ డైరెక్టర్‌నీ కలుసుకో దల్చుకోలేదు" అనేసింది రంభ అడ్డంగా తలాడిస్తూ.

"అదేంటి రంభా! ఈనగాచి నక్కలపాలు చేస్తానంటే ఎలా? ప్లీజ్ ఈ ఒక్కరాత్రికీ ఆగు. రేపు శర్మగార్ని కలుసుకున్నాక ఒక వేళ వారు కూడా కాదంటే అప్పుడు నీ ఇష్ట మొచ్చినట్టు చేద్దువుగాన్లే" బతిమాల్తూ

అన్నాడు ఫణీంద్ర.

"వద్దు ఫణీ! నాకింక సినిమా ఛాన్సే వద్దసలు" అందిరంభ మళ్లీ అడ్డంగా తలాడిస్తూ.

"పోనీ వద్దులే! కానీ నువ్ ఎక్కడికి వెళ్తానంటున్నావో అదైనా చెప్పు" దీనంగా చూస్తూ అడిగాడు ఫణీంద్ర.

"చెప్పను" అనేసింది రంభ మొండిగా.

మొండి వాడిని రాజు కూడా ఏం చెయ్యలేడు. అలాంటిది ఫణీంద్రేం చేయగలుగుతాడు?

మనసు భారంగా అయిపోవడంతో "నేను కాసేపలా బయటకెళ్లొస్తా"నంటూ చెప్పుల్లో కాళ్లు దూర్చాడతను.

"సరే" అనేసింది రంభ.

★ ★ ★

ప్రభాకర్ బ్యాంకు నుండి బైటికొస్తుంటే అతనికెదురొచ్చాడు ఫణీంద్ర.

"అదేంటి? తలనొప్పంటూ వెళ్లిపోయావ్‌గా? మళ్లీ ఇలా వచ్చావేం?" మిత్రుడి భుజం మీద చెయ్యివేస్తూ అడిగాడు ప్రభాకర్.

"నీతో చాలా విషయాలు చెప్పాలి. ఎక్కడ కూర్చుందాం?" అన్నాడు ఫణీంద్ర.

అతని ముఖం బాగా వాడిపోయి ఉండటం అప్పుడు గమనించాడు ప్రభాకర్.

"అదేంటలా ఉన్నావ్? ఏం జరిగింది?" అనడిగాడు గాభరాగా.

"చెప్తాగా... ముందు మనం కూర్చోవడానికేదైనా ఏకాంత ప్రదేశం కావాలి"

"ఎక్కడికో వెళ్లటం దేనికి? ఎదురుగానే పార్కుందిగా అక్కడ కూర్చుందామా?" అన్నాడు ప్రభాకర్.

"సరే నడు" అంటూ పార్కువైపు దారితీశాడు ఫణీంద్ర.

ఇద్దరూ పార్కుకెళ్లి ఓ చెట్టుకింద కూర్చున్నాక ఎంతో బాధపడుతూ ఇంటివద్ద జరిగిన సంగతులన్నీ మిత్రుడికి చెప్పుకొచ్చాడు ఫణీంద్ర.

"ఏంటీ రంభ వెళ్లిపోతానంటోందా?" అన్నాడు విషయం విన్నాక ప్రభాకర్ ఆశ్చర్యంగా. "తనకెవరూ లేరందిగా. ఎక్కడికెళ్తుందిరా? ఊర్కే నిన్ను భయపెట్టడానికనుంటుందిలే" అన్నాడతనే మళ్లీ.

"అదేంకాదురా! తనీ విషయంలో చాలా పట్టుదలగా ఉంది. కనీసం ఈ ఒక్కనైట్ అయినా ఉండి రేపు శర్మగార్ని కలిసి వెళ్లమని నేనెంతో బతిమాలాను. అయినా ససేమిరా అనేసింది"

ఏడుపు ముఖం పెడుతూ చెప్పాడు ఫణీంద్ర.

"సరే ఇప్పుడేం చేద్దామయితే?" అన్నాడు ప్రభాకర్ అంతకన్నా ఇంకేమనాలో తోచక.

అతనలా అనేసరికి ఫణీంద్రకే ఓ ఉపాయం తట్టింది.

"ఒక పంజేస్తే ఎలా ఉంటుంది?" అనడిగాడు విషయం చెప్పకుండానే.

"అదేంటో చెప్తే కదా నాకు తెలిసేది?" అన్నాడు ప్రభాకర్.

"ఇప్పుడే వచ్చింది నాకీ ఉపాయం. మనం ఏదైనా పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుండి ఇంటికి ఫోన్ చేద్దాం"

"చేసి?"

"మనమేదో బ్యాంక్ పని మీద అర్జంట్‌గా ఊరెళ్తున్నట్టు మరో నాలుగు రోజుల దాకా తిరిగిరాం అన్నట్టూ చెబుదాం"

"చెబితే?"

"మన దగ్గర్నుండి వీడ్కోలు తీసుకోకుండా తను వెళ్లిపోలేదు కాబట్టి ఓ నాల్రోజులపాటు తన నిర్ణయాన్ని వాయిదా వేసుకుంటుంది. ఈ నాల్రోజుల్లో తన మనసు మారే అవకాశం ఉందిగదా!"

ఇదేదో కాస్త బానే ఉన్నట్టుందే అనిపించింది ప్రభాకర్‌కి.

అయినా సరే చిన్న కుశంకని వ్యక్తం చేశాడు.

"బ్యాంకు ఉద్యోగాలకి క్యాంపులేముంటాయిరా! సరే ఎలాగోలా నమ్మిస్తామనుకో.

కానీ ఈ నాల్రోజులూ మనమెక్కడుంటాం మరి? " అనడిగాడు.

"మన్దేముందిరా ఏ లాడ్జ్‌లోనో గడిపే యొచ్చు ఇట్స్ నాటే బిగ్‌ప్రాబ్లం" అనేశాడు ఫణీంద్ర తేలిగ్గా.

నిజమేలే అనిపించింది ప్రభాకర్‌క్కూడా.

"సరే నడైతే" అంటూ లేచి నిలబడ్డాడు.

దగ్గర్లోనే ఓ టెలిఫోన్ బూతుంటే పార్కు నుండి నేరుగా అక్కడికి చేరుకున్నారు మిత్రులిద్దరూ.

అనుకున్నట్టుగానే ఇంటికి ఫోన్ చేశారు.

కానీ అవతల్నుంచి ఎవరైనా లిఫ్ట్ చేస్తే కదా?

ఒకటికి మూడుసార్లు ట్రై చేశారు. అయినా అదే పరిస్థితి.

"ఎందుకని ఫోన్ లిఫ్ట్ చేయడంలేదు? కొంపదీసి ఈసరికే ఎక్కడికైనా వెళ్లిపోయిందా రంభ? " అనే అనుమానం వచ్చింది ఫణీంద్రకి.

ఆ ఊహకి కంపించిపోతూ అదే విషయాన్ని ప్రభాకర్‌కి చెప్పాడతను.

"ప్యాకెట్ కొనుక్కోవడానికి బైటికెళ్లుంటుందిలే" అన్నాడు ప్రభాకర్.

మిత్రుడి గాభరాని కాస్త తగ్గించాలన్న ఉద్దేశ్యంతో అతనలా అంటే మనసులో లెక్కగట్టి "దాంతో అప్పుడే మళ్లీ అవసరమేమొస్తుందీ? " అన్నాడు ఫణీంద్ర.

అవునుస్మా అనుకుని "అందుక్కాకపోతే మరెందుకో బయటికెళ్ళుంటుందిలే. నువ్వేం కంగారుపడకు" అన్నాడు ప్రభాకర్.

"అంతేనంటావా? "

"అంతే అయ్యుంటుందిలే. అర్జంట్‌గా ఇంటికెళ్ళిపోదాం పద..." అంటూ టెలిఫోన్ బూత్ అబ్బాయికి డబ్బులు చెల్లించి మిత్రుడ్ని బయటికి లాక్కొచ్చాడు ప్రభాకర్.

వెంటనే ఓ ఆటో ఎక్కి ఇల్లు చేరుకున్నారిద్దరూ.

వాళ్లూహించినట్టే మెయిన్‌డోర్‌కి ఓ తాళంకప్ప వెక్కిరిస్తూ కనిపించింది.

తమవద్ద ఉన్న డూప్లికేట్‌తో తాళంతీసి లోనికి నడిచారిద్దరూ.

దండెంమీద రంభ తాలూకు చీరలు రెండు కనిపించేసరికి 'హమయ్య అయితే ఎక్కడికీ వెళ్లిపోలేదులే' అనుకున్నాడు ఫణీంద్ర.

కానీ అంతలోనే అతని దృష్టి టీపాయ్ మీద పేపర్ వెయిట్‌కింద రెపరెపలాడుతున్న ఓ కాగితంమీద పడింది.

దాంతో మళ్ళీ గుండె జారిపోయిందతనికి.

ఒక్కపరుగున వెళ్ళి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. చేతులు కంపిస్తుండగా అందులోని అక్షరాల్లోకి దృష్టి సారించాడు.

"ఫణీంద్రగారికి...

ఇందాక మీకు చెప్పినట్టే నేను వెళ్ళిపోతున్నాను. ఎక్కడికి ఏమిటి అన్నది సస్పెన్స్.

ఇన్నాళ్లూ మీ అతిథిగా ఉండి ఇలా చెప్పాపెట్టకుండా వెళ్ళిపోతున్నందుకు నన్ను మన్నించండి. మీరిద్దరూ వచ్చేదాకా ఉంటే మీరు నన్ను వెళ్ళనివ్వరన్న ఉద్దేశ్యంతో ఇలా రహస్యంగా వెళ్ళిపోతున్నాను.

ఇన్నాళ్లూ మీరిద్దరూ నాపట్ల చూపిన అభిమానానికి కృతజ్ఞురాల్ని.

పోతే చివరిగా ఒక్కమాట ఫణీంద్రా!

దయచేసి నన్ను మర్చిపోండి. నాకన్నా మంచి అమ్మాయినెవర్నయినా చూసి పెళ్ళి చేసుకోండి.

వుంటాను మరి
ఇక శెలవా?
-రంభ"

అక్షరాలు ముత్యాల్లా ఉన్నాయి. అయితేనేం? ఒక్కో అక్షరం ఒక్కో బాంబై పేలింది ఫణీంద్ర గుండెలో.

"రంభా!" అనరుస్తూ కుప్పలా కూర్చుండిపోయాడతను.

"ఏమైందిరా? ఏం రాసింది? " అంటూ అతని చేతిలోంచి ఆ ఉత్తరాన్ని లాక్కుని





తనూ చదివాడు ప్రభాకర్.

అలా సడన్‌గా హ్యాండిచ్చి వెళ్ళిపోయిన ఆ మనిషిని ఎలా అర్థం చేస్కోవాలో అర్థం కాలేదతనికి.

ఫణీంద్రవైపు చూడగా అతను జలజలా కన్నీరు కారుస్తూ కనిపించాడు.

"ఊరుకోరా ఎందుకేడుస్తావ్ అనవసరంగా? నిన్ను ఎంతో ఇదిగా ప్రేమిస్తున్నానని చెప్పి ఇంతలోనే ఇలా వెళ్ళిపోయిందంటే ఆమె ఒక చపలచిత్తురాలని అర్థం. అలాంటి మనిషికోసం కన్నీరు వృథా చేస్కోకు" అన్నాడు తనకు తోచిన మాటల్లో మిత్రుడ్ని ఓదారుస్తూ.

కానీ ఫణీంద్ర ఆ మాటల్ని వినిపించుకునే స్థితిలో ఉంటేగా?

"రంభా... రంభా..." అంటూ ఆవేదనగా జుట్టుపీక్కుంటూ ఉన్నాడతను.

"చెప్పేది నీకేరా! అలాంటి చపలచిత్తురాలికోసం కన్నీరే కాదు జుట్టునీ వృథాచేస్కోవటం కూడా అవివేకమే... నిబ్బరంగా ఉండు. జరిగిందంతా ఓ పీడకలగా మర్చిపో..." అంటూ ప్రభాకర్ తన భుజం తట్టేసరికి ఈసారి కొద్దిగా తేరుకున్నాడు ఫణీంద్ర.

"ఎలా మర్చిపోగలను? అది ఎలా సాధ్యం? " అన్నాడు ఆవేదనగా.

"ప్రయత్నిస్తే ప్రతీదీ సాధ్యమే! అయినా ఆవిడగారు ఏమంత బాగుండిచచ్చిందని? అంతకన్నా అందమైన వాళ్ళూ, మంచివాళ్ళూ బోలెడంత మందున్నారీప్రపంచంలో? సో... ఆమెకోసం నువ్ విరాగివైపోవాల్సిన అవసరం ఎంత మాత్రం లేదు" ఆ పరిస్థితుల్లో మిత్రుడు త్వరగా కోలుకోవాలంటే వెళ్ళిపోయిన వ్యక్తిమీద అతన్లో తేలికభావాన్ని పెంచడం అవసరం కాబట్టి రంభనలా తీసిపారేస్తూ అన్నాడు ప్రభాకర్.

"ఆమెకన్నా అందమైన మరో యువతి నాకు దొరకదని కాదు. కానీ ఒకసారి మనసిచ్చాక అంత తేలిగ్గా ఎలా మర్చిపోగలను? " అన్నాడు ఫణీంద్ర ఒక పక్క మిత్రుడి మాటల్ని తలకెక్కించుకుంటూనే.

"కష్టమే అనుకో... అయినా ప్రయత్నిస్తే మర్చిపోవచ్చు. అదేం అసాధ్యం కాదు" మిత్రుడ్ని పైకి లేవదీసి సోఫాలో కూర్చోబెడుతూ అన్నాడు ప్రభాకర్.

అతనికేసి దీనంగా చూస్తూ "అంతేనంటావా? " అన్నాడు ఫణీంద్ర.

"పోనీ నువ్వే చెప్పు... అంతకన్నా నువ్ చేయగలిగిందేముందిపుడు? " మిత్రుడి పక్కనే కూర్చుంటూ అడిగాడు ప్రభాకర్.

"ఎక్కడుందో వెతికి, తెలుసుకుని తనని బతిమాలి..." అంటూ ఇంకా ఏదో చెప్పబోయాడు ఫణీంద్ర.

అతనికేసి కాస్త కోపంగా చూస్తూ "ఎక్కడని వెతుకుతావ్? " అన్నాడు ప్రభాకర్.

'అవున్నిజమే ఎక్కడని వెతకాలి? ' అనుకున్న ఫణీంద్ర. అప్పటికీ ఆశ చావక "ముందైతే సిటీ అంతా గాలిద్దాం" అన్నాడు.

"ఇదేవన్నా చిన్నా చితకా ఊరా ఒక మనిషిని గాలించి పట్టుకోగలగటానికి? " ఫణీంద్ర మాటల్ని కొట్టిపారేస్తూ అన్నాడు ప్రభాకర్ "కాళ్ళ తిప్పటే తప్ప అందువల్ల ప్రయోజనం ఉంటుందని నేననుకోను"

"నా ఆశ నాది. ఓ రెండ్రోజులు బ్యాంకుకి సెలవు పెట్టి నా ప్రయత్నాలు నేను చేస్తాను" అన్నాడు ఫణీంద్ర. ఎంతైనా ప్రియుడన్నవాడికి ఆపాటి ఆశ ఉండటం సహజమే గదా!

అప్పటి ఆ స్థితిలో అతన్ని మరింత డిస్కరేజ్ చేయడం దేనికి లెమ్మని "సరే నీ ఇష్టం" అనేశాడు ప్రభాకర్.

★ ★ ★

రంభ స్వర్గానికి తిరిగెళ్లాక అక్కడేం జరిగిందన్నది పెద్ద ప్రధానాంశమేం గాదు!

ఏం జరుగుతుంది?

సహజంగానే మిగతా దేవనర్తకీమణులు ముగ్గురూ ఆమెనెగతాళి చేశారు. తిలోత్తమ అయితే మరీను. వదిలిందా తుప్పు?

అంటూ ఒకటే గంతులు!

అలాంటి అవహేళనలన్నింటికీ సిద్ధపడే వెళ్ళింది గనక వాళ్ళ మాటల్ని పెద్దగా ఏం పట్టించుకోలేదు రంభ.

అంటే అనుకోనీలే వాళ్ళ పాపానికి వాళ్ళే పోతారని మిన్నకుండిపోయింది.

వాళ్ళు మాత్రం ఎంతసేపని ఏడ్పించగలుగుతారు? కాసేపు మరిన్ని కూతలు కూసి ఆ మీదట ఆటోమాటిగ్గా సైలెంటైపోయారు! నోరు మెదపకుండా ఉన్నవాళ్ళని అదే పనిగా ఏడ్పించటం ఎవరి తరం?

అలా వాళ్ళనోళ్లు మూయించేశాక దేవేంద్రులవారివద్దకు నేరుగా వెళ్ళి తన అనుచిత ప్రవర్తనకు క్షమాపణ వేడుకుంది రంభ.

యుగయుగాలనుండి తన ముందు నర్తిస్తోన్న మనిషాయె! దేవేంద్రులవారి కోపం మాత్రం ఎంతసేపుంటుంది ఆమెమీద?

"సర్లే ఇంకెప్పుడూ ఇలా చెయ్యకు" అని... చాలా సింపుల్‌గా క్షమించేసి ఆమెను తిరిగి డ్యూటీలో రీజాయిన్ చేసేసుకున్నాడాయన.

అందుకు సిల్క్‌స్మిత అభ్యంతరం చెప్పబోతే, "నీది ప్యూర్లీ టెంపరరీ అపాయింట్‌మెంట్ అన్న సంగతి మర్చిపోకు... మర్యాదగా రంభకు ఛార్జ్ అప్పగించు" అంటూ ఆమెను కేకలేసి అప్పటికప్పుడు రంభ తన పోస్ట్‌లో రీఇన్‌స్టేట్ అయ్యేలా చూశాడాయన.

దేవలోకంలో దేవేంద్రుడి మాటకు ఎదురేముంటుంది?

అలా అక్కడ రంభ కథ తిరిగి సుఖాంతమైపోయింది గానీ...

భూలోకంలో ఫణీంద్ర పరిస్థితి మాత్రం అధ్వాన్నంగా తయారైంది!

ప్రభాకర్ వద్దని వారిస్తున్నా వినకుండా ఆ మర్నాడు నిజంగానే సెలవుపెట్టి రంభ కోసం ఊరంతా గాలించటం ప్రారంభించాడు ఫణీంద్ర.

 

సిటీలో ఎక్కడైనా కనిపించటానికసలు ఆమె భూలోకంలో ఉంటేగా?

అంచేత ప్రభాకర్ అన్నట్టు ఆరోజు కేవలం కాళ్ళ తిప్పట మిగిలిందతనికి.

ఆ రాత్రి అతను పిక్కలకి పెయిన్‌బామ్ రుద్దుకుంటుంటే "నే చెప్తే విన్నావా? ఆ చపలచిత్తురాలు ఇంకా సిటీలోనే ఎందుకుంటుంది? ఎక్కడికో వెళ్ళిపోయుంటుంది. పోనీ సిటీలోనే ఉందనుకున్నా ఎక్కడని వెతుకుతావ్? నా మాటిను. అనవసరంగా లీవులు వేస్ట్ చేసుకోవద్దు. రేపు నాతోపాటు డ్యూటీ కొచ్చేసెయ్" అంటూ అతనికి హితోపదేశం చేశాడు ప్రభాకర్.

"ఊహు... అవసరమైతే ఇంకో వారం సెలవు పెట్టైనా సరే నేనామెని వెతికి తీర్తా!" అన్నాడు ఫణీంద్ర ముఖాన్ని చేదు మింగిన వాడిలాగే పెట్టి.

అతని అజ్ఞానానికి లోలోన చింతించటం తప్ప ఇంకేం చేయలేకపోయాడు ప్రభాకర్.

చిన్నపిల్లలకైతే చెప్పొచ్చు. తెలియని వాళ్ళకైతే చెప్పొచ్చు. అన్నీ తెలిసే తిక్కతిక్కగా మాట్లాడుతున్న వాళ్ళకేంచెప్పగలం?

"సర్లే నీ ఖర్మ అఘోరించు" అనేసి ఊరకుండిపోయాడతను.

ప్రేయసి సడన్‌గా అంతర్ధానమైపోతే ప్రియుడికి ఎంత బాధ కలుగుతుందో నీకేం తెలుస్తుంది... అని మనసులో అనుకుని "అలాగేలే! నా అఘోరింపేదో నేనే అఘోరిస్తాలే" అనేశాడు ఫణీంద్ర.

అన్నట్టుగానే ఆ రాత్రి అన్నమైనా తినకుండా తెల్లార్లూ మెలకువగా అఘోరించి తెల్లారగానే మళ్ళీ ఊరుమీద పడ్డాడతను.

ఆ అన్వేషణ ఏకబిగిన రాత్రి ఎనిమిదింటిదాకా సాగింది. అయినా కనిపించలేదు రంభ.

ఎలా కనిపిస్తుంది అసలుంటేగా భూలోకంలో.

రాత్రి హోటల్లో ఇంత కతికి మళ్ళీ అన్వేషణ ప్రారంభించాడు ఫణీంద్ర.

అలా ఆ అన్వేషణ అర్ధరాత్రిదాకా

సాగింది.

ఈ వేళకింక లాభంలేదనుకుని గృహోన్ముఖుడవ్వగా, అతని ఖర్మకొద్దీ అప్పుడు జరిగిపోయిందొక ఘోరం!

అర్ధరాత్రిపూట అనుమానాస్పదంగా తిరుగుతున్న వ్యక్తిగా ఎంచి పోలీసులు పట్టుకున్నారు ఘోరంకాక మరేమిటి?

"ఎవడివిరా నువ్వు? ఎందుకురా ఈ చీకట్లో ఈ సందుల్లో తిరుగుతున్నావ్?" అని పోలీసులు గద్దించి అడగ్గా.

పోలీసుల్తో ఎక్స్‌పీరియన్స్ అదే ప్రథమం కావటాన్న ఉత్తపుణ్యానికే వణికిపోయాడు ఫణీంద్ర.

"నేనేం దొంగనీ గట్రాకానండీ!" అన్నాడు బెదురుగా.

"మరైతే ఈ చీకట్లో ఏం చేస్తున్నావ్‌రా?" అన్నాడొక పోలీసు చేతిలోని లాఠీని పైకెత్తుతూ.

పైప్రాణాలు పైనే పోయినై ఫణీంద్రకా లాఠీని చూడగానే.

పాముని చూస్తే ఎవరికైనా సరే భయమే అలాగే పోలీసు లాఠీని చూసినా.

అందుకే మరింతగా వణికిపోయాడు ఫణీంద్ర.

అతనలా వణికిపోవటం మరింత సందేహాన్ని కలిగించిందా పోలీసుల్లో.

"చెప్పరా ఏం చేస్తున్నావ్ చీకట్లో?"

పోలీసుల్తో పరాచికాలాడ్డంకన్నా నిజం చెప్పడమే మంచిదనిపించింది. "నా ప్రేయసి రంభకోసం వెతుకుతున్నాన్సార్!" అన్నాడు ఫణీంద్ర.

అతను చెబుతున్నది అక్షరాలా నిజమన్న సంగతి ఆ పోలీసులకేం తెలుసు?

"ఏం వేళాకోళంగా ఉందా?" అన్నాడు లాఠీని పైకెత్తిన పోలీసు దాన్తోనే అతని డొక్కల్లో ఓ చిన్న పోటుపొడుస్తూ.

దాంతో మరింత భయపడిపోయాడు ఫణీంద్ర.

"నన్ను కొట్టకండి సార్! నేనేం వేళాకోళం ఆడ్డంలేదు. నిజంగా నా ఫియాన్సీ పేరు రంభ. నేన్నిజంగానే ఆమెకోసం వెతుకుతున్నా..." అన్నాడు దీనంగా.

"నీ ఫియాన్సీ ఈ చీకటి సందుల్లో ఎందుకుంటుంది? అసలు నీ పేరేంటి? నువ్వేం చేస్తుంటావ్?" అడిగాడింకో పోలీసు.

"నా పేరు ఫణీంద్ర. కెనరా బ్యాంక్‌లో క్యాషియర్ని"

అతనొక బ్యాంక్ ఎంప్లాయ్ అని వినగానే పోలీసుల ధోరణిలో కాస్త మార్పొచ్చింది.

"కెన్ యూ ప్రూవిట్?" అనడిగాడో పోలీసు.

"వైనాట్?" అంటూ జేబులోంచి తన విజిటింగ్ కార్డ్ తీసి అతనికందించాడు ఫణీంద్ర.

దానిమీద అతని బ్యాంక్ అడ్రసూ, బ్యాంక్ ఫోన్ నెంబరూ అన్నీ ఉండటంతో కాస్త మెత్తబడ్డారు పోలీసులిద్దరూ.

"సారీ సార్ దొంగేమో అనుకున్నాం" అన్నాడిందాక లాఠీతో పొడిచిన పోలీసు.

"ఇలా ఎవర్నిపడితే వాళ్ళని దొంగ అనేసుకోవడమేనా?" కాస్త బాధగా అన్నాడు ఫణీంద్ర. 'నాది దొంగ మొహంలా ఉందా?' అనుకున్నాడు మనసులో.

"మరేం చెయ్యమంటారు సార్! ఎవరైనా సరే అనుమానించటం మాధర్మం. సరిగ్గా మూడ్రోజుల క్రితం ఈ సందులో ఒక షాపులో దొంగతనం జరిగింది. అందుకే మిమ్మల్ని అనుమానించాల్సివచ్చింది..." ఎక్స్‌ప్లనేషనిస్తున్న ధోరణిలో ఆ పోలీస్ అలా అనేసరికి "సర్లే సర్లే మీ డ్యూటీ మీరు సిన్సియర్‌గా చేస్తున్నారు. మంచిదేగా!" అనేశాడు ఫణీంద్ర అంతకన్నా ఏమనాలో తోచక.

దాన్ని కాంప్లిమెంటుగా భావించి మురిసిపోతూ "అద్సరే సార్! మీ ఫియాన్సీ ఈ వేళప్పుడిక్కడుంటుందని మీరెందుకనుకుంటున్నారు?" అంటూ రంభ గురించి ఆరా



తియ్యబోయాడు ఒక పోలీసు.

రంభ రాకపోకలు అన్నీ విచిత్రంగానే జరిగినై కాబట్టి ఈ విషయంలో వాళ్ళు నిజం చెప్పినా నమ్మరనిపించి "చిన్న ప్రణయకలహం లెండి. మూడ్రోజులదాకా నీ మొహం చూడనని చెప్పి వెళ్ళిపోయింది పొద్దున్న. ప్రేమ, పిచ్చీ రెండూ ఒకటేనని మీకు తెలియనిదేముందీ? అందుకే పిచ్చిపిచ్చిగా ఇలా ఎక్కడపడితే అక్కడ వెతుకుతున్నా సార్" అంటూ అతితెలివిగా ఓ పిచ్చి సమాధానం చెప్పాడు ఫణీంద్ర.

అదేవంత కన్విన్సింగ్‌గా లేకపోయినప్పటికీ బ్యాంక్ ఎంప్లాయ్‌తో ఎందుకొచ్చిన గొడవలెమ్మని, "సర్లే వెళ్ళిపోండి" అని సంయుక్తంగా అనేశారు ఆ పోలీసులిద్దరూ.

దాంతో బతుకు జీవుడా అనుకుంటూ అక్కడ్నుంచి ముందుకు సాగాడు ఫణీంద్ర.

ఆ పోలీసులిద్దరూ కాస్త మంచివాళ్లు కాబట్టి అతన్నంత తేలిగ్గా వదిలేశారు.

అదే వేరెవరయినా అయితే అతన్నా అర్థ రాత్రిపూట స్టేషన్‌కి లాక్కెళ్లి తెల్లార్లూ చావ బాదుండేవారు!

అదే అనుకుంది స్వర్గంలో ఉన్న రంభ కూడా.

ఆమె మనిషి అక్కడుందేగానీ మనసంతా ఫణీంద్రమీదే!

అందుకే అక్కడ్నుంచి అతన్నోకంట కని పెడుతూనే ఉందామె.

అంటే అతనిమీదామెకి ప్రేమో, మోహమో ఏదో ఉందనికాదు.

అతన్లో తానెన్నెన్నో ఆశల్ని రేపి వొచ్చింది కాబట్టి పాపమా మానవుడక్కడే మైపోతున్నాడోనన్న జాలి అంతే!

పోలీసులు ఫణీంద్రనలా వదిలేసేసరికి ఎంతో రిలీఫ్‌గా ఫీలై "హమ్మయ్య" అంటూ ఓ నిట్టూర్పు విడిచింది రంభ.

పక్కనే ఉన్న మేనక అది విని "ఏంటి హమ్మయ్య అంటున్నావు?" అనడిగింది కుతూహలంగా.

ఆ సమయంలో వాళ్లిద్దరూ ఒక స్వర్గోద్యానవనంలో విహరిస్తూ ఉన్నారు.

భూలోకంలోని ఇండియాకది అర్ధరాత్రే కానీ స్వర్గంలో రేయింబవళ్లేముంటాయ్? వాళ్ళకెప్పుడూ పగలేనాయె! ఎప్పుడూ వెల్తురేనాయె!

ఆ సమయంలో వాళ్లిద్దరే ఉన్నారక్కడ. మిగతా దేవనర్తకీమణులిద్దరూ అదే ఉద్యానవనంలోని ఒక సరస్సులో స్నానం చేస్తున్నారు. స్వర్గభాషలో స్నానం కాదది. జస్ట్ జలక్రీడ అంతే!

మేనక అలా అడిగి తనవంక కుతూహలంగా చూస్తుంటే 'చెప్తే తప్పేముందిలే' అనిపించి విషయం వివరించింది రంభ.

"పాపం ఆ మానవుడు నా కోసం ఎంతగానో వెంపర్లాడి పోతున్నాడు. నన్ను మర్చిపోలేక నానా పాట్లూ పడుతున్నాడు" అంది చివర్లో.

"అందుకని నువ్విక్కడ బాధపడుతూ కూర్చున్నావా?" చిత్రంగా చూస్తూ అడిగింది మేనక.

"బాధని కాదులేగానీ జాలి! నేను ప్రేమిస్తున్నట్టు చెప్పబట్టేగా నామీద అతను ఆశలు పెంచుకున్నాడు. అందుకేగా నన్ను మర్చిపోలేక ఇప్పుడిన్ని తిప్పలు పడుతున్నాడు? ఆ పోలీసులు వదిలేశారు కాబట్టి సరిపోయింది" అంది రంభ.

"అందుకేగా ఇప్పుడతనికి బుద్ధొచ్చింది"

అలా అని మేనక నవ్వుతుంటే సంగతేంటో అర్థంకాలేదు రంభకి. "ఏంటి నువ్ అంటున్నది?" అంది.

"అదంతే... అతనిమీద నువ్విక్కడ తెగ జాలి పడుతున్నావా? కానీ అతనక్కడేవంటున్నాడో చూడు..." అంది మేనక.

దాంతో రంభ రక్కున తన దృష్టిని భూలోకంలోని మిత్రద్వయం మీదకు మళ్లించింది.

ఫణీంద్ర ఇంట్లోనే ఉన్నాడు. ప్రభాకర్ అతనికెదురుగా ఉన్నాడు.

"అవున్రా... నువ్ చెప్పినా వినకుండా వెళ్ళినందుకు తగిన శాస్తే జరిగింది నాకు. లక్కీగా ఆ పోలీసులొదిలేశారు కాబట్టి సరిపోయింది. లేకపోతే చచ్చూరుకునేవాడ్ని. అసలే మన పోలీసులు లాకప్‌డెత్‌లు చేయడంలో సమర్థులు గదా! ఛఛ! చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయిన ఆ చపల చిత్తురాలి కోసం వెతకటం నువ్వన్నట్టు శుద్ధవేస్టు..." అంటున్నాడు ఫణీంద్ర ప్రభాకర్‌తో.

'నామీద అప్పుడే ప్రేమ చచ్చిపోయిందా?' అనుకుంది రంభ ఆశ్చర్యంగా.

"పోనీలేరా ఇప్పటికైనా కొంచెం బుద్ధి తెచ్చుకున్నావు సంతోషం" అని ప్రభాకర్ అంటే,

"కొంచెం కాదు పూర్తిగా బుద్ధొచ్చేసింది. ఈ క్షణంనుండి ఇంకామెని వెతకటం అనే ప్రశ్నేలేదు" అన్నాడు ఫణీంద్ర.

అదికాదు అనుకోబోయి పైకే అనేసిందామె.

"లేకపోతే మరేంటనుకున్నావ్? జీవితాంతం అతను నిన్నే తల్చుకుంటూ ఏడుస్తూ ఉంటాడనుకున్నావా? అలాంటి అమరప్రేమలు మానవులు రాసే కథల్లోనే ఉంటాయ్. నిజజీవితంలో ఉండవ్ .." తేలిగ్గా నవ్వేస్తూ చెప్పింది మేనక.

"పోనీలే! ఒకరకంగా నేను కోరుకునేది కూడా అదే. అతను నన్నే తల్చుకుంటూ బాధపడకూడదనే" అంది రంభ ఎలాగో మనసుని సముదాయించుకుంటూ.

"ఓ వారం రోజులాగి చూడు. అతడు నిన్ను పూర్తిగా మర్చిపోతాడో లేదో నీకే తెలుస్తుంది..." అంది మేనక ఓ పారిజాత పుష్పాన్ని తుంచి తల్లో తురుముకుంటూ

ఫణీంద్ర తననెంతో తేలిగ్గా మర్చిపోగలుగుతాడన్నమాట కొంత బాధ కలిగించినా, "అలా జరిగితే, మంచిదేలే! ఒక మానవుడు అనవసరంగా నా గురించి వ్యధాభరిత హృదయుడు కాకూడదన్నదే నా కోరిక" అనేసింది రంభ.

★ ★ ★

ఎందుకవుతాడు ఫణీంద్ర వ్యధాభరిత హృదయుడు.

ఆ మర్నాడు అతనికి ఇంటినుండి ఓ ఉత్తరం వచ్చింది.

వాళ్ళ స్వగ్రామంనుండి అతని తండ్రి రాశాడది.

అందులోని ముఖ్య విషయమేమిటంటే, "గోపాల్రావ్ అంకుల్ నీకో సంబంధం తెచ్చాడు. పిల్ల బియ్యే ప్యాసయింది. అమ్మా నాన్నలకి ఒక్కర్తే కూతురు. పాతికలక్షల ఆస్తికి ఏకైక వారసురాలు. పిల్లాడు బుద్ధిమంతుడైతే చాలు సాధారణమైన ఉద్యోగమైనా పర్లేదని వాళ్లంటే గోపాల్రావ్ అంకుల్ వాళ్లకి నీ గురించి చెప్పాడట. దానికి వాళ్లు సూచనప్రాయంగా అంగీకరించి అమ్మాయి ఫొటో ఇచ్చారట. దాన్నీ ఉత్తరానికి జతచేస్తున్నాను.

మీ అమ్మకీ, నాకూ, మీ అక్కయ్యకీ, అందరికీ నచ్చిందా అమ్మాయి.

ఇది చాలా మంచి సంబంధమనే అనుకుంటున్నాం మేమంతా.

నీక్కూడా ఈ ఫొటో నచ్చితే, వెంటనే ఉత్తరం రాయి. మిగతా విషయాలు నేనూ గోపాల్రావంకులూ చూసుకుంటాం.

నీ నిర్ణయం తెలిపేముందు ఆ పిల్ల పేరిట పాతికలక్షల ఆస్తుందన్న విషయం మర్చిపోకు.

ఇట్లు మీ నాన్న"

ఆ ఉత్తరాన్ని చదవటం పూర్తిచేశాక ఫొటోలోని అమ్మాయికేసి కాసేపు తదేకదీక్షగా చూశాడు ఫణీంద్ర.

చూశాక.. 'అబ్బ ఎంతందంగా ఉందీ! ఈమె ముందు రంభ కూడా బలాదూరే' అనుకున్నాడు ఫణీంద్ర.

అతనలా అనుకున్నది స్వర్గలోక రంభనుద్దేశించి కాదు. తన మాజీప్రేయసి రంభనుద్దేశించి కాదు. అభినేత్రి రంభనుద్దేశించి.

నిజంగా ఆ ఫొటోలోని అమ్మాయి అభినేత్రి రంభకన్నా అందంగా ఉన్నదా లేదా అన్నది ప్రశ్నే కాదిక్కడ.

ఆ అమ్మాయి పేరిట పాతికలక్షల ఆస్తున్నప్పుడు ముక్కు కొంచెం లావుగా ఉంటే మాత్రం అదో లోపంలా ఎలా అనిపిస్తుంది ఎవరికైనా?

అందుకే 'రంభేం ఖర్మ, ఇప్పటివరకు వెండితెరమీద వెలిగిన ఏ సుందరీమణి కూడా ఈమెతో సరిపోలదు. ఇట్టి సౌందర్యరాశిని భార్యగా పొందగలుగుతున్న నేనెంత అదృష్టవంతుడ్ని?' అని కూడా అనుకున్నాడు ఫణీంద్ర.

అతనలా అనుకున్నాడంటే తండ్రికి ఏమని ఉత్తరం రాయబోతున్నాడో వేరే చెప్పాలా?

★ ★ ★

ఓ వారం తర్వాత,

ఫణీంద్ర ఏం చేస్తున్నాడో చూద్దామని పించి స్వర్గంనుండే అతని మీదకు దృష్టి

సారించింది రంభ.

ఇండియాలో అప్పుడు సమయం రాత్రి పదకొండుగంటలు.

ఫణీంద్ర తన మంచంమీద నిద్రిస్తూ ఉన్నాడా సమయంలో.

"ఓ వారం రోజులాగి చూడు. అతను నిన్ను పూర్తిగా మర్చిపోతాడో లేదో నీకే తెలుస్తుంది" అని ఆరోజు మేనక అన్న తర్వాత అప్పట్నుంచి ఇప్పటిదాకా రంభ మళ్ళీ అతనికేసి చూడనేలేదు. ఆరోజు తర్వాత మళ్లీ ఇదే ఆమె అతనికేసి చూడటం.

కావాలంటే రోజూ చూడగలిగే శక్తుండి కూడా ఆమె ఎందుకలా చేసిందంటే... అతని మనసులో కలిగే మార్పుని స్టెప్‌బై స్టెప్ అబ్జర్వ్ చేయడంకన్నా, నిజంగానే ఓ వారంరోజులాగి చూస్తే అప్పటికతను తనని పూర్తిగా మర్చిపోగలిగితే, అది చాలా గమ్మత్తుగా అనిపిస్తుందికదాని అలా చేసిందామె.

నిద్రిస్తోన్న ఫణీంద్రకేసి తదేకంగా చూస్తూ 'ఇతను నన్నీపాటికి పూర్తిగా మర్చిపోయుంటాడా?' అనుకుంది రంభ మనసులో.

ఆమె అలా అనుకున్నదో లేదో నిద్రిస్తోన్న ఫణీంద్ర "రంభా... రంభా..." అంటూ కలవరించాడు.

అది చూసి 'మేనక అన్నది తప్పు. ఇతను నన్నింకా మర్చిపోలేకపోతున్నాడు' అనుకుంది రంభ.

అలా అనుకుంటుంటే ఆమెకెందుకోగాని కాస్త గర్వంగా అనిపించింది.

'మేనక ఏదో అలా అనేసిందిగాని రంభనైన నన్ను ఒక సామాన్యమైన మానవుడు అంత తేలిగ్గా మర్చిపోగలుగుతాడా?' అనుకుంటూ ఫణీంద్రకేసి మరింత పరిశీలనగా చూసింది.

"రంభా... రంభా..." అని అతనింకా కలవరిస్తూనే ఉన్నాడు.

ఆ కలవరింతలనాలకిస్తుంటే 'పాపం' అనిపించింది రంభకి.

అంతలో...

"ఏంట్రా రంభా రంభా అని కలవరిస్తున్నావ్?" అంటూ మిత్రుడ్ని తట్టాడు ఆ పక్కనే మరో మంచంమీద ఉన్న ప్రభాకర్. అతనింకా నిద్రపోలేదు.

కలవరిస్తున్నాడంటేనే కలత నిద్రలో ఉన్నట్టుగదా! మిత్రుడిలా తట్టేడో లేదో అలా దిగ్గున లేచి కూర్చున్నాడు ఫణీంద్ర.

అతను కళ్లు నులుముకుంటుంటే "ఏంటి రంభ పేరు కలవరిస్తున్నావ్? ఆ అమ్మాయిని నువ్వింకా మర్చిపోలేదా?" అనడిగాడు ప్రభాకర్.

"అహఁహఁ..." ఇంకా కళ్లు నులుముకుంటూనే అడ్డంగా తలాడించాడు ఫణీంద్ర.

స్వర్గలోకంలో ఉన్న రంభ గతుక్కుమంది.

'మరైతే నా పేరెందుకు కలవరించినట్టు?' అనుకుంది మనసులో.

ప్రభాకర్ కూడా ఆ ప్రశ్నే వేశాడు.

దానికి ఫణీంద్ర ఆముదం తాగినవాడిలా ముఖంపెట్టి, "నాకో పీడకలొచ్చిందిలే! అందుకే ఆ అమ్మాయి పేరు కలవరించా! అంతే తప్ప ఇంకా ఆమెని మర్చిపోకపోవడం ఏంకాదు" అన్నాడు.

"పీడకలా? ఏంటది?" ప్రభాకర్ అడిగాడు.

"నా ఉడ్‌బీ కుసుమ లేదూ? తనూ నేనూ అందమైన ఒక పూలతోటలో విహరిస్తున్నామట. అంతలో..."

అతనింకా చెబుతుండగానే 'ఉడ్‌బి కుసుమ! ఆవిడెవరు?' అనుకుంది రంభ మనసులో. కానీ ప్రభాకర్ అలాగేం అనుకోలేదు. ఎందుకంటే అతనికి కుసుమ గురించి తెలుసు. ఫణీంద్ర వాళ్ల అంకుల్ అతనికోసం చూసిన ఆ అమ్మాయి, పాతికలక్షల ఆస్తికి వారసురాలైన ఆ అమ్మాయి పేరు కుసుమ.

 

"ఊc అంతలో? " అన్నాడతను ఆసక్తిగా.

"అంతలో మొన్నటి రంభొచ్చి" అంటూ కంటిన్యూచేశాడు ఫణీంద్ర

"ఏం చేసింది మొన్నటి రంభొచ్చి? "

"ఏదో బుద్ధి గడ్డితిని మొన్న నీతో చెప్పా పెట్టకుండా వెళ్లిపోయాను, నన్ను క్షమించు. ఈ కుసుమని నువ్ చేస్కోవటానికి వీల్లేదు. నన్నే చేస్కోవాలి. ఈ కుసుమ ననేకాదు, నన్ను తప్ప నువ్వింకెవర్ని చేస్కున్నా నేనూర్కోను అంటూ నా చెయ్యి పట్టి గుంజింది..."

"అలాగా! అప్పుడు నువ్వేం చేశావ్? "

"ఛీఫో అంటూ ఆ డొక్కు మొహందాన్ని నెట్టిపారేశాను. అయినా ఆ మహాతల్లి వద ల్లేదు. స్ప్రింగులా పైకి లేచి నా గొంతు పట్టుకుంది. నీ తొలిప్రేయసినైన నన్ను నెట్టిపారేస్తావా? దీన్తో నువ్వెలా సుఖపడ తావో చూస్తాను. అసలు నిన్ను బతకని వ్వను అంటూ నా గొంతు పిసకటం ప్రారంభించింది..."

"అపుడేమయ్యింది? కలలో నువ్ చచ్చి పోయావా? "

"నేనేం చవటనా అంత తేలిగ్గా చచ్చిపోవ టానికి? శక్తినంతా కూడగట్టుకుని ఆ పిశా చిని మళ్లీ నెట్టిపారేశాను..."

ఫణీంద్ర తనని పిశాచి అంటున్నందుకు చాలా చాలా బాధగా అనిపించింది రంభకి.

'మొన్నటిదాకా అంతిదిగా నన్ను ప్రేమించినవాడు ఇంతలోకే ఎంతగా మారిపోయాడు? ఛ!ఛ!' అనుకుంది ఆవేదనగా.

"అప్పుడేమైంది? " ప్రభాకర్ అడిగాడు ఫణీంద్రని.

"ఆ రాకాసి మళ్లీ స్ప్రింగులా పైకిలేచి ఓ పెద్ద బండరాయిని అమాంతంగా పైకిలేపి నా మీదకి విసరబోయింది. నేను వద్దన్నట్టు సైగచేస్తూ భయంతో రంభా... రంభా అనరిచాను. అంతలో నువ్ నన్ను నిద్రలేపేశావ్..." చెప్పటం ముగించి దుప్పటితో ముఖం తుడుచుకున్నాడు ఫణీంద్ర.

"అలాగా! మొత్తానికి భలే పీడకలే" అంటూ నవ్వేశాడు ప్రభాకర్.

"సర్లే వెల్లికిలా పడుకుంటే ఇలాగే పీడ కల లొస్తాయ్! ఓ పక్కకి తిరిగి సరిగ్గా పడుకో..." అన్నాడు నవ్వటం అయ్యాక.

"కుసుమ కాలిగోటి క్యూడా సరిపోదా రంభ! అలాంటిది ఎంతాశ కాకపోతే నన్నే చేస్కో, దాన్ని చేస్కోవటానికి వీల్లేదని అడ్డు తగుల్తుందీ? " అంటూ మిత్రుడి సలహాని పాటిస్తూ ఓ పక్కకు తిరిగి పడుకున్నాడు ఫణీంద్ర.

"సర్లే సర్లే. పీడకలల్ని తొందరగా మర్చిపోవాలి. పదేపదే తల్చుకోకూడదు..." అనేశాడు ప్రభాకర్.

ఇదంతా చూసిన రంభకి మానవజాతి మీదే విరక్తి ఏర్పడిపోయింది.

'ఛీ! ఇంకెప్పుడూ ఈ మనుషుల్ని గురించి ఆలోచించనే కూడదు' అనుకుంది.

అయినప్పటికీ మనసుండబట్టక ఒక్కసారి తన దృష్టిని కుసుమ అనే అమ్మాయి మీదకు మరల్చింది.

ఆమెని చూస్తుంటే ప్రత్యేకించి ఫణీంద్ర మీద మరొక్కసారి ఏవగింపు కలిగింది రంభకి.

'ఏంబావుండి చచ్చిందని ఈ అమ్మాయి? ఇంతలావు ముక్కేస్కుని అసలేవన్నా బావుందా? అలాంటిది దాని కాలిగోటి క్యూడా నేను సరిపోనంటాడా హుc...!' అనుకుంది బాధగా.

ఇలాంటి అల్పమానవుల మధ్యనా తను శాశ్వతంగా ఉండిపోవాలనుకుంది?

ఎంత తప్పుడాలోచన?

దేవేంద్రులవారు కుయుక్తిపన్ని తనని వెనక్కి రప్పించారు కాబట్టి సరిపోయింది గాని, లేకుంటే తన బతుకు నాశనమైపోయుండేదే!

ఆకలిదప్పుల్తో అఘోరిస్తూ ఎప్పటికీ ఆ అల్పమానవుల మధ్య...



అలా అనుకుంటుంటే సడన్‌గా ఆ ఆలోచనకి బ్రేక్‌పడి అభినేత్రి రంభ గుర్తుకొచ్చిందామెకి.

ఆ రంభతో పోటీ పడాలనుకున్న తను అర్థాంతరంగా ఇలా తిరిగొచ్చేసింది అంటే ఒక అల్పమానవురాలితో తానోడిపోయినట్టే గదా?

అలా అన్పించిందిగానీ, ఆ వెంటనే చఛ అదేం కాదులే అని కూడా అన్పించిందామెకి

ఫేస్ టు ఫేస్ ఆమెతో తనేవన్నా ఛాలెంజ్ చేస్తేగదా- ఓడిపోయినట్టు?

అలాంటిదేం లేనప్పుడు గెలుపోటముల ప్రశ్నేముంటుంది?

అఫ్‌కోర్స్ తిలోత్తమతో తనోడిపోయిన మాట నిజమే కావచ్చు. కావచ్చేంటీ నిజం. తన వడ్డాణం కూడా ఇంకా దాని దగ్గరే ఉండిపోయిందిగా. కానీ... తిలోత్తమ అల్ప మానవురాలేం కాదుగా? సాటి దేవనర్తకీమణాయె! ఒక దేవనర్తకీమణి చేతిలో మరో దేవనర్తకీమణి ఓడిపోవటం పెద్ద సిగ్గుపడాల్సిన విషయమేం కాదు.

సో... ఇప్పటికైనా సరే జరిగిందంతా మర్చిపోయి సుఖంగా ఉండటం మేలు.

ఆ కోన్‌కిస్కా వెధవ గురించి ఆలోచిస్తూ టైం వేస్ట్ చేసుకోవటం శుద్ధ అనవసరం.

వాడికొచ్చింది కాదు పీడకల. తనకెదురైన ఈ అనుభవమే ఒక పీడకల. కాబట్టి దీన్నింక పూర్తిగా మర్చిపోవాలి.

ఇంక చచ్చినా ఆ ఫణీంద్రకేసిగానీ, కాదు కాదు అసలా భూలోకంకేసే చూడకూడదు.

అలా ఓ గట్టి నిర్ణయం తీసుకున్నాక మనసు స్థిమితపడినట్టుగా అనిపించింది రంభకి.

అదే నిర్ణయానికి కట్టుబడిపోయి ఆమె మళ్లీ చాలాకాలందాకా భూలోకంకేసి చూళ్లేదు.

★ ★ ★

ఏడాది తర్వాత ఒకరోజు.

ఆవేళ ఆఫీసునుండి ఓ అరగంట లేటుగా ఇంటికొచ్చాడు ఫణీంద్ర.

దార్లో స్కూటర్ చెడిపోతే దాన్ని రిపేర్ చెయ్యించుకొచ్చేసరికి కాస్త లేటయ్యింది.

"ఎందుకింత లేటయ్యింది?" అని కుసుమ అడగ్గా, నిజమే చెప్పాడు ఫణీంద్ర.

అయినా ఆమె నమ్మలేదు.

"కథలు చెబుతున్నారా?" అంది కొర కొరా చూస్తూ.

"ఇందులో పెద్ద కథేముంది, స్కూటర్ చెడిపోయిందన్న సింపుల్ ఫాక్ట్‌ని సింపుల్‌గా చెప్తేనూ?" అన్నాడు ఫణీంద్ర కాస్త భయపడుతూనే!

అసలు భార్యంటేనే భయపెట్టేది అని అర్థం. అలా పాతిక లక్షల ఆస్తికి ఏకైక వారసురాలైన భార్య సంగతి ఇంక చెప్పేదేముంది?

"మీరు చెప్పింది ఫాక్టా, స్టోరీనా అన్నది నా కనవసరం. పొద్దున్న మీరు బ్యాంకు కెళ్తున్నప్పుడు నేనేం చెప్పాను" అతనికేసి ఎర్రగా చూస్తూ అడిగింది కుసుమ.

"ఏం చెప్పావు?" నిజంగానే మర్చిపోయిన ఫణీంద్ర బుర్రగోక్కుంటూ అడిగాడు.

"సాయంత్రం త్వరగా వచ్చేయండి సినిమాకెళ్దాం అన్నాగా?" ఈసారి గుర్రుగా చూస్తూ అడిగింది కుసుమ.

పేరుకే కుసుమ. కోమలత్వం అనేది ఈ రాకాశిలో మచ్చుకైనా లేదనుకున్న ఫణీంద్ర "చెప్పావ్ రైటే... కానీ దార్లో స్కూటర్ చెడిపోతే నేనేం చేసేది? అదలా చెడి చస్తుందని నాకేవన్నా ముందే తెలుసా?" అన్నాడు నుదురు చిట్లిస్తూ.

"చెడి చస్తే దాన్నక్కడే వదిలేసి ఏ ఆటోలోనో వచ్చేయాలి. అంతేగానీ దాన్ని రిపేరు చేయిస్తూ కూర్చోడం ఏంటి? భార్య మాటకు ఇదేనా మిరిచ్చే విలువ?" ఈసారి మిర్రిమిర్రి చూసింది కుసుమ.

ఆ చూపుకి ఒళ్లంతా జెర్రులు పాకుతున్నట్టుగా అనిపించింది ఫణీంద్రకి.




డబ్బున్న మనుషుల కహంకారం ఇలాగే ఉంటుందనుకున్నాడు లోలోన బాధగా.

"సారీ తప్పైపోయింది. పోనీ సెకండ్ షోకి వెళ్దాంలే" అన్నాడు తలదించుకుంటూ.

"సెకండ్ షో నా కంటికి పడదని మీకు తెలీదా? నేను నిద్రకాగలేనని మీకు తెలీదా? నేను ఫస్ట్‌షో మాత్రమే చూస్తానని మీకు తెలీదా? "

"తెలుసు... సారీ అన్నాగా... సెకండ్ షో వద్దనుకుంటే పోనీ రేపు వెళ్దాంలే ఫస్ట్ షోకి..." చెట్టంత మనిషయ్యుండి కూడా చేతులు నలుపుకున్నాడు ఫణీంద్ర.

అసలే భార్య. అందునా డబ్బున్నది. చేతులు నలుపుకోక కాలరెగరెయ్యగలుగుతారా ఎవరైనా?

"ఆ సంగతి తమరు చెప్పాలా? " అని మూతిముడిచి విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయింది కుసుమ.

అలిసిపోయి ఇంటికొచ్చిన తనకి గుక్కెడు కాఫీనీళ్లైనా ఇవ్వకుండా, పైపెచ్చు అలా మెదడు తినేసి పోయిన భార్యమీద చచ్చేంత కోపమొచ్చింది ఫణీంద్రకి.

అయినా చెయ్యగలిగిందేముంది?

ఆస్తున్న పెళ్ళాం మీద అరవలేడు గదా! అరిచినా ఆమె ఊరుకోదు. గదా! అందుకే సైలెంట్‌గా కిచెన్‌లోకి దూరిపోయి కాఫీ కాచుకోవడంలో నిమగ్నమైపోయాడు ఫణీంద్ర.

ఓ రెండుమూడు నిముషాల తర్వాత అతనికి కుసుమ రూంలోంచి ఏవేవో వింత ధ్వనులు వినిపించాయ్.

సతీమణి అక్కడున్న వస్తువులన్నిట్నీ విసిరి నేలకేసి కొడ్తోందని అర్థమైపోయిందతనికి.

ఇదెక్కడి మెంటల్ కేసురా భగవంతుడా అనుకున్నాడు మనసులో.

అమ్మానాన్నలకి ఒక్కతే కూతురు కాబట్టి, చిన్నప్పట్నుంచి అతిగారాబంగా పెరిగింది కాబట్టి, అనుకున్నది అనుకున్న వెంటనే అవ్వకపోతే చిన్నప్పట్నుంచీ ఆమె అంతే! చేతికందినవన్నీ నేలకేసి కొట్టి నానా రభసా చేస్తూంటుంది. అట్టి తరుణంలో ఎవరైనా అడ్డు పడబోతే మరింత రెచ్చిపోతుందే తప్ప చచ్చినా శాంతించదు.

ఏడాదినుంచి ఆమెతో కాపురం చేస్తున్న ఫణీంద్రకావిషయం తెలిసిందే కాబట్టి అతనాసమయంలో భార్య దగ్గరికెళ్లే సాహసం చెయ్యలేకపోయాడు.

ఎలా సాహసించగలుగుతాడు? గతానుభవాలు ఒకటా రెండా?

ఒకసారిలాగే ఏదో విషయంలో రభస చేస్తుంటే, అనగా వివిధ వస్తువుల్ని నేలకేసి కొట్టుట అనే కార్యక్రమాన్ని సాగిస్తుంటే "ఎందుకు వాటన్నిట్నీ అలా నాశనం చేస్తా" వంటూ రంగప్రవేశం చేశాడు ఫణీంద్ర.

"నా ఇష్టం నేనేమైనా చేస్తాను. ఆపడానికి మీరెవరూ? " అంటూ ఓ ఇత్తడి ఫ్లవర్‌వాజ్‌ని నేలకేసి కాకుండా అతనికేసే విసిరికొట్టిందామె.

ఫలితంగా నుదుటికి గాయమయి, ఆ గాయం మానేదాకా అయిదార్రోజులు నానా అవస్థపడ్డాడతను.

ఇంకోసారిలాగే ఆమె ప్రళయతాండవం చేస్తుంటే చూస్తూ ఊర్కోలేక "మరీ అంత ఇది పనికి రా"దన్నాడతను.

"నాకే పాఠాలు చెప్తారా? " అంటూ నేలకేసి కొట్టబోయిన పేపర్ వెయిట్‌ని అతని నెత్తికేసి విసిరిందామె.

అపుడతని నెత్తికి పడిన కుట్ల సంఖ్య ముచ్చటగా మూడు మాత్రమే.

అట్టి అనుభవాల్ని డజన్లకొద్దీ ఎదుర్కొని ఉన్నవాడు కావటాన్న, కుసుమ గదిలోంచి వింత ధ్వనుల తీవ్రత హెచ్చుతున్నా కూడా పట్టించుకోకుండా అతను చాలాసేపు అలాగే ఉండిపోయాడు.

కాసేపటికా విధ్వంస కాండను ముగించి తన గదిలోంచి బైటికొచ్చింది కుసుమ.

## సచిత్ర విచిత్రం

# ముద్దుగుమ్మ ముత్యాలు, వజ్రాలు



ప్రపంచంలో ఎక్కువ సార్లు వివాహం చేసుకున్న హాలీవుడ్ నటిగా ఎలిజబెత్ టేలర్ పేరు సుపరిచితం. అయితే ఇతర హాలీవుడ్ నటీమణులకన్నా ఈమె వద్ద ఎక్కువగా వజ్రాలున్నాయన్న విషయం కొంతమందికే తెలుసు. మొదటి చిత్రంలో ఉన్న ముత్యాల నెక్లెస్ 1969 లో ఆమె భర్త రిచర్డ్ బర్టన్ బహుమతిగా ఇచ్చాడామెకు. దాని ధర 3,70,000 డాలర్లు. రెండవ చిత్రంలోని ఎమరాల్డ్, డైమండ్స్ గల నెక్లెస్ కూడా 1964 లో వివాహానికి పూర్వం రిచర్డ్ బర్టన్ ఆమెకు బహూకరించాడు. దాని ధర 6,84,000 డాలర్లు. మూడో చిత్రంలోని డైమండ్ పెండెంట్ నెక్లెస్ లోని డైమండ్ 69.42 కేరెట్ల బరువుంటుంది. దాని ధర 30 లక్షల డాలర్లు. 1970 లో దీన్ని కూడా రిచర్డ్ బర్టన్ లిజాకి బహూకరించాడు. నేటి వాటి మార్కెట్ విలువ కోటి డాలర్ల దాకా పలుకుతుంది.

అపుడు ఫణీంద్ర హాల్లో కూర్చుని టీవీ చూస్తున్నాడు.

"ఏంటి మీరు చూస్తోంది?" చరచరా అతన్దగ్గరికొచ్చి చురచురా చూస్తూ అడిగింది కుసుమ.

'అదే కన్పించటంలా, పాడుతా తీయగా" అన్నాడు ఫణీంద్ర.

"నా మొహమేంగాదూ?" అంటూ టీపాయ్ మీదున్న రిమోట్‌ని చటుక్కున చేతిలోకి తీసుకుని టీవీ ఆఫ్ చేసేసింది కుసుమ.

కోపంలో ఉన్నప్పుడామె చేష్టలలాగే ఉంటాయి. ఎప్పుడేం చేస్తుందో తెలీదు. ఎందుకు చేస్తుందో తెలీదు.

"ఎందుకు టీవీ ఆఫ్ చేసేశావ్?" కాస్త భయంగానే అడిగాడు ఫణీంద్ర.

"లేకపోతే ఏంటి. ఒకపక్క నేను పిచ్చికోపమొచ్చి అల్లాడుతుంటే మీరిక్కడ తీరుబాటుగా టీవీ చూస్తూ కూర్చుంటారా?"

చేతలకే కాదు కోపమొచ్చినప్పుడామె మాటలక్కూడా ఓ అర్థంపర్థం ఉండదని తెలుసుకాబట్టి మౌనంగా ఉండిపోయాడు ఫణీంద్ర.

అంతమాత్రాన్న ఊరుకునే రకమా? "ఏం మాట్లాడరేం?" అంటూ గదమాయించింది కుసుమ.

"ఏం మాట్లాడమంటావ్?" అంటూ ఓ వెర్రి నవ్వు నవ్వాడు ఫణీంద్ర.

"అడిగిందానికి సమాధానం చెప్పండి. నేనక్కడ కోపంతో అల్లాడుతుంటే మీరిక్కడ టీవీ..." అతిగా ఆవేశపడిపోతూ మాట పూర్తిచేయలేకపోయింది కుసుమ.

"తప్పేలే- ఇంతకీ నీ కోపం తగ్గటానికి నన్నేం చేయమంటావ్?" అన్నాడు ఫణీంద్ర నిజంగానే ఏదో ఘోరమైన తప్పు చేసేసిన వాడిలా ముఖం పెడుతూ.

"హు" అని హుంకరించి ఏమీ చెప్పకుండానే మళ్ళీ తన గదిలోకి వెళ్ళిపోయింది కుసుమ.

'అర్థంలేని ప్రవర్తన!' అనుకుంటూ తలపట్టుకుని కూర్చున్నాడు ఫణీంద్ర.

అలా తలపట్టుకోగానే అతని తలపుల్లోకెందుకోగాని రంభ ప్రవేశించింది.

ఆ అమ్మాయి ఎంత మంచిది?

అనుకోకుండా తన జీవితంలోకి ప్రవేశించి మళ్లీ అనుకోకుండానే వెళ్లిపోయింది.

ఒక మలయమారుతంలా, ఒక వసంతంలా, ఒక వెలుగు రేఖలా ఇలా వచ్చి అలా వెళ్లిపోయింది.

ఆమె ఆ రోజు అలా సడన్‌గా వెళ్లిపోకపోయుంటే ఎంత బాగుండేది? ఆమె వెళ్లిపోయింది కాబట్టే తన మనసీ కుసుమ మీదకు మళ్లింది.

లేకుంటే తప్పకుండా ఆమెనే పెళ్లి చేసుకునేవాడు తను. అదే గనుక జరిగితే ఇపుడు తన జీవితం ఎంత హాయిగా ఉండేది?

రంభ ఈ కుసుమలా మెంటలేం కాదు కాబట్టి తనూ ఆమె ఎంతో అన్యోన్యంగా ఉండగలిగేవాళ్లు.

ప్చ్.. అంతా తన దురదృష్టం! ఉత్తపుణ్యానికి తన జీవితం నరకమైపోయింది.

కుసుమ నిజంగా మెంటలేం కాకపోవచ్చు అయితే తను డబ్బుందన్న అహంకారంతో పిచ్చిపిచ్చిగా ప్రవర్తించి తనక్కూడా పిచ్చెక్కేలా చేస్తుంటుందామె.

కుసుమ ప్లేస్‌లో రంభే గనుక ఉంటే అలా ప్రవర్తించేదా?

నో ఎంతో ప్రేమగా చూసుకునేది తనని.

అలాగే తను కూడా ఆమెని ఎంతో ప్రేమగా చూసుకునేవాడు.

సో ఇద్దరి జీవితాలూ బాగుండేవి?

'అదీగాక ఆమె అలా వెళ్లిపోకపోయుంటే ఈపాటికి హీరోయిన్ కూడా అయ్యుండేదే! ఎందుకంటే ఆమె వెళ్లిపోయిన అయిదార్రోజుల తర్వాత వెంకన్నగారు మళ్లీ మనిషిని పంపించారామెకోసం. తన సొంత ఫిల్మ్‌లో రంభకోసం ప్రత్యేకంగా ఓ క్యారెక్టర్ క్రియేట్ చేశారట ఆయన. వచ్చిన మనిషి

చెప్పాడలాగని.

కానీ అవకాశాన్ని ఉపయోగించుకోవడానికి రంభ ఉండేడిస్తేగా? ఎక్కడికో వెళ్లిపోయిందామె. ఆ వచ్చిన మనిషికి ఏం చెప్పాలో , తెలియక నార్త్ ఇండియాలో ఇంకో బావ ఉంటే రంభ ప్రస్తుతం అక్కడికెళ్లిపోయిందనీ ఊరుగానీ అడ్రస్‌గానీ తెలీదనీ ఏదేదో చెప్పి పంపేశారు తామిద్దరూ.

దాంతో వెంకన్నగారు మిన్నకుండిపోయారు. లేకుంటే రంభ ఈపాటికి సినీనటి రంభశ్రీగా ఓ వెలుగు వెలిగిపోతూ ఉండేది.

ప్చ్! అదృష్టం లేకపోయిందామెకి.

అసలిపుడామె ఎక్కడుందో ఎలా ఉందో సుఖంగా ఉందో లేక కష్టాలు పడుతోందో?

ఆ రంభ అయితే తన జీవితం నుండి వెళ్లిపోయిందిగాని, ఆమె అయితే సినిమా హీరోయిన్ కాలేకపోయిందిగానీ ఆమె పుణ్యమాని బ్యాంకులో మాత్రం తనకో నిక్‌నేమ్ శాశ్వతంగా మిగిలిపోయింది.

ఇప్పటికీ తననందరూ హీరోయిన్ మొగుడని ఎగతాళి చేస్తుంటారు బ్యాంకులో.

మానేజరైతే ఇంకా అడుగుతూనే ఉంటాడు. ఏవయ్యా నీ భార్య వెంకన్నగారి ఫిల్మ్‌లో నటించడం ఎంతవరకొచ్చిందని.

'ఆ ప్రేమకథ ముగిసిపోయింది సార్! నేనిపుడు చేస్కున్నది వేరే అమ్మాయిన'ని ఎన్నిసార్లు చెప్పినా కూడా సందుదొరికినపుడల్లా అలా అడుగుతూనే ఉంటాడాయన.

అదో వినోదమాయనకి.

బ్యాంకులో చూస్తే అలా నవ్వుల పాలైపోయాడతను.

ఇంట్లో చూస్తే ఇలా నరకంలా తయారైంది తన బతుకు.

తనకన్నా ఆ ప్రభాకర్‌గాడే నయం.

అలనాడు ఆ పెళ్లి చూపుల్లో నచ్చిన ఆ అమ్మాయినే పెళ్లి చేసుకుని ఎంతో సుఖంగా జీవిస్తున్నాడామెతో. ఆమె ఒక మామూలు స్త్రీ. అంతేగానీ పాతిక లక్షల ఆస్తున్నది కాదుగా.

అందుకే ఎంతో అన్యోన్యంగా ఉండగలుగుతున్నారు వాళ్లిద్దరూ. అదీగాక అలనాడు వెంకన్న గారన్న మాటల్ని మనసులో పెట్టుకుని సొంత ఐడియాలో రెండు మూడు కథలల్లి వాటిలో ఒకదాన్ని ఈమధ్యనే సినిమా వాళ్లకి అమ్ముకోగలిగాడు వాడు.

నిర్మాణం ఇంకా ప్రారంభం కాలేదుగానీ రేపొద్దున్న ఒకవేళ ఆ సినిమా గనుక హిట్టయితే రచయితగా ఎక్కడికో ఎదిగిపోతాడు వాడు.

ఆ తర్వాత వాడు బ్యాంక్ జాబ్ మానేసినా ఆశ్చర్యపోనక్కర్లేదు.

ఎటొచ్చీ తన పరిస్థితే ఇలాగైపోయింది. తానింక జీవితాంతం కుసుమతో ఇలా పాట్లు పడుతూ ఉండాల్సిందేగా?

ఒకసారి పెళ్లనేది చేసుకున్నాక ఫేట్ 'సీల్' అయిపోయినట్టే.

కుసుమ ప్లేస్‌లో వేరొకర్ని ఊహించుకోవడానిక్కూడా వీల్లేదుకదా!

అలా అనుకుంటుంటే మనసంతా భారంగా అయిపోయింది ఫణీంద్రకి.

ఏం ఎందుకూహించుకోకూడదు? కుసుమ ప్లేస్‌లో కాసేపా రంభనే ఊహించుకుంటే పోలా?

ఊహల్లో ఆనందాన్ని పొందే హక్కు ఎవరికైనా ఉంటుంది. కుసుమ తన మనసులోకి తొంగి చూసి దాన్నేం హరింపజేయలేదుగా?

అలా అనుకున్నాక అతని మదిలో ఒక ఊహా చిత్రం మెదిలింది.

★ ★ ★

అప్పుడే బ్యాంకు నుండి ఇంటికొచ్చాడు ఫణీంద్ర.

స్కూటర్‌కి స్టాండ్ వేసి మెట్లెక్కి అతను వరండా మీదకొచ్చేసరికి నవ్వుతూ ఎదురైంది రంభ.

అబ్బ ఎంత మంచి భార్య! ఈ చిరునవ్వుని చూసి ఎంత కష్టాన్నైనా ఇట్టే మర్చి




పోవచ్చు అనుకున్నాడతను ప్రేమగా ఆమె కేసి చూస్తూ.

"ఏమిటండీ అలా చూస్తున్నారు? " అని బిడియంగా అడిగింది రంభ.

"నీలాంటి అందమైన భార్యకేసి ఎవరైనా సరే ప్రేమగానే చూస్తారు" అన్నాడు ఫణీంద్ర ఆమెకేసి మరింత ప్రేమగా చూస్తూ.

"అబ్బ! పద్దాక నా అందాన్ని పొగడ్డం తప్ప వేరే పనేం లేదా మీకు? " చిరుకోపాన్ని వ్యక్తం చేసి "ఎంత అలసిపోయొచ్చారో! ముందింట్లోకి నడవండి కాఫీ ఇస్తాను" అంది రంభ.

"ఊహూ! నాకు కాఫీ వద్దు" అడ్డంగా తలాడిస్తూ అన్నాడు ఫణీంద్ర

"మరేం కావాలి? పోనీ బూస్ట్ ఇవ్వనా" అంది రంభ.

"ఊహుం... అదీవద్దు"

"మరింకేం కావాలి? పోనీ రస్నా కలిపివ్వనా? "

"ఉహుహు... అదీ వద్దు"

"పోనీ చల్లటి మజ్జిగ? "

"అవేమీ వద్దు. నాకు నీ అధరామృతం కావాలి" అన్నాడు ఫణీంద్ర ఎర్రటి రంభ పెదవులకేసి ఆశగా చూస్తూ.

"పద్దాక అదే ధ్యాస మీకు" అంటూ ప్రేమగా అతని బుగ్గమీద గిల్లి. "ఇస్తాన్లే రండి లోపలి"కంటూ చేయిపట్టుకుని అతన్నింట్లోకి నడిపించుకెళ్లింది రంభ.

అధరామృతం జుర్రుకోవడమయ్యాక

"ముందెళ్లి స్నానంచేసి రండి" అతను తనని చుట్టేసుకోబోతుంటే నెట్టేస్తూ కసిరింది రంభ.

"మొండి..." అని ముద్దుగా కసురుకున్నాడు ఫణీంద్ర.

"ఎవర్ని మొండంటున్నారు? " సరిగ్గా అప్పుడే మళ్లీ తన గదిలోంచి అక్కడికొచ్చిన కుసుమ అతనికేసి క్రోధంగా చూస్తూ ఉరిమింది.

అందమైన ఆ ఊహా చిత్రం చెరిగిపోగా మనసులోని మధురిమంతా కరిగిపోగా "అబ్బేఅబ్బే ఏంలేదు" అన్నాడు ఫణీంద్ర భయంగా.

"బుకాయించకండి. నన్ను తప్ప ఇంకెవర్నంటారు మీరు? నేను తప్ప ఇక్కడెవరున్నారని" మళ్లీ ఉరిమింది కుసుమ.

నిన్నేం అన్లా నీ స్థానంలో రంభని ఊహించుకుంటున్నా మనసులో అని ఫణీంద్ర ఆమెతో ఎలా చెప్పగలడు?

అందుకే దొరికిపోయిన దొంగలా తలవాల్చేసుకున్నాడు.

"మాట్లాడరేం? " ఉరుము తీవ్రత హెచ్చిందీసారి.

ఏం మాట్లాడను? అని మనసులో అనుకుని "సారీ తప్పైపోయింది" అన్నాడు ఫణీంద్ర.

పాతిక లక్షల ఆస్తికి ఏకైక వారసురాలైనట్టి మనిషి చిన్న సారీతో ఎందుకు సరిపెట్టుకుంటుంది? "ఏంటి సారీ నా బొంద సారీ? నన్ను మొండి అంటారా? ఇదేనా మీరు భార్యకిచ్చే గౌరవం? " అంటూ తన సహజమైన ధోరణిలో మళ్లీ రాద్ధాంతం ప్రారంభించేసింది కుసుమ.

ఫలితంగా ఆ గదిలోని అనేకానేక వస్తువులు ఫ్లయింగ్ సాసర్స్‌లా గాల్లోకెగిరి ఆనక భూపతనం చెంది పనికిరాకుండా అయిపోయాయ్!

దరిమిలా ఆమె మళ్లీ తన గదిలోకెళ్లిపోగా శిథిల వస్తువుల మధ్య ఒంటరిగా మిగిలిపోయిన ఫణీంద్ర "ఛీపాడు జీవితం" అనుకున్నాడు బాధగా.

★ ★ ★

అది చూసి కిసుక్కున నవ్వింది రంభ.

"ఏంటి నవ్వుతున్నావ్? " కుతూహలంగా అడిగిందా సమయంలో ఆమె పక్కనే ఉన్న మేనక.

"లాస్టియర్ నేను హీరోయిన్నవుదామని కొన్నాళ్లు భూలోకంలో ఉండిపోయినప్పుడు

ఒకబ్బాయిని పెళ్లి చేసుకుందామనుకున్నాను చూడూ అతని పాట్లు చూస్తుంటే నవ్వొచ్చింది" చెప్పింది రంభ చిరునవ్వు లొలికిస్తూ.

"అంటే నువ్వింకా మర్చిపోలేదా అతన్ని"

"అహ ఎప్పుడో మర్చిపోయాను".

"మరైతే ఎందుకు చూసినట్టతని వంక? "

"ఏడాదైపోయిందిగదా భూలోకం కేసి చూసి ఇపుడతనెలా ఉన్నాడోననిపించి ఊర్కే సరదాకి చూశానంతే"

"ఎలా ఉన్నాడు? "

"కుసుమనే ఓ గయ్యాళిని చేస్కుని నానా అవస్థలూ పడుతున్నాడు. మనసులో నన్నింకా తల్చుకుంటూనే ఉన్నాడు" కాస్త గర్వంగా చెప్పింది రంభ ఆ తర్వాత తాను చూసిందంతా వివరంగా చెప్పుకొచ్చింది.

"దానికి నవ్వటం దేనికి? పడితే గిడితే జాలిపడాలిగానీ? " అంది మేనక.

"అది కాదులే. ఒకప్పుడా కుసుమ ఫొటోని చూసి దాని కాలిగ్గోటికివ్వాడా నేను సరిపోననుకున్నాడు అలాంటిదిపుడామె స్థానంలో నన్నూహించుకుని అతను తృప్తిపడుతుంటే నాకు నవ్వొచ్చిందంతే" చెప్పింది రంభ.

"దాందేముందీ? మానవులు ఏఎండకాగొడుగు పట్టడంలో సమర్థులు. సందర్భాన్ని బట్టి వాళ్ల థాట్స్ మారిపోతుంటాయ్. ఆ కుసుమ కన్నా నువ్వే బెటరని అతనిపుడనుకుంటే అనుకునుండొచ్చు. కానీ అది తాత్కాలికం. అదే మనిషి మరి కాసేపటికి ఇంకోలా అనుకోవచ్చు" నాలుక చప్పరిస్తూ తేలిగ్గా అనేసింది మేనక.

"అంటే? " అంది రంభ కళ్లెగరేస్తూ.

"భార్యాభర్తలన్నాక పగలంతా ఎంతగా కీచులాడుకున్నా రాత్రయ్యాక ఒకటైపోతుంటారు. పగలు జరిగినవన్నీ మర్చిపోయి తమలాంటి అదృష్టవంతులు మరెక్కడా లేరనుకుంటూ అవన్నీ పైకి చెప్పకూడదులేగానీ ఇపుడు భూలోకంలో టైమెంత? " అనడిగింది మేనక.

"పావు తక్కువ తొమ్మిది" చెప్పింది రంభ.

"ఇపుడు వాళ్లిద్దరూ ఏం చేస్తున్నారు? "

"ఒకరికేసొకరు క్రోధంగా చూస్కుంటూ భోజనాలు చేస్తున్నారు" భూలోకంలోకి చూసి చెప్పింది రంభ.

"కానీ ఆ క్రోధం వాళ్లలో అలాగే ఏం ఉండిపోదు. మరో రెండు గంటల తర్వాత చూడు అప్పుడు నీకే తెలుస్తుంది" అంది మేనక.

'ఏంటి తెలిసేది నా మొహం! అతనింక జీవితాంతం అలా అల్లాడుతూ ఉంటాడు. నన్ను చేస్కో లేకపోయినందుకు బాధపడుతూనే ఉంటాడు. నన్ను తల్చుకుని కుమిలిపోతూనే ఉంటాడు' అని మనసులో అనుకుని పైకి మాత్రం సరే అనేసింది రంభ.

ఓ రెండు గంటల తర్వాత

"అబ్బ! ఎంత అద్భుతంగా ఉన్నావ్ కుసుమా! జన్మజన్మలకీ నువ్వే నా భార్యవు కావాలి సుమా" అని ఫణీంద్ర కుసుమ చెవిలో గుసగుసలాడుతుంటే ఆశ్చర్యపోయింది రంభ.

ఆ గదంతా చీకటిగా ఉండటం మూలాన్న అక్కడేం జరుగుతోందో కనిపించకపోయినప్పటికీ ఔరా ఈ మానవులెంత చపలచిత్తులు? అనుకోకుండా ఉండలేకపోయిందామె.

తనలాంటి దేవనర్తకీమణికిట్టి అల్పమానవులపట్ల ఎట్టి ఆసక్తీ తగదు.

'ఇంకెప్పుడూ చచ్చినా సరే భూలోకంకేసి చూడకూడదు!' అని చాలాచాలా గట్టిగా నిర్ణయించుకుంది.

చాలాచాలా గట్టి నిర్ణయాలెప్పటికీ సడలవ్ గదా!

అందుకే అటుపైనామె మరెప్పుడూ భూలోకంకేసి చూడలేదు.

★ ★ ★

మరో ఏడాది తర్వాత...

కుసుమ, ఫణీంద్రలు ముగ్గురయ్యారు...

ఆ మూడో శాల్తీ పేరు రంభ!







# చతుర కతలు

## పెళ్ళి

మిన్నువిరిగి మీదపడినా ముఖంలో చిరునవ్వును చెదరని వ్వని ఆనందరామయ్య ముఖంలో విషాదం తాండవిస్తోంది. "నీ చిరునవ్వు వెనుక దాగివున్న చిదంబర రహస్యం ఏమిటో మాక్కూడా చెప్పి కాస్త పుణ్యం కట్టుకోవోయ్" అనేవారు అతని మిత్రులు, సహోద్యోగులూను. వాళ్లకి చిరునవ్వే సమాధానంగా చెప్పి ఊరుకునేవాడు. ఇంతకీ ఆయన విషాదానికి కారణం మధ్యాహ్నం కొడుకుతో




జరిగిన గొడవ.

ఆయన ఆలోచనలన్నీ తనకీ, కొడుక్కీ మధ్య జరిగిన వాదన చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి. "ఎంతలేసి మాటలన్నాడు తనని. తనేమిటి? తన బ్రతుకేమిటీ? గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించినట్టు నిన్న కాక మొన్న కళ్లు తెరిచిన కుర్రకుంక నీ లెక్కేమిటన్నట్టు ప్రవర్తిస్తాడా? తండ్రినన్న గౌరవం ఏమాత్రం లేకుండా నువ్వంటే నువ్వంటూ మీదమీద కొచ్చి మాట్లాడతాడా? దీనికంతకీ కారణం అసలు తనిచ్చిన అలుసుకదూ? ఏదో తల్లి లేని నలుసు కదా అని ఎంతో గారాబంగా పెంచాడే తను. ఆ విశ్వాసమన్నా లేదే వాడికి..." ఆలోచనల్లో కొట్టుమిట్టాడుతున్న ఆనందరామయ్యను పలకరించాడు అప్పుడే అక్కడకొచ్చిన పరంధామయ్య,

"ఏమిటో ఆనందం! ఎప్పుడూ నవ్వుతూ తుళ్లుతూ కనిపించే నువ్వు ఇంత మౌనంగా, సర్వం కోల్పోయినవాడిలా.... ఏమయింది? " అంటూ.

"ఏం చెప్పన్నా పరంధామం! 'అడ్డాలనాడు బిడ్డలు గానీ గడ్డాలనాడు బిడ్డలు కాదన్నట్టు' బొత్తిగా చెప్పిన మాట వినే స్థితిలో లేరనుకో పిల్లవెధవలు. అందరికీ నీ అదృష్టం రాదు కదా. రత్నాల్లా చెప్పిన మాట వినే పిల్లలు..."

"నీకు మాత్రం ఏమయింది? ఒక్కడే కొడుకాయె.." అన్నాడు పరంధామయ్య.

"అదేకదరా నా బాధంతా. ఆ ఒక్కడూ హైదరాబాద్‌లో ఉద్యోగం వెలగబెడుతున్నాడు. ఇక్కడ ఈ లంకంత కొంపలో ఒక్కణ్ణీ బిక్కుబిక్కుమంటూ గడుపుతున్నానా రోజుల్ని. రెండురోజులు శలవు కలిసొస్తే నిన్ననే వచ్చాడు హైదరాబాదునుంచి. నేనే మంత తానిమాటన్నానని వాడంతగా రెచ్చి

పోవాలి. తండ్రినన్నైనా చూడకుండా అంత లేసి మాటలంటాడా వాడు? "

"ఏమన్నాడ్రా వాడు. అసలు నువ్వేమన్నావు వాణ్ణి...? " విషయం అర్థంకాక అడిగాడు పరంధామయ్య అతడికి దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చుంటూ.

ఆనందరామయ్య, పరంధామయ్య ఇద్దరూ ఒకే ఆఫీసులో పనిచేస్తున్నారు. మరో రెండు మూడేళ్ళలో రిటైరవబోతున్నారు.

రోజూ ఆఫీసునుండి మున్సిపల్ పార్కు దాకా నడుచుకుంటూ వెళ్తారు. అక్కడో గంటసేపు కబుర్లలో మునిగి తేల్తేగానీ వాళ్ళకి తృప్తిగా వుండదు. ఆ రోజు శలవు మీదుండి అలా వ్యాహ్యాళికి నేరుగా ఇంటి నుండి వచ్చిన పరంధామయ్యకు విషాదం మూర్తీభవించి కన్పించాడు ఆఫీసునుండి వచ్చిన ఆనందరామయ్య.

అనునయంగా అన్న పరంధామయ్య మాటలకు రెచ్చిపోతూ "ఏమైనా అంటాడ్రా. వాడు ఇప్పుడో ఆఫీసరుకదా మరి. నేనేమన్నానని... పెళ్ళి మాటెత్తానోలేదో ఇంతెత్తున ఎగిరిపడ్డాడు. నువ్వు చెప్పరా పరంధామయ్యా... నేనేన్నదాంట్లో తప్పేముందో..." ఆవేశం పొంగుతుండగా ఆయాసపడుతూ అన్నాడు ఆనందరామయ్య.

"సరే... సరే... నువ్వు ఊరికే ఆవేశపడకు. నేను మాట్లాడతానుకదా వాడితోటి. పెద్దవాడు, అమ్మలేకపోయినా నిన్నింతవాణ్ణి చేశాడు. నాన్నమాట కాదనకు అని నేను చెప్తాను. నా మాట వింటాడు వాడు"

"అబ్బే... వాడు వినడ్రా. వింటాడన్న నమ్మకం నాకు లేదు. పెళ్ళి మాటెత్తితేనే మండిపడుతున్నాడు. వాడికెంత చెప్పినా పెడచెవిన పెడ్తున్నాడు" ఇంకా కోపంగానే అంటున్నాడు ఆనందరామయ్య.

"సరే... అయితే ఇపుడేం చెయ్యాలని నీ వుద్దేశం" అడిగాడు పరంధామయ్య.

"వాడు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా ఇష్టపడ్డా, ఇష్టపడకపోయినా ఈ పెళ్ళి జరిగి తీరుతుంది. చెప్పవలసిన ధర్మంగా వాడికీ చెప్పాను. వినకపోయినా ఫర్వాలేదు. నేను మాత్రం ఈ పెళ్ళి చేసుకొని తీరతాను" ఖరాఖండిగా అన్నాడు ఆనందరామయ్య.

నోరు తెరిచేశాడు పరంధామయ్య.

**–సూరిపండు**

---

## గ్యారంటీ

మొదటి పెళ్లిచూపుల్లోనే పెళ్లికూతురు అప్పారావుకి బ్రహ్మాండంగా నచ్చింది. ఆమాటే అమ్మానాన్నలతో చెప్పాడు.

పెళ్లికూతుర్ని కొన్ని ప్రశ్నలడగాలని అప్పారావు కోరిక. అందుకోసం ప్రశ్నలు కూడా రెడీ చేసుకున్నాడు.

తన కోరికను వాళ్లమ్మతో చెప్పాడు. ఆమె ఆడ పెళ్లివారితో మాట్లాడి ఏకాంతంగా మాట్లాడటానికి ఒప్పించింది.

మాధవికి అసలు పెళ్లిచూపులంటేనే ఒళ్లుమంట. తల్లితండ్రుల బలవంతంమీద అంగీకరించింది. కానీ ఇంటర్వ్యూ అనేసరికి పెళ్లికొడుకు మీద ఓ విధమైన చిరాకు ఏర్పడింది.

ఎన్నో ప్రశ్నలడగాలనుకున్నాడు అప్పారావు. కానీ ఎలా మొదలుపెట్టాలో అర్థంకావటంలేదు. గొంతు తడారిపోయినట్లయింది. కాసిని మంచినీళ్లు తాగి "మీ పేరు? " అని అడిగాడు ఎట్టకేలకు.

అప్పటికే ఒళ్లుమండి ఉన్న మాధవి "పోలేరమ్మ" అంది.

అదిరిపడ్డాడు అప్పారావు. "అదేమిటీ? నీపేరు మాధవి అనికదా అన్నారు మీ పెద్దలు".

"అసలు పేరు పోలేరమ్మే. స్కూలుకి వెళ్లడం మొదలుపెట్టినప్పటినుంచీ నేను పెట్టుకున్న పేరు రాధామాధవి."

"అలాగా! బ్రతికించావ్! ఏం చదువుకున్నావ్? "




"అయిదోక్లాసు"

"అయిదో తరగతా? ఆ తరవాత ఎందుకు చదువుకోలేదు?"

"మగపిల్లలంతా ప్రేమలేఖల్తో నావెంట పడి వేధిస్తున్నారని మానాన్న మాన్పిం చాడు."

'అంత చిన్నవయసులోనే ఏడ్పించారా? అనుకున్నాడు కానీ తిరిగి అడగలేదు.

"నీకు ఏదేవుడంటే ఇష్టం?" "ఏ రంగు ఇష్టం?" "ఏ కూర ఇష్టం?"

"సినిమాలు చూస్తావా?" "ఏ హీరో అంటే అభిమానం?"

మార్కెట్‌లో ప్రతి వస్తువుకూ అంటే ఫ్యాన్, టి.వి, గ్రైండర్, ఫ్రిజ్ దేనికైనా ఎన్నో కొన్ని సంవత్సరాలు గ్యారంటీ ఇస్తు న్నారు కదా!"

"ఔను" అన్నాడు అప్పారావు.

"నాకు ఎమ్మే దాకా చదివి డాక్టరేట్ చేయాలని ఉంది చదివిస్తారా? చదువయ్యే దాకా నన్ను ముట్టుకోనని గ్యారంటీ ఇస్తారా?"

అప్పారావు ముఖం మాడిపోయిన అప్ప డంలా తయారయింది. చెమటలు పట్టే శాయి. ఏం జవాబు చెప్పాలో అర్థంకాలేదు.



"పాటలు పాడతావా?" "నాట్యం వచ్చా?" "వంట చేస్తావా?"

వంటి ప్రశ్నలతో ఓ అరగంట ఇంటర్వ్యూ తో కాలక్షేపం చేశాడు, ఆమె అందాన్ని చూస్తూ.

దాంతో అప్పారావు మాధవి దృష్టిలో ఓ చవటగా ముద్రపడిపోయాడు.

"మీరు నాకు బాగా నచ్చారు" అన్నాడు అప్పారావు ఆనందంగా.

"అప్పారావు గారూ! మీరు నన్ను చాలా ప్రశ్నలడిగారు కదా! నేనో ప్రశ్న అడుగు తాను. సమాధానమిస్తారా?" అంది మాధవి.

"అడుగు" అన్నాడు అప్పారావు ఆనం దంగా.

"అయ్యబాబోయ్! ఇది పిల్లకాదు. పిడుగు" అనుకున్నాడు.

"నేను పెళ్లి చేసుకోనే అమ్మా! అన్నాడు గదిలోంచి హాలులోకి వచ్చీరాగానే.

"ఏమిటిరా బాబూ! అరగంట క్రితం నచ్చిందన్నావు కదా!" అంటూ ఎంత బతి మిలాడినా కారణం ఎవరికీ చెప్పలేదు అప్పారావు.

"తిక్క కుదిరింది వెధవకి" అనుకుంది మాధవి.

– హైమవతీసత్య



# ఏరిన ముత్యాలు

★ ఇద్దరు అమ్మలక్కల కబుర్లు రెండు కుటుంబాలను సర్వనాశనం చెయ్యగలవు.

—అరబ్బీసామెత

★ అధికారం కట్టబెడితే అసలు రంగు బయటపడుతుంది.

—యుగోస్లేవియా సామెత

★ పెళ్ళి ఒకసారి చేసుకోవడం ధర్మం! రెండుసార్లు చేసుకోవడం అవివేకం!! మూడుసార్లు చేసుకోవడం ఉన్మాదం!!

—డచ్ సామెత

★ నాకు రొట్టె పెట్టేవారు ఎందరో వున్నారు. కానీ ఎవరూ మా అమ్మకు సాటిరారు. మనుష్యులకు జ్ఞానం నాలుగు రకాలుగా సంక్రమిస్తుంది. గురువు చెప్పడంవల్ల, తనంత తానుగా తెలుసుకోవడం వలన, సహచరుల వలన మరియు అనుభవం వలన.

—సంస్కృత సామెత

★ డబ్బు మాట్లాడుతుంటే సత్యం మౌనం వహిస్తుంది.

—రష్యా సామెత

★ ఒక పౌను చదువుని ఆచరణలో పెట్టడానికి పది పౌండ్ల లోకజ్ఞానం కావాలి.

—పర్షియన్ సామెత

★ ఎముకలు విరిగేటట్లు పనిచేస్తే దంతాలు అరిగేటట్టు తినవచ్చు.

—మలయాళ సామెత

★ వందమంది కలిసి ఒక దుకాణం ఏర్పరచుకోవచ్చు కాని ఒక స్త్రీయే గృహాన్ని తయారుచేస్తుంది.

—చైనా సామెత

★ అలవాట్లు మొదట్లో సాలెగూళ్లు. ఆపైన ఇనుప గొలుసులు.

—స్పానిష్ సామెత

★ ఆకారాన్ని చూసి మనసును అంచనా వేయకు. ఒక్కోసారి ఆకారం ఎంత భయంకరంగా వుంటుందో మనసు అంత నిర్మలంగా వుండొచ్చు.

—గ్రీకు సామెత

★ భగవంతుడు స్వర్గాన్ని పరిపాలిస్తాడు. ధనం భూమిని పరిపాలిస్తుంది.

—స్విట్జర్లాండ్ సామెత

★ అబద్ధాలకోరుకు ఒక్కటే శిక్ష- అతడు నిజము చెప్పినా నమ్మకుండా వుంటే సరి.

—బాబిలోనియన్ సామెత

★ చెరకు వంకరైతే తీపి పోతుందా?

—కన్నడ సామెత

సేకరణ: పొన్నమండ శ్రీనివాసరావు

# 'తమసోమా....' పై సమీక్షలు

జూలై 'చతుర'లో ప్రచురితమైన సింహప్రసాద్ నవల 'తమసోమా....' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## అవినీతికో చురక

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

జూలై నెలలో ప్రచురితమైన సింహప్రసాద్ నవల 'తమసోమా...' ఆద్యంతం చాలా అద్భుతంగా ఉంది. ఈ నవలలో రచయిత అవినీతిపై దండెత్తిన విధానం పాఠకులను ఆలోచింపచేసేదిగా ఉంది. సమాజంలో పెద్ద హోదాలలో ఉన్న వ్యక్తుల దగ్గరనుండి అతి చిన్న ఉద్యోగిదాకా అవినీతి, లంచగొండితనంతో ప్రజలను బాధించి వారినుండి వచ్చిన సొమ్ముతో విలాసవంతమయిన జీవితాన్ని గడుపుతున్నారు. చిన్నచిన్న పనులు మొదలుకొని ప్రతి పనికీ లంచాలకు అలవాటుపడి తమ విలాసాల కోసం అడ్డదారులు తొక్కి ప్రజల ప్రాణాలతో చెలగాటం ఆడుతున్నారు. సమాజంలోని అవినీతిని, కుళ్ళును కడిగేందుకు నడుం బిగించిన గాంధీ వంటి పాత్ర మలచిన తీరు నేటి యువతకు స్ఫూర్తిదాయకంగా ఉంటుంది.



అవినీతి ప్రబలి స్వార్థం తారస్థాయిని చేరితే పరిణామాలు ఎలా ఉంటాయో నవలలోని పాత్రలద్వారా తెలియజెప్పారు. విదేశీ మోజులో నేటి యువత ఏవిధంగా ఉగ్రూతలూగుతోందో, డాలర్ల మత్తులోపడి వారు చివరకు సాధించేదేమిటో రచయిత తనదైన శైలిలో వైవిధ్యంగా చిత్రించారు. మనదేశపు ఉత్కృష్టమైన సంస్కృతి, సాంప్రదాయాల్ని మరచిపోయి వాటిని బూజుపట్టిన సిద్ధాంతాలుగా భావించి విదేశీ మోజులో పాశ్చాత్యదేశాల సంస్కృతులను నేటి యువత అనుకరిస్తోంది. వాటివలన జరిగే పర్యవసానాలు ఎలా ఉంటాయో రచయిత స్పష్టంగా తెలియజేశారు.

నేటి యువకులలో వందమందిలో ఒకరైనా గాంధీలా మారితే మనదేశంలో లంచగొండితనం, అవినీతిని ఎండగట్టి దేశాన్ని పటిష్టమైన, మహోన్నతమైన అగ్రరాజ్యంగా మార్చడం స్వప్నమేమీ కాదు. మనదేశంలో మిగతా దేశాలకంటే సహజవనరులు ఉన్నప్పటికీ ఏ వనరులూ లేని చిన్న రాజ్యాలు సాధించిన ప్రగతిని కూడా సాధించలేకపోవడానికి

కారణం 'లంచగొండితనం'. దానిని నిర్మూలిస్తే మనదేశం కూడా అగ్రరాజ్యాల సరసన చేరుతుందనడంలో అతిశయోక్తి లేదు.

భారత స్త్రీగా, గృహిణిగా భర్త అవినీతిని ఎదిరించలేక తండ్రి నుండి నేర్చుకున్న దేశభక్తిని విడనాడలేక కొడుకును సమర్థించలేక గాంధీ తల్లి పడే ఆవేదనను చక్కగా వర్ణించారు. చివరకు ఆమె తీసుకున్న నిర్ణయం కూడా సబబుగా ఉంది.

తప్పు చేసిన వ్యక్తి లోకానికి భయపడక పోయినప్పటికీ తన మనఃసాక్షికి మాత్రం భయపడతాడని, పైకి గంభీరంగా కనిపించినా లోలోన అశాంతికి గురౌతాడని గాంధీ తండ్రిపాత్ర ద్వారా రచయిత తెలియజెప్పారు.

నీతి, మానవత్వం నైతిక విలువలకు ప్రాధాన్యత ఇవ్వడం వంటి లక్షణాలు చిన్నప్పటి నుండి పిల్లలకు నేర్పాల్సిన అవసరం తల్లిదండ్రులకు ఎంతైనా ఉంది. మొత్తం మీద ఈ నవల పాఠకులకు మంచి సందేశాన్ని చేరవేసింది.

**–మహావాది లక్ష్మీప్రసన్న**
తెనాలి-522 201

## ఈనాటి భీష్మాభిమన్యులు

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

**జాతిపిత** గాంధీజీపట్ల 'పాకిస్థాన్ ఆవిర్భావానికి ప్రబల కారకుడనీ, ఓ కొరివి దయ్యాన్ని మనకి వదిలి వెళ్ళారని-లాంటివి' కొన్ని అపోహలూ, అపనమ్మకాలూ- నేటి భారత యువతకి ఉన్నాయి. అలాంటి తరుణంలో గాంధీ నామధేయుడైన ఓ యువకుడు గాంధీజీ భావాల్నీ ఆలోచనా సరళినీ జీర్ణించుకొని, ఆచరణలోపెట్టి, నేటి యువతకి ఆదర్శంగా నిలిచాడు అంధకారంలో చిరుదివ్వెను వెలిగించిన చందాన 'తమసోమా...!' నవలలో. మాట్లాడితే అమెరికా- అమెరికా అనే నేటి యువత తమ అర్హతానర్హతలను ఎరగక ఆ దేశానికి ఎగిరిపోవాలని పలవరిస్తున్న ఈ దేశంలో అన్ని అర్హతలూ ఉండి జాతీయత, దేశభక్తిని పాటించే 'గాంధీ'లు ఎందరో మన మధ్యనే ఉన్నారని ఎత్తిచూపారు రచయిత సింహప్రసాద్.

మహాభారతంలో అభిమన్యునికి తాత భీష్ముడు సలహాలిచ్చినట్లూ ప్రోత్సాహ పరిచినట్లూ దాఖలాలు లేవు. కాని వర్తమాన భీష్ముడూ- అభిమన్యుడులా హృదయానికి హత్తుకుపోయే పాత్రలు స్వాతంత్ర్య సమర యోధుడు తాతగారూ, ఆయనకి తగ్గ మనవడు 'గాంధీ'. అలా కొత్తదారులను ప్రశస్తపరచే తాతలు మన మనవలకి దొరికితే ఎంత భాగ్యమో! అనిపించాయి ఆ పాత్రలు.

CHARITY STARTS FROM HOME అన్నట్లు తన తండ్రి, అన్నలతో యింటినుండే అవినీతి ప్రక్షాళనకి పూనుకోడం కథకోసంగాక సహజంగా రూపుదిద్దుకొంది.

గాంధీ 'ఫియాన్సీ' అనుకున్న 'సహజ' పాత్ర సహజత్వాన్ని కోల్పోయి అతని మార్గం నుండి తప్పుకోడం, ఆ స్థానాన్ని శిరీష పాత్ర భర్తీచేయడం రచయిత కథాకథన స్థాయిని చాటిచెపుతుంది. తాత, మనవలతోబాటు శిరీష పాత్రా చెప్పుకోదగ్గదే.

గాంధీ తండ్రిలాంటివారు అహంకార ప్రవృత్తితో ఎంతటి దారుణానికైనా పాలుపడడం సహజమే. అయినా ఆ పాత్రకి కొడుకే కొరకరాని కొయ్యగాబట్టి పర్యవసానం ఆత్మహత్యేనని ఊహించినట్లుగానే జరిపారు కృతికర్త సింహప్రసాద్‌గారు. మన మధ్య గాంధీ శిరీషలు ఉంటే ప్రజల అండదండలు ఎపుడూ ఉంటాయని చాటారు.

'చతుర' యిలాంటి నవలలకి వేదికగా నిలిచి పాఠకులకి వేడుక చేయడం ఎంతో




ముదావహం. సద్వినియోగపరుచుకొనే రచయితలూ ప్రశంసనీయార్హులే.

—ఎస్. నారాయణరావు
గాయత్రీనగర్- 500 074.

## వందేమాతరం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

**ఆ**ణిముత్యాల్లాంటి నవలలతో నెలనెలా మమ్మల్ని అలరిస్తున్న 'చతుర' ఈ నెల అందించిన మాణిక్యం 'తమసోమా...!'

రచనలు మనుష్యులను మారుస్తాయా? సమాజానికి అవి చేస్తున్న 'మేలు' ఏమిటి? అని అంటే అవి చదివిన పాఠకుల్లో పది మందికి ఒక్కరిలోనయినా మార్పు వస్తే ఆ రచనలు మానవాళికి మేలు చేస్తాయనే చెప్పవచ్చును. దేశంలో అవినీతి పేరుకుపోతోందని గద్దెలెక్కి ఉపన్యాసాలు దంచేవాళ్ళే కానీ ఒక్కరయినా దాన్ని నిర్మూలించడాన్కి పూనుకోకపోవడం నిజంగా శోచనీయం. తమసోమా... లో కథానాయకుడు గాంధీ అవినీతికి ఎదురీది, ఎదుర్కొని, ఆ బాటలో తండ్రి అయినా విడువక శిక్షించి అతనిలో పశ్చాత్తాపంతో కూడిన మార్పును (మరణించేముందయినా) తీసుకురాగలిగాడు. దేశంలో అవినీతిని తెలియచెప్పే రకరకాల రచనలు చదివాము. కాని కొన్ని చోట్ల మంచి కూడా జరుగుతుందని పేర్లతోసహా ఉదహరిస్తూ పాఠకులకు తెలియజేయడం ఈ రచయిత గొప్పతనం. తన ఆదర్శాలకు ఆటంకం కల్గుతుందన్న ఉద్దేశ్యంతో ప్రేమను సైతం త్యాగం చేసిన గాంధీ తన ఉద్యమంలో (వందేమాతరం) శ్రమిస్తూ తన ప్రాణాన్కి ముప్పుకల్గుతుందని తెల్సినా, ఎంతో ధైర్యంగా సాగిపోతాడు. నేడు యువతరానికి ఇలాంటి నాయకుడు కావాలి. ఇలాంటి నాయకుల పాలనలో దేశం పురోగమిస్తుంది. అన్యాయాన్ని సహించి ఊరుకోక (మనకెందుకులే అని) ఎదుర్కొని పోరాడటమే మానవకర్తవ్యం. తన ప్రత్యేకమైన శైలితో, కథనంతో, ఏకబిగిన చదివింపచేసిన రచయిత సింహప్రసాద్‌గారు అభినందనీయులు.

—జీడిగుంట ఉషారాణి
సిర్పూర్ కాగజ్‌నగర్- 504 296

## పంకంనుండి పద్మం

*(నాలుగో బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

పరిత్రాణాయ సాధూనాం- వినాశాయచ దుష్కృతాం... అన్న భగవద్గీత శ్లోకం మనకు ఎరుకే. దాని అర్థం కూడా మనకు తెలుసు... తెలిసినా మనం తెలియనట్లే ఉంటాం. మనకెందుకులే అనుకుంటాం. ఇచ్చే చోట ఇచ్చి పుచ్చుకొనే చోట పుచ్చుకుని మన పనులు జరుపుకుంటాం. స్వార్థం, అవినీతి, లంచగొండితనాలను ఎదిరించక, అప్పటికప్పుడు దులిపేసుకుంటాం. సరిగ్గా అలాంటి సమయంలో మనల్ని మనకు గుర్తుచేయడానికా అన్నట్లు జూలై నెల చతుర నవల 'తమసోమా' వచ్చింది.

ధర్మం నాలుగు పాదాలా నడవలేనపుడు, ఒంటికాలితో కుంటుతూ నడుస్తున్నపుడు కల్కి అవతారమెత్తనవసరంలేదు. మనలోనే మన మధ్యనే ఒక వ్యక్తి తన శక్తిమేరా స్వార్థం, హింస, అవినీతులను ఎదిరిస్తాడు. స్వాతంత్ర్య సమరంలో పరదాస్యాన్నుండి విముక్తినిచ్చిన గాంధీ మహాత్ముడి పేరే ఈ నవలలోని పాత్రపేరూ కావటం విశేషం.

పంకంనుండి పద్మం జనించినట్లే ఒక అవినీతి పరుడి కొడుకుగా పుడతాడు గాంధీ. తండ్రినే బయటపెట్టి అవినీతినెదిరించడంలో తరతమ భేదాల నెంచడు. ఎన్ని తరాలైనా తప్పుపట్టని మానవతను ఆనాడు మహాత్మాగాంధీ తన తనువెల్లా ఎలా నింపుకున్నాడో, ఆ గాంధీ ప్రభావంతో



నిండి, తన తాత ప్రేరణ పొంది మరో గాంధీ అవుతాడు ఈ నవలలోని గాంధీ.

స్వార్థమనే విషయాన్ని నిస్వార్థతవైపు కొనిపోయిన వైనం చాలా బాగుంది. అవసరమైనచోట మహనీయుల జీవితాలలోని సంఘటనలను, మహితోక్తులను ఉపయోగించడంలో కథను ముందుకు పరుగులెత్తించి చతురతను చూపాడు రచయిత. ఆ మహనీయ సంఘటనలు నవల నడకకు బలాన్నిచ్చాయి. కథలో వర్థమాన సంఘటనలను చాలా ఉపయోగించుకున్నారు రచయిత. అందువలన ఆ సంఘటనలను వివరించడంలో కొంత భాగం వ్యాసంలా తోస్తుంది. ఈ ఒక్క విషయం తప్పితే- నిజంగా ఈ నవల చీకటినుండి వెలుగులోకి తీసుకెళ్ళి 'తమసోమా' అయ్యింది.

–టి. తిప్పారెడ్డి
మదనపల్లె -517 325.

## చీకట్లో చిరుదీపం

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

జాతి మూలుగుల్ని పీల్చి పిప్పిచేస్తూ విదేశాలలో మన పరువుప్రతిష్టలను దారుణంగా దిగజార్చుతున్న అవినీతి భూతాన్నీ, అది ఆవహించిన వారి మనః సంఘర్షణనూ, బాహ్య వ్యవహారశైలినీ రచయిత సోదాహరణంగా, సజీవ పాత్రలద్వారా ఆవిష్కరింపచేశారు. మనిషి తనలోని దురాశనీ, విపరీతమైన ధనాకాంక్షని, దుర్మార్గాన్ని, పచ్చిస్వార్థాన్ని అరికట్టుకోకపోతే సమాజం భ్రష్టుపట్టిపోతుందని నొక్కి వక్కాణించారు.

ఎట్టి పరిస్థితులలోనూ సిద్ధాంతాలు ఓడిపోగూడదని నమ్మే గాంధీ పాత్ర ఈ నవలకే తలమానికం. తన సిద్ధాంతాలతో విభేదించే ప్రేయసి విషయంలో కూడా అంత తొందరగా రాజీపడనటువంటి అచంచలమైన దేశాభిమానం గల గాంధీలాంటి వ్యక్తులు నేటి యువతలోగాని, రాజకీయ నాయకులలోగాని అరుదని చెప్పవచ్చును. తాతగారి గీతోపదేశంతో, శిరీష మొదలైన స్నేహితుల అండతో అవినీతిపై సమర శంఖారావాన్ని పూరించిన గాంధీ ప్రస్తుత సి.వి.సి. విఠల్‌గారి పంథాలో మరో అడుగు ముందుకేసి అవినీతిపరుల నివాస ప్రాంతాలలో, వారికి గౌరవం లభించకుండేలా చేసిన పోరాటం, ఆ పోరాటాన్ని గాంధీ తండ్రిపైనే గురిపెట్టించటం ద్వారా రచయిత ఆ పాత్ర ఔన్నత్యాన్ని మరింతగా పెంచారు.

ఆద్యంతం విసుగులేకుండా చదివింపజేసిన రచయిత కథనంలోని కాలేజీ సన్నివేశాలు నేటి యువతరం మహాత్ముల చరిత్ర నుండి స్ఫూర్తిపొంది జాతీయతాభావాన్ని పెంపొందించుకోవలసిన అవసరాన్ని సూచిస్తున్నాయి. భోగలాలసుడైన వ్యక్తి అవి సాధించడంకోసం ఎటువంటి నేరానికైనా వెనుదీయడు. అనుక్షణం భయంతో బతుకుతూ ఆత్మవంచన చేసుకుంటాడు. మరణించబోయేముందు గాంధీ తండ్రి పడిన అంతర్మథనం చదివిన కొందరికైనా ఈ నవల కనువిప్పు కలిగించితే రచయిత లక్ష్యం సిద్ధించినట్లే. అవినీతిపై జరిగే పోరాటానికి కొత్త పంథాను సూచించిన ఈ నవల చీకట్లో చిరుదీపమే.

–జె.వి.రమణ
కొత్తగూడెం- 501 101.

★

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060. Cuddapah: 70011: Tadepalligudem: 28881: Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78